# ఏమిటీ జీవితాలు

మాలతీ చందూర్



క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి ● విజయవాడ 2.

## శ్రీమతి మాలతీ చందూర్ ఇతర రచనలు

| | | |
|---|---|---|
| మనసులోని మనసు | రు. | 18-00 |
| ఆలోచించు | .... | 9-00 |
| అందాలు అలంకారాలు | .... | 7-50 |
| మహిళలకు మధురజీవనం | .... | 7-50 |
| ప్రశ్నలు – జవాబులు | .... | 15-00 |
| జాబులు – జవాబులు | .... | 12-00 |
| వంటలు పిండివంటలు | .... | 18-00 |

# శ్రీమతి యద్దనపూడి
# సులోచనారాణి నవలలు

| | | |
|---|---|---|
| నీరాజనం | రు. | 16-00 |
| సహజీవనం | .... | 15-00 |
| కీర్తి కిరీటాలు | .... | 16-00 |
| రాధాకృష్ణ | .... | 13-00 |
| ప్రేమలేఖలు | .... | 14-00 |
| పార్థు | .... | 12-00 |
| స్నేహమయి | .... | 12-00 |
| సంసారరథం | .... | 10-00 |
| ఈదేశం మాకేమిచ్చింది | .... | 12-00 |
| అనురాగతోరణం (కథలు) | .... | 10-00 |
| దాంపత్యవనం | .... | 15-00 |
| కలల కౌగిలి | .... | 15-00 |
| మధురస్వప్నం | .... | 15-00 |

# ఏమిటీ జీవితాలు

'రా - రా నా స్వామి - రారా' అంటూ మధురవేదనతో కృష్ణుని వేడుకుంటున్నది సత్యభామ.

సురేఖ వొళ్ళంతా మదనతాపంతో మెలితిరిగిపోతున్నది. పాటకి లయబద్ధంగా ఆమె అడుగులు వేస్తూ - అభినయం చేస్తున్నది. నృత్తకి వొళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోతున్నది. అయితే అది గంటసేపటి నుంచీ చేస్తున్న నృత్యంవల్లకాక - విరహతాపంవల్ల సత్యభామకి తెగ చెమటలుపోస్తున్నాయేమోనన్న భావం ప్రేక్షకులకి కలిగించేటట్లు నృత్యం చేస్తున్నది సురేఖ.

వేదికమీద వున్నపుడు ప్రేక్షకులవంక చూడకూడదు - అని గురువుగారి ఆదేశం. చూపు ప్రేక్షకులమీదవున్నా - మనసుమటుకు గురువుగారి తాళానికి లయబద్ధంగా. అడుగులు వెయ్యటంలోనే లగ్నం చెయ్యాలి. సురేఖ అభినయం చేస్తున్నది - తాళానికి లయబద్ధంగా పాదాలు కదులుతున్నాయి. మువ్వలు ఘల్లున మోగుతున్నాయి.

సైడ్‌వింగ్‌లోంచి - మువ్వల ధ్వని చీల్చుకుని - కంఠాలు వినిపిస్తున్నాయి. సురేఖ గురువు తాళం వింటూ అభినయం చేస్తూనే వుంది.

'అంతా బాగానే వుంటుందిగాని – ఆ నోరు చూడు ఎలా వంకరగా వుందో ?'

'ఉష్ – వూరుకో ఎవరైనా వింటారు.'

'వింటేయేం ? ఈ సురేఖకి దేముడు అందం, అభినయం, లాస్య అన్నీ యిచ్చాడు. ఆ నోటిదగ్గిర చూడు నవ్వితే వంకర.... ఘోరం....'

'అరే – వూరుకోమంటుంటే'

సురేఖ అడుగులు తడబడ్డాయి. పాదం లయతప్పింది. నిలదొక్కుకుని – మళ్ళీ సర్దుకుని, అడుగు వేసింది. గురువుగారి కళ్ళు విస్ఫులింగాల్లా వున్నాయి. ఆ కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. మళ్ళీ వొళ్ళంతా తెగ చెమటలు.

ఆ అయిటమ్ అయిపోయింది. సభికులు చప్పట్లు చరిచారు హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. మళ్ళీ తెరఎత్తారు. నర్తకి సురేఖకి పళ్ళెంలో పట్టుచీరె, పళ్ళూ, పువ్వులూ తీసుకొచ్చి కానుకగా యిచ్చారు సురేఖ ఆ కానుక సందుకుంటూ కళ్ళెత్తి ఆ యిద్దరివంకా చూసింది. యిద్దరూ సైడ్‌వింగ్‌లో నుల్చుని తన నోరు వంకరగా వుందని మాట్లాడుకున్న యువతులు. మరోయువకుడు గురువుగారికి పట్టుబట్టలు సమర్పించుకుని – ఆయనకి నమస్కారంచేసి వేదిక దిగి వెళ్ళిపోయాడు. సురేఖకి కడుపులో కసిగా వుంది. 'నాకు మీ కానుకలొద్దు – చీరె పట్టుకుపొండి' – అని విసిరికొడదామన్నంత కోపం వచ్చింది. కాని, అప తాను చెయ్యలేదు. చెయ్యదు. నృత్యం చెయ్యటం తన వృత్తి. వేదిక నెక్కాక తనని ఏమర్శించే హక్కు ప్రేక్షకులకి వుంది. అందునా, అయిదు వేల రూపాయలు యిచ్చి – ఈ పెళ్ళి రిసెప్షనుకి నృత్యం పెట్టించు కున్నారాయెను. అందుచేత తనకి మూతివంకర అనవచ్చు – మనసు వంకరా అనచ్చు.

పెళ్ళిళ్ళలో నాట్యం చెయ్యటం అంత దౌర్భాగ్యం అవేగాని మరొకటి లేదు. ఈ విషయం తన గురువుగారు అంటూనే వుంటారు. పెళ్ళికొచ్చిన అతిథులు ఇటు నూతన వధూవరులని చూడరు – అటు వేదికమీద నాట్యాన్ని చూడరు. తమ చీరెలు, తమ నగలు, పిల్లల ఏడుపులు. ఈ గొడవల్లో వుంటారేతప్ప ఎవరూ నాట్యాన్ని శ్రద్ధగా చూడరు. భోజనాలకి వెళ్ళేవారు, భోజనాలుచేసి వచ్చి – కిళ్ళీలు నములుతూ నాలిక పండిందో లేదో చూసుకునేవాళ్ళు, బర్రున కుర్చీలు లాగుతూ, వేదికవైపుకి వీపుతిప్పి కూచుని కబుర్లు చెప్పుకునేవాళ్ళు – ఇటువంటి శ్రద్ధలేని ప్రేక్షకులముందు గజ్జకట్టాలంటే సురేఖకి చచ్చే చావుగా వుంటుంది. ఇంత కంటే రసజ్ఞులైన పదిమంది ప్రేక్షకు లుంటేచాలు తను వొళ్ళు మరిచి, నాట్యంలో లీనమై పోయి, అభినయం చేస్తుంది. ఈ వేయిమంది పెళ్ళివారికి తన నృత్యం అక్కరలేదు – తనలోని ప్రతిభా అక్కరలేదు – ఫలానా సురేఖ డాన్సుతో రిసెప్షను పెట్టామన్న గొప్పతప్ప!

పళ్ళెం అందిస్తున్న యువతులవంక చూసింది సురేఖ. ఒకమ్మాయి పొడవుగా తెల్లగా వుంది. పట్టుచీరె మడతలు నలక్కుండా షోకేసులో బొమ్మలాగా కట్టుకుని నుల్చునుంది, కుంకంభరిణ పట్టుకుని. రెండో అమ్మాయి చెక్కపని చేసిన వైలెట్ రంగు జార్జిట్ చీరె – అదేరంగు స్లీవ్‌లెస్ జాకెట్ – జుట్టు సన్నగా ముడివేసుకుని వుంది. ఈ యిద్దరూ తన నొరువంకర అని వెక్కిరించిన యువతులు. వేదికనెక్కి రెండున్నర గంటలసేపు నాట్యంచేసి వందలసార్లు ప్రదర్శన లిచ్చిన – తనని వెక్కిరించిన యువతులు వీరు. అయిష్టంగానే చెయ్యి చాపింది. బలవంతాన చిరునవ్వుని ముఖంలోకి తెచ్చుకుంది సురేఖ: తెరపడింది. ఒక్క అయిదునిముషాలపాటు విశ్రాంతి. తరువాత అయిటంకి దుస్తులు మార్చుకోవాలి.

సురేఖ గుండెలు పీచు పీచు మంటున్నాయి. గ్రీన్‌రూమ్‌లోకి వెళ్ళ కనికి ధైర్యం చాలటంలేదు. అక్కడ తనకోసం, గురువుగారు సిద్ధంగా

వుండనే వుంటారు. ఆయన తిట్లు మొదలుపెడితే - దానికి అడ్డు అంటూ వుండదు. తాళానికి లయబద్ధంగా తన పాదం పడలేదని ఆయన గ్రహించు కున్నారు. ఈ చిన్నతప్పు ప్రేక్షకులు గ్రహించకపోవచ్చు. కాని గురువు గారికి వెయ్యికళ్ళు. ఆయన ఏ చిన్న పొరబాటునికూడా సహించలేరు.

'ఈ అయిటమ్ అన్నా వొళ్ళుదగ్గిరపెట్టుకు చెయ్యి. మరోసారి తప్పు అడుగు వేశావా - తెర దించమని ప్రోగ్రామ్ ఆపేస్తాను' ఫీంకరించి - కూల్‌డ్రింక్ తాగి - మైక్‌దగ్గిరకివెళ్ళి కూచున్నారు గురువుగారు.

సురేఖ బ్రతుకు జీవుడా అనుకుని, పులినోటినుంచి తప్పించుకున్న మేకపిల్లలాగా వేదికమీద కొచ్చింది. తరువాత కార్యక్రమం సాఫీగా జరిగిపోయింది.

మేకప్ తుడుచుకుని, డాన్స్‌డ్రస్ తీసేసి, ఆఖరి బాచ్‌లో వధూవరులతోపాటు భోజనాలకి కూచున్నారు - నృత్యంలోని బృందమంతా. సాధారణంగా ప్రోగ్రామ్‌ముందు సురేఖ ఏమీ తినదు - గ్లూకోజ్‌వాటర్ తప్పించి బరువుగా వుండేవి ఏమీ తినదు. ప్రోగ్రామ్ అయిపోయాకకూడా భోజనం సరిగ్గా తినలేదు. ఎక్సైట్‌మెంటువల్లనూ, విపరీతమైన దైహిక శ్రమచేతనూ సురేఖకి భోజనం సయించదు. ఇలాంటి పెళ్ళిళ్ళప్పుడుమటుకు మర్యాదకి, ప్రోగ్రామ్ అయిపోయాక పెళ్ళిభోజనం చేస్తుంది.

'చాలా గొప్పగా చేశారండి. మీ డాన్స్‌ప్రోగ్రామ్ పెట్టించాలని మే మంతా కలలుకన్నా మనుకోండి. చాలాబాగుంది' మెచ్చుకుంటున్నది, వేదిక మీదకి వచ్చి కానుకపళ్ళెం యిచ్చిన అమ్మాయి.

అది ఎంత అబద్ధమైన పొగడ్తో సురేఖకి తెలుసు. ఈ అమ్మాయే తన నోరు వంకర అని హేళనగా విమర్శించింది. ఇప్పుడు గొప్పగా చేశా నంటున్నది. ఈ ప్రశంసలు, యీ రంగుదీపాలు, ఈ గిల్టునగలు - ఇవ వొట్టి అబద్ధాలు. వీళ్ళు యివ్వబోయే అయిదువేలు ఒక్కటే నిజం.

పొట్టకూటికోసం నృత్యం అభ్యసించింది. ఇది కళారాధనాకాదు, పాడూ కాదు. కేవలం జీవనాధారం.

వాయిద్యాలూ, మేకప్‌సామాన్లూ, పాట పాడేవారూ అంతా 'వాను'లో ఎక్కారు. గురువుగారూ, తానూ మిగిలారు చివరికి.

'నేనూ వాన్లోనే వెడతానండీ' అంది సురేఖ నెమ్మదిగా.

'వొద్దు. వాళ్ళు మనిద్దరినీ డ్రాప్ చేస్తారు, వుండు' అన్నారు గురువుగారు.

సురేఖ గుండెల్లో పెద్దరాయి పడింది. ఏ పరిస్థితి నయితే తాను ఎదుర్కోకుండా తప్పించుకోవాలనుకుంటున్నదో – అదే ప్రత్యక్షమవుతోంది.

కారెక్కి కూచుని సురేఖ అలసటగా కళ్ళు మూసుకుంది.

'ఈరోజు నీ అభినయం – ఎలా వుందో చెప్పమన్నావా?' గురువుగారి కంఠం. ఇసకమీద యినపముక్కతో రాసినట్లు : కరకరమంటున్నది. రెండున్నరగంటలసే అరిచి అరిచి ఆయన కంఠం రాచుకుపోయింది.

సురేఖ మాట్లాడలేదు.

'నువ్వు అభినయం చేస్తుంటే – నాకు ఏడుపొచ్చింది. సత్యభామ యింత ముసలిసుండా అని దుఃఖం వచ్చింది. నిన్ను చూస్తే ఆరుగురు పిల్లలనికన్న ముసలితొత్తు జ్ఞాపకం వచ్చింది. విలాసవతియైన సత్యభామ మటుకుకాదు.'

సురేఖ కళ్ళుమూసుకుంది. కనురెప్పలకిందనుంచి కన్నీళ్ళు నిశ్శబ్దంగా జారిపోతున్నాయి.

'నువ్వు సుబ్రభ్రంగా పెళ్ళిచేసుకుని, ఏడాదికో పిల్లనిగని, మమ్మల్ని రక్షించు. నీది నృత్యంకాదు, ముసలిపీనుగ చేసే చిందులాట. నీకు లక్షసార్లు చెప్పాను. ప్రోగ్రామ్‌ముందు వెర్రివేషా లెయ్యొద్దని. నీలాంటివాళ్ళకి నాట్యకళమీద భక్తిలేదు, శ్రద్ధలేదు. దొమ్మరాట ఆడటానికికూడా పనికిరావు. నే

నెంత చెడ్డవాడినో నీకు తెలుసుగదా – నువ్వేదో పెద్ద నృత్యకారిణివని విర్రవీగిపోకు. రేపీపాటికి నీకంటే గొప్పగాచేసే పిల్లల్ని స్టేజి ఎక్కించ గలను....' కంఠం కీర్‌మని గీరపెడుతోంది.

'వాళ్ళు నామూతి వంకరగా వుందని క్రిటిసైజ్ చేస్తున్నారు. సైడ్ వింగ్‌లో నుల్చుని క్షణకాలం' ఆగింది సురేఖ.

'ఏంచేస్తే ? వాళ్ళకి వంకరగా అనిపించవచ్చు. నువ్వేదో పెద్ద అందగత్తె ననుకుంటున్నావా ? నీమూతి వంకరవచ్చు, ముక్కువంకరవచ్చు. అది ఎవడికి కావాలి? నీ అభినయం కావాలి – నీ నాట్యవిన్యాసం కావాలి. మళ్ళీ చెప్తున్నాను. నీ పర్సనల్‌లైఫ్ గురించి నాకు ఎటువంటి యింటరెస్టూ లేదు. అయితే దానివల్ల నీ నృత్యం దెబ్బతిందా – ఎల్లుండీపాటికి ఇల్లా విసరిపారేస్తాను–జాగ్రత్త' వొక్కపొడి నోట్లో వేసుకుని పై కాయితం వుండచుట్టి, విసురుగా కారులోంచి బైటకి పారేస్తూ చెప్తున్నారు, తన విలువ ఎంతో.

'ఇకనుంచీ చాలా జాగ్రత్తగా వుంటాను' అంది సురేఖ వినయంగా.

ఇలా చచ్చిన పాములా మాట్లాడకపోతే గురువుగారు యింకా తిడుతూనే వుంటారు. వేదిక ఎక్కాక ఆయన ఎంత కళాప్రస్టో, వేదిక వెనుక అంత చండశాసనుడు. ఉదయం రిహార్సలప్పుడు పచ్చిబూతులు తిట్టగలిగిన యీ వ్యక్తి, వేదిక ఎక్కేప్పటికి అపర భరతముని అయిపోతారు. కంఠంలో మార్దవం, వీరరసం, గంభీరత అన్నీ చోటు చేసుకుంటాయి. అశ్లీలాలు వుచ్చరించిన ఆ కంఠంతోనే – సంస్కృత శ్లోకాలు అనర్గళంగా చదవగలరు. కృష్ణ కర్ణామృతంలోని శ్లోకాలు అతి సుందరంగా పాడి – శ్రోతలను మెప్పించగలరు. ఆయన తిడుతున్నప్పుడు, వురిపోసుకు చచ్చిపోదామనిపిస్తూంటుంది సురేఖకి. కాని, అవి ఆయన వ్యక్తిగతమైన ద్వేషంతో అనే మాటలుకావు. తన కళాభినివేశానికి మెరుగులుదిద్దే ఆకురాయివంటి ఆయుధాలు.

కారు ఇంటిముందు ఆగింది. ముందుగదిలో దీపం వెలుగుతూ వుంది. కిటికీలోంచి తొంగిచూస్తున్న ఆ వెలుగుకిరణాలు సురేఖ మనసునంతా కాంతితో, ఆహ్లాదంతో నింపాయి. పక్కనున్న గురువుగారి వునికినే మర్చిపోయినట్లు గభాలున తలుపు తీసుకు కారు దిగింది.

'నువ్వీజన్మలో బాగుపడవు. నీకోసం వృధా చేసిన నా శిక్షణ మరి ఏ పిల్ల కిచ్చినా అంతర్జాతీయ కీర్తిని, ప్రతిష్ఠని పొందివుండేది. నీలాంటి దొమ్మరివాళ్ళకి కళ ఏమిటి?' ఆ కంఠంలో కోపం, నిస్పృహ, వోర్వలేని తనం.

సురేఖ మాట్లాడలేదు. కొన్ని కొన్ని అభిప్రాయాలకి జవాబులు వుండవు. ఎదురుమాటలూ వుండవు.

'రేపు ఎనిమిదిన్నరకి చిన్నపిల్లలకి క్లాసులు తీసుకోవాలి. ఎనిమిది అయేప్పటికి నికేతనంలో వుండకపోయావో, ఆ పనిని మోహినికి అప్పగిం చేస్తాను. ఇదిగో యీ చీరె నీ కిచ్చినట్లున్నారు పట్టుకుపో' ఇంచుమించు విసిరినట్లు కారు తలుపులోంచి తనమీదకి పడేశారు. సురేఖ రెండుచేతుల్తో ఆ చీరెను పట్టుకుంది. వొంగి గురువుగారి పాదాభివందనం చేసింది. డాన్సు ప్రోగ్రామ్ వున్నరోజున – వేదిక నెక్కగానే – గురువుకి పాదాభివందనం చెయ్యటం, ఆఖరున ఆయన కాళ్ళు స్పృశించటం సురేఖకి అలవాటు. ఈ ఆచారం నృత్యనికేతనంలో మూడేళ్ళ పసిపిల్లనుంచి, పాతికముప్ఫై ఏళ్ళ ప్రౌఢలుదాకా పాటిస్తూ వుంటారు. ఇంచుమించు ప్రాచీన గురుకులవాసం లాగా నృత్యనికేతనంలో – నాట్యాన్ని అభ్యసించే ప్రతి విద్యార్థీ–విద్యార్థినులు యీ సంప్రదాయాన్ని అనుసరిస్తూ వుంటారు. మిలటరీలో వున్నటువంటి క్రమశిక్షణా, దేహపరిశ్రమా వుంటాయి ఈ నృత్యనికేతనంలో.

కారు దిగిన సురేఖ, అట్టపెట్టెను గుండెలకు ఆనించి, గబగబ అడుగులువేస్తూ వెళ్ళింది ఇంటివేపు. ఆ అడుగుల్లోని విన్యాసాన్ని,

పుత్సాహాన్ని చూస్తున్నాడు - వీధిదీపం వెలుగులో గురువుగారు. ఆయన హృదయం ఛిగ్గున మండింది. కీర్తి, ధనం, కళాసేవ - యివ్వేవీ యీ ఆడపిల్లలని పట్టుకోలేవుగదా! ఇన్నేళ్ళ తన సాధన, తా నిచ్చిన కఠినమైన శిక్షణా - ఒక్కవ్యక్తి యిన్ఫ్లూఎన్సుతో గాలికి ఎగిరిపోతాయా? ఆయన నిట్టూర్పు విడిచారు-కారు కదిలింది.

కారు కదిలిన శబ్దం విన్నాకనే - వీధితలుపులు తెరుచుకున్నాయి. గుమ్మంలో నుల్చున్న రాజగోపాల్ రెండుచేతుల్లోనూ పడిపోయింది - ఇక వోపికలేదు అన్నట్లుగా సురేఖ.

'ఏయ్ - పిచ్చీ' అన్నాడు రాజగోపాల్ ఆమెని గుండెలకి హత్తుకుంటూ. శక్తిలేనట్లు తన దేహంలో చైతన్యం లేనట్లు, మైనపు ముద్దలాగా, అతని ఆసరాతో అడుగులువేస్తూ నడిచింది సురేఖ. రాజగోపాల్ సురేఖని అలా సోఫాదాకా తీసుకొచ్చి, నెమ్మదిగా, అపురూపమైన గాజుబొమ్మని పడుకోపెట్టినట్లు సోఫాలో వదిలాడు. తలకింద దిండు సవరిస్తున్నాడు. అయితే, సురేఖ కళ్ళు తెరవలేదు. అతనిమెడచుట్టూవున్న తన చేతులనీ వదలలేదు. కళ్ళుమూసుకుని, అతను చేస్తున్నసేవని ఆ చేతుల స్పర్శలోని సుఖాన్ని అనుభవిస్తూ వుంది. ముఖంలోని విషాదచ్ఛాయలు, కోపం, సూర్యోదయంలోని మబ్బులాగా విడిపోతున్నాయి. పక్కన టీపాయ్ మీదవున్న ఫ్లాస్క్‌లోంచి - వేడిగా పొగలుగక్కుతున్న బ్లాక్‌టీ కప్పులోకి వంచి, నిమ్మడిప్ప పిండి, సురేఖకి అందించాడు రాజగోపాల్.

'నువ్వు లేకపోతే నేను చచ్చిపోయి వుండేదాన్ని' అంది సురేఖ పుల్లగా, వేడిగా వున్న బ్లాక్‌టీ చప్పరిస్తూ.

'ఏం చచ్చిపోవు - హాయిగా వుంటావు. అసలు నావల్లనే నీకీ సమస్యలన్నీ' అన్నాడు రాజగోపాల్ తానూ టీ సిప్ చేస్తూ.

'ఈరోజు మాస్టారుకి చాలా కోపం వచ్చింది. డబ్బు యివ్వాలమని ఏమాటపడితే ఆమాట అంటారు. గోపీ, అద్దం తెచ్చిపెట్టు' అడిగింది సురేఖ.

'అర్థరాత్రి అద్దం దేనికి—నా కళ్ళలోకి చూసుకో' అన్నాడు అల్లరిగా గోపాల్.

'కాదు—ఒక్కసారి తెచ్చిపెట్టవ్—నా మూతి వంకరట. నేను నవ్వితే తొర్రగా వుంటుందట.'

'ఎవరన్నారు?'

'సైడ్‌వింగులో నిల్చుని యిద్దరమ్మాయిలు కామెంట్ చేశారు. అడుగు తప్పుపడింది.'

'ఓహో. మీ మేస్టారు బాగా చివాట్లు వేశారన్నమాట. ఇంత చిన్న విషయానికి ఖంగారుపడిపోతావేం?'

'గోపీ, నానోరు నిజంగా వంకరగా వుంటుందా?' అడిగింది సురేఖ.

'నామటుకు నాకు – నీలో వీసమంత లోపంకూడా కనిపించదు. నేను రంభా, వూర్వశీలని చూడలేదు. మేనకనూ ఎరగను. నువ్వు వేదిక ఎక్కితే – వాళ్ళు నీలాగా వుండి వుంటారు అన్న ఆలోచనలు కలుగుతూంటాయి. ఎనిమిదేళ్ళక్రితం – ఆ తొలిరోజున ఎలా వున్నావో, యిప్పుడూ అంతే. నీ శిరస్సునుంచి కాలి బొటనవేలుదాకా నువ్వు నాకు అందంగానే కనిపిస్తావు' అన్నాడు రాజగోపాల్. సురేఖ టీ కప్పు పక్క టీపాయ్‌మీద పెట్టి – అతని మెడచుట్టూ హారంలాగా రెండుచేతులూ వేసింది.

డాన్సుకోసం వేసుకున్నరంగు – చేతులమీద యింకా అక్కడా అక్కడా వుంది. ఆరంగు మరోసారి క్లీన్ చేస్తేగాని పోదు. ఆ దీపం వెలుగులో – ఆమె రెండుచేతులు గులాబీపూల హారంలాగా వున్నాయి.

చేతులని విడదీసి ఒక్కొక్క వేలునీ తన పెదిమలతో స్పృశించాడు గోపాల్. ఒకటీ రెండూ అంటూ పదిదాకా లెక్కపెట్టి 'ఇకలే - చాలా అలిసిపోయావు, పక్క రడీగా వుంది. బట్టలు మార్చుకుని పడుకుందువు గాని' అన్నాడు గోపాల్.

'నీళ్ళు పోసుకుంటేగాని నిద్రరాదు' అంది సురేఖ.

'స్టవ్‌మీద నీళ్ళు కాచి వుంచాను. చాలా బడలికగా వుంటే పోసుకుంటావని.'

'గోపీ-నువ్వు అన్నం తిన్నావా?' అడిగింది సురేఖ.

'తిన్నాను'

'మధ్యాహ్నం అన్నం?'

'హోటల్‌నుంచి చపాతీలు తెప్పించుకు తిన్నాను' అన్నాడు గోపాల్.

స్నానంచేసి, పాతచీరె కట్టుకుని వచ్చింది సురేఖ. డాన్సుప్రోగ్రామ్ లేకపోతే ఆమె ముఖానికి పౌడరుకూడా రాసుకోదు. దీపపుకాంతి ఆమె చెక్కిళ్ళలో సన్నగా ప్రతిఫలిస్తూ వుంది. గోపాల్ సురేఖని చూసినప్పుడల్లా అనుకుంటూ వుంటాడు—— ఇంతటి స్వచ్ఛమైన చర్మం యీమెకి ఎలా లభించిందా అని ; ముఖంమీద ఎక్కడా-ఒక్క మొటిమకూడాలేదు. కొందరు స్త్రీలకి మొగచెంపలదగ్గిర నూగులాగా వెంట్రుక లుంటాయి. సురేఖకి అవి కూడా లేవు. మృదువుగా, పట్టువస్త్రంలాగా చెంపలు తళతళమంటున్నాయి. ముఖానికి క్రీముకూడా పట్టించుకోదు. సన్నగా అగరుచుక్క పెట్టుకుంది. మంచంమీద వాలి-దిండు చేతికిందకు లాక్కుని 'గోపీ కబుర్లు చెప్పు. నువ్వు మాట్లాడుతుంటే జోలపాటలాగా నిద్ర వచ్చేస్తుంది-పొద్దుటే లేవాలి' అంది ఆవలిస్తూ.

గోపాల్‌కి నవ్వొచ్చింది. తనని మాట్లాడమంటుందిగాని ఆగకుండా తనే కబుర్లు మొదలుపెడుతుంది. అలా మాట్లాడుతూ మాట్లాడుతూ నిద్ర

పోతుంది. పిచ్చిది. అతనికి యీ సురేఖని చూస్తే ప్రతిసారీ జాలిగా వుంటుంది. తనని గుదిబండలాగా కట్టుకుని మోస్తున్నది.

'పెళ్ళి బాగా జరిగిందా?' అడిగాడు గోపాల్.

'ఏమో, ఎవరు చూశారు? బాగానే జరిగుండాలి. ఏంజనం—ఏంజనం. తిరణాల్లాగా వచ్చారు. హాలు నిండిపోయింది.'

'పెళ్ళికొడుకు, పెళ్ళికూతురూ ఎలా వున్నారు?'

'ఎలా వుంటారు. ఆపిల్ల అమ్మవారిలా వుంది. అతను ఎలకపిల్లలా వున్నాడు' ఫక్కున నవ్వి అంది సురేఖ.

'ఛ—అట్లా అనకు'

'నిజంగానే గోపీ, పాపం కాకిముక్కుకి దొండపండు అంటారే, దీన్నే అనుకుంటా। కొత్తదంపతులు గుంజీలు తీశారు. ఎందుకులే తిల్లానాలోకూడా అంత ఎక్సర్‌సైజు వుండదు.'

'ఎన్నిసార్లు గుంజీలు తీశారో, నీకెలా తెలుసు - నువ్వు డాన్సు చేస్తున్నావాయె.'

'మేము థోంచేస్తుంటే - ఆఖరిబాచ్‌కదూ పెళ్ళిపెద్దలు రెండున్నర వేలమంది థోంచేసి వుంటారని. బాచ్‌కి అయిదువందలు చొప్పున యిది ఆరోబాచ్ అని లెక్కలు వేస్తున్నారు. అంచేత ఆ వధూవరులు కనీసం రెండువేలసార్లయినా లేచి నుల్చుని వుంటారని అంచనా' అంది సురేఖ నవ్వుతూ.

గోపాల్‌కి నవ్వొచ్చింది. ఇంత తెలివైనదానిని, ఇంతటి కళాకారిణిని, అనురాగమూర్తిని తాను ఎలా పోగొట్టుకోగలిగాడు? కోమలమైన ఈ చేతిని తాను ఎలా అందుకోలేకపోయాడు? సురేఖ నిద్రపోతున్నట్లుగా వుంది. ఆమె వుచ్ఛ్వాశ నిశ్వాసాలు క్రమబద్ధంగా వున్నాయి. గుండెలు కిందకీ పైకీ - లయబద్ధంగా కదులుతున్నాయి. బెడ్‌లైటు ఆన్‌చేసి - పుస్తకం

చేతపుచ్చుకున్నాడు. కాని అతని మనసు పుస్తకంమీదకి లగ్నం కావటం లేదు. తమ జీవితాలు ఎందుకు యిలా అయాయి? దీనికి గమ్యం ఏమిటి? సురేఖ జీవితంతో తాను చెలగాట మాడుతున్నాడా? ఈ ప్రశ్నలని అతను తనకి తానుగా – ఎన్నోసార్లు వేసుకున్నాడు. ప్రతిసారీ జవాబు చెప్పుకోలేకుండా వున్నాడు. ఏమవుతుంది? ఏమవుతుంది?

# 2

సాధారణంగా కాలేజీ వార్షికోత్సవాల్లో, సాహిత్యసభలూ, నాటకాలూ వుంటాయి. ఆ సంవత్సరం మూడోరోజున – కాలేజీ సిల్వర్‌జుబిలీ సందర్భాన భరతనాట్య ప్రదర్శన ఏర్పాటు చేశారు. అప్పటికి రాజగోపాల్ మెకానికల్ యింజనీరింగ్ రెండో సంవత్సరంలో వున్నాడు. హాస్టల్లో వుండి చదువుకుంటున్నాడు. అయిదుగురు అప్పచెల్లెళ్ళూ, ఒకేఒక్క అన్నదమ్ముడూ అయిన ఈ రాజగోపాల్‌మీద కుటుంబమంతా ఆశలు పెట్టుకుని వున్నారు. తండ్రి స్కూలుమాస్టరు. అప్పటికి అతని మామ్మ కూడా బతికేవుంది. ఇంత పెద్దకుటుంబమూ ఏకైక పురుషసంతానంమీద, ఈ వంశోద్ధారకుడిమీద అన్ని ఆశలూ కేంద్రీకరించారు. స్వంతయిల్లూ, పొలమూ వున్నా అయిదుగురు ఆడపిల్లలు అవటంచేత-వాళ్ళ పెళ్ళిళ్ళు తలుచుకున్నపుడల్లా – ఆ దంపతులకి నిద్రపట్టేదికాదు. తొలిచూలు మొగపిల్లవాడు కలిగినా, శాపం పెట్టినట్లు మిగతా అయిదుగుర్నీ ఆడవాళ్ళనే కన్నదని – అత్తగారు సాధించి పోస్తూండేది రాజగోపాల్ తల్లిని. రాజగోపాల్ తల్లి చాలా సాధువు – స్వతహాగా నెమ్మదస్తురాలు. అందుకు తోడు అయిదుగురు ఆడపిల్లలని కన్న నేరానికి – ఒక్కనాడుకూడా నోరు ఎత్తి – ఎవరికీ బదులు చెప్పేదికాదు. అత్తగారి అడుగులకి మడుగులు వొత్తేది.

ఈ ముసలమ్మగారు – తన పుట్టింటి ఆస్తి అని, ఒక రెండుఎకరాలు తన పేరున పెట్టుకుంది, రాజగోపాల్ తాతగారి హయాంలోనే. ఆ రెండు ఏకరాలమీద వొచ్చే అయిదువేలు, కొడుకు చెవులు మెలేసి–పైసా పైసా కూడబెట్టి దాచేది. ఆ డబ్బుతో మనుమడిని ఇంజనీరు చేసి, ఆ మనుమడు ధవళేశ్వరం లాకుల్లో పెద్దయింజనీరుగా, సంచుల్తో డబ్బు సంపాయిస్తే చూసి ఆనందించాలని ఆమె కల. పి. డబ్లుయు. డి. డిపార్ట్మెంటులో – యింజనీర్లు సంపాయిస్తారుగాని, ఇంజనీరు చదివిన ప్రతివాడూ లంచాలు పట్టి లక్షలార్జించలేడని ఆ ముసలావిడకు తెలియదు. అందులోనూ రాజ గోపాల్ మెకానికల్ యింజనీరింగ్ చదువుతున్నాడన్న వివరంకూడా ఆమెకి తెలియదు. కాకినాడలో చదివే మనవడు శలవలకి వచ్చినపుడల్లా అతనికి రాజమర్యాదలు చేసేది. చదువుకీ హాస్టలుకీ తన స్వంతడబ్బు కట్టేది. అందుచేత రాజగోపాల్ జీవితంలో ఈ మామ్మ ఒక ముఖ్యవ్యక్తి అయింది. ఇంచుమించు మామ్మని కాకా పడితే చాలా విషయాలు సులభంగా పరిష్కారమవుతాయని రాజగోపాల్‌కి ఏడోఏటనుంచీ తెలిసివచ్చింది. ఆ యింట్లో మామ్మా, రాజగోపాల్ ఒకపార్టీ. వీరిద్దరూ ఒకటోతరగతి సభ్యులు. మిగతావాళ్ళంతా రెండోతరగతి; ముఖ్యంగా తల్లీ, చెల్లెళ్ళూ వీరు మూడోతరగతి. ఇలా తరగతులవారిగా పెట్టుపోతలు జరగడం–ఆడపిల్లలని తక్కువచూపు చూడటం అన్యాయమని ఎవరికీ తోచలేదు. తోచినా ప్రతిఘటించే దమ్ములు ఎవరికీ లేవు. అటువంటి రాజగోపాల్ కాకినాడలో మొదటిసారి సురేఖ నృత్యాన్ని చూశాడు.

మామూలు ఆడపిల్లలకంటె చూపువాసి పొడవుగా, నాజూగ్గావున్న యీ నర్తకి కళ్ళలో, తన హృదయం పారేసుకున్నాడు రాజగోపాల్. సహజంగా స్టూడెంట్సు ఇటువంటి శాస్త్రీయనృత్యాన్ని కుదురుగా చూడరు. కాని, ఆరోజు రెండున్నరగంటల నాట్యంలో–ఒక్కకుర్చీ ఖాళీలేదు. ఎక్కడా

పిల్లికూతలూ, విజిల్సూ లేవు. ప్రేక్షకులు అతి శ్రద్ధతో ఈ సురేఖ నృత్యాన్ని చూసి ఆనందించారు.

ఎక్కడా చవకబారుతనం లేకుండా, పొందికగా శాస్త్రీయనృత్యాన్ని చేస్తూ, ప్రేక్షకులని, అందులోనూ విద్యార్థులని ఆకట్టుకోగలిగిందీ అంటే – ఆ నర్తకి సామాన్యురాలు కాదని అందరూ ఏకగ్రీవంగా వొప్పుకున్నారు. తెరపడేముందు, సభకి వందనంచేసి హంసలాగా వంగిన ఆ అభినయానికి - కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. స్టేజివెనకకి నర్తకిని కలుసుకోవాలని, మాట్లాడాలని వెళ్ళినవారు చాలామంది. వాళ్ళలో రాజగోపాల్ కూడా వున్నాడు. అయితే అతను మిగతావాళ్ళలాగా ఆటోగ్రాఫ్ అడగలేదు, అభినందించనూలేదు.

'మీ రెక్కడ దిగారు?' అడిగాడు – డాన్సుడ్రస్‌లోనేవున్న సురేఖని. భుజాలమీద కెంపురంగు జరీశాలువ కప్పుకుని వుంది ఆమె. ప్రోగ్రామ్ అయిపోయాక కలుసుకోవాలని వచ్చే అభిమానులకి – వంటికి పట్టిన చమట కనపడకుండా వుండటానికి సురేఖ బుజాలమీద 'స్టోల్' కప్పుకుంటూ వుంటుంది. ఇదికూడా గురువుగారి ఆదేశమే.

'ఏం?' అడిగింది కళ్ళెత్తి సురేఖ. ఆమె కళ్ళు విశాలంగా వున్నాయి. అవి అందమైన కళ్ళుకాకపోవచ్చు. కాని వేదికమీద ఆ కళ్ళలో అనేక భావాలని చూపించగలదు.

'మిమ్మల్ని కలుసుకోవాలని' జవాబిచ్చాడు రాజగోపాల్.

'ఇప్పుడు కలుసుకున్నారుగా' పెంకి జవాబు.

'ఇలాకాదు. మీకు తీరికవుంటే మాట్లాడాలని_'

'ఏంమాటలు?'

'చెప్పలేను. ఏదో చాలామాటలు మాట్లాడాలని వుంది' అన్నాడు మాటకారి అయిన రాజగోపాల్. సన్నగా – నల్లగా వున్న ఆ యువకుని వంక క్షణంపాటు తేరిపార చూసింది సురేఖ.

'చదువుకుంటున్నారా?'

'ఇంజనీరింగ్ స్టూడెంట్‌ని' బదులిచ్చాడు రాజగోపాల్.

'రేపు మధ్యాహ్నం రండి. భవానీలాడ్జ్‌లో దిగాం. సాయంత్రం చిత్రాడలో ప్రోగ్రామ్ వుంది' అంది సురేఖ.

అలా పరిచయం అయింది ఇద్దరికీ. కొందరితో జన్మాంతరస్నేహం అలా పరిచయమవుతుంది. సురేఖకి ఈ యువకుని చూస్తే ఏదో ఆకర్షణగా వుంది. అప్పటికే చాలా ప్రదర్శన లిచ్చిన సురేఖకి—అనేకమంది యువకులు, మధ్యవయస్కులు, వృద్ధులు యిలా అన్ని వయసులవారూ, తనలోని కళని మెచ్చుకు అభిమానులుగా మాట్లాడినవారూ చాలామంది వున్నారు. సురేఖ తన ఎనిమిదోఏటనుంచీ నృత్యం చేస్తూనే వుంది. ఎనిమిదోఏట—మొదటిసారి అరంగేట్రమ్ యిచ్చింది. అప్పటినుంచి బాలనర్తకిగా, ఈనాడు యవ్వనవతిగా ప్రదర్శనలు యిస్తూనే వున్నది. ఆమె నృత్యాన్ని మెచ్చి, ఆమెలోని లావణ్యాన్ని, యవ్వనాన్ని మెచ్చి, ఆకర్షితులై దగ్గరకు రావటానికి ప్రయత్నించినవారు చాలామంది వున్నారు. అయితే ఇటు గురువుగారు, అటు తల్లీ సురేఖని రెండువైపులనుంచీ జాగ్రత్తగా కాపాడుతున్నారు — ఆమె ఎటువంటి ఆకర్షణలో పడిపోకుండా చుట్టూ గట్టి గోడలే కట్టారు.

పద్దెనిమిదేళ్ళ సురేఖ మిలమిల వెలిగే దీపాలకాంతులని, తళుక్కుమనే నగల జిగేళ్ళని, మిన్నుముట్టే కరతాళధ్వనులని, ప్రశంసావాక్యాలని, పత్రికలలో బొమ్మలని అన్నిటినీ చూసింది. నృత్యం తన జీవితధ్యేయం; అందెలరవళిలోనే తన వునికి, బయట ఆకర్షణలు తనని ఏమీ కదలించలేవు— అనుకున్న ఒకస్థిరత్వానికి వచ్చాక మొదటిసారి రాజగోపాల్‌ని చూసింది. ఆతనికళ్ళు చిరకాల మిత్రునికళ్ళలా వున్నాయి. ఆ కళ్ళలో ఒక చురుకుతనం.

ఆ మరునాడు పదకొండింటివేళ ఎర్రసంపెంగలు పొట్లంతో రాజగోపాల్ భవానీలాడ్జ్ కొచ్చాడు. ఆంధ్రదేశంలో చాలా హోటల్సులాగానే ఆ లాడ్జ్ వెలాతెలాపోతూంది. సురేఖవున్న రూమ్‌కి మధ్యన పొడువాటి కర్టెను-ఆ కర్టెన్‌కిముందు ఒక సోఫా, రెండు పేముకుర్చీలు. పూలపొట్లం టేబుల్ మీదపెట్టి కుర్చీలో కూచున్నాడు రాజగోపాల్. అతను కూచున్న రెండునిముషాలకి సురేఖ లోపలినుంచి వచ్చింది. మామూలు సాదా నేతచీరె కట్టుకుంది. ముఖం నున్నగా, పసిమివర్ణంతో నిగనిగలాడుతోంది. వాలుజడ వేసుకుంది. ఒక డాన్సరు ఇంత సింపుల్‌గా వుంటుందని రాజగోపాల్ వూహించలేకపోయాడు.

'సింహాచలం సంపెంగలుకదూ?' టేబుల్ మీదనున్న పొట్లంవిప్పి' పూలని గాఢంగా ఆఘ్రాణిస్తూ అడిగింది సురేఖ.

'మీకిష్టమా ?'

'చాలాను. మద్రాసులో ఎప్పుడోగాని దొరకవు. అవికూడా యింత సువాసనతో వుండవు. అసలు ఈ రంగు అక్కడి పూలకి వుండనే వుండదు' అంది సురేఖ. ఈ అమ్మాయి మాటలు వింటుంటే రాజగోపాల్‌కి తన చెల్లెళ్ళు జ్ఞాపకం వచ్చారు. వాళ్ళూ అంతే, మల్లెపువ్వులు ఈ వూర్లో బాగుంటాయి, ఆ వూర్లో బాగాలేవని గంటలు – గంటలు చర్చించుకుంటారు. మల్లెపువ్వులు-మల్లెపువ్వులే! వూరునిబట్టి వాటికి సువాసన ఎక్కువౌతుందా?'

'ఏమిటి ఆలోచిస్తున్నారు. అలా నిశ్శబ్దంగా అయిపోయారేం?' అడిగింది సురేఖ.

రాజగోపాల్ వులిక్కిపడి – సర్దుకుని కూచున్నాడు. 'మీరింత సింపులుగా వుంటారనుకోలేదు. మామూలు మా యిళ్ళలో అమ్మాయిలా వున్నారు.'

'వేదిక ఎక్కాక ఎలాగా ఆ.నగలు మొయ్యాలి. పట్టుచీరె కట్టాలి, పూలజడ వేసుకోవాలి. ప్రోగ్రామ్స్ అప్పుడు ఆ అలంకారాలు ఎలాగూ

తప్పవు. ఉత్తప్పుడైనా హాయిగా సింపుల్‌గా వుండాలని - నాకు అంత అలంకారాలంటే గిట్టవు.'

'తమాషాగా వుందికదూ. వేదికమీద మిమ్మల్ని చూసి, మీలా వుండాలని మామూలువాళ్ళు అనుకుంటుంటే....'

'నేను మామూలు ఆడపిల్లనుకాదా?' సవాలు చేస్తున్నట్లు ప్రశ్నించింది సురేఖ.

'నేను మరోవుద్దేశ్యంతో అనలేదు. నిజానికి మీరు మామూలు సగటు ఆడపిల్లలలాంటివారు కాదు. వేదికమీద మీ నృత్యం చూశాక - మిమ్మల్ని సామాన్యమైన ఆడపిల్ల అనుకుంటే అవతలవాడు పిచ్చివాడైనా కావాలి, లేక అబద్ధాలకోరైనా అవాలి.'

సురేఖ చెక్కిళ్ళు అరుణిమదాల్చాయి. ఒక్కసారి యిబ్బందిగా కదిలింది. 'ఆ విషయాలు వొదిలేద్దాం. మీరు ఏదో మాట్లాడాలన్నారు - ఏమిటి - ఏదన్నా పత్రికకి రాస్తారా?'

'ఏం - పత్రికలకితప్ప మామూలువాళ్ళకి యింటర్‌వ్యూ ఇవ్వరా?'

'సరిగ్గా - విరుద్ధమైన అభిప్రాయం వెలిబుస్తున్నారు. నాకు పత్రికల వాళ్ళంటే భయం. ఇంటర్‌వ్యూ అంటూ వచ్చి నేను అననివి, ఇబ్బందికర మైనవీ రాస్తూంటారు. ఒకసారి మా గురువుగారికి చాలాకోపం వచ్చింది.'

'దేనికి? మీరు యింటర్‌వ్యూ యిచ్చారనా?'

'కాదు - నేను భరతనాట్యం పొట్టకూటికి చేస్తున్నాను - ఈ కళమీద నాకు ఎటువంటి గౌరవమూ లేదని - అన్నానని ఒక విలేఖరి రాశారు. అది చదివి ఆయన తల వాచేట్లు చివాట్లు వేశారు.'

'మీరు అలా అన్నారా?'

'అలాఅనికాదు. నాట్యం ఎందుకు చేస్తున్నారు – అని అడిగారు. ఇది నా వృత్తి అన్నాను. అది మార్చి యిలా చులకనభావం వ్యక్తం అయేట్లు తిప్పి రాశారు. అప్పటినుంచి ఇంటర్వ్యూ లంటే భయం. అందుకని, ఏం మాట్లాడబోతున్నారోనని అడిగాను' అంది సురేఖ.

'బతికాం. నేను విలేఖరినికాదు. ఆఖరికి లేఖరాయటంకూడా నాకు బద్ధకం. కాబట్టి నావల్ల మీకు ఎటువంటి యిబ్బందీ కలగదు. నిన్నరాత్రి చెప్పానుగదా – మెకానికల్ యింజనీరు చదువుతున్నాను. నాకు సినిమా తారలనీ, రచయితలనీ కలుసుకునే అలవాటులేదు.'

'మరి?' ప్రశ్నించింది సురేఖ.

'మిమ్మల్ని కలుసుకోవాలని అనిపించింది. అందుకే యీరోజు వస్తానన్నాను' అన్నాడు సూటిగా చూస్తూ.

'సురేఖకి యీ పరిచయం విచిత్రంగా వుంది. అతను అందరి కాలేజీ పిల్లలులాగా సిగరెట్లు కాల్చడు. తనవంక చవకబారుగానూ చూడటంలేదు. అలాఅని తను అభ్యసిస్తున్న కళ గురించీ ప్రస్తావించటంలేదు. ఏదో మామూలు కుటుంబస్నేహితునిలాగా, చిరకాల పరిచయస్తునిలాగా మామూలు విషయాలు కబుర్లుగా చెప్పటం మొదలుపెట్టాడు.

ఒంటిగంటకి తల్లి భోజనం వచ్చిందని చెప్పేదాకా సురేఖా, రాజగోపాల్‌లు కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు.

'అరె – ఒంటిగంట అయిందా? మా హాస్టల్‌లో భోజనంకూడా వుంచరు. నే నింక వెళ్తాను' లేవబోతూ అన్నాడు రాజగోపాల్.

'ఒంటిగంట దాటితే అన్నం పెట్టరా ?'

'హాలిడేస్ అయితే ఫరవాలేదు. వర్కింగ్‌డేస్‌లో ఒంటిగంటకల్లో డైనింగ్‌హాలు మూసేస్తారు'

'పోనీ, యిక్కడ భోంచెయ్యండి.'

'మీకెందుకు శ్రమ - ఫరవాలేదు. వెళ్తూ ఏ హోటల్లోనన్నా తినేస్తాను.

'ఇదిమటుకు హోటల్ కాదేమిటి - కొంపతీసి మా యిల్లు అనుకుంటున్నారా ?' నవ్వుతూ అడిగేసరికి - రాజగోపాల్‌కికూడా నవ్వొచ్చింది. వెళ్ళబోయేవాడు - మళ్ళీ కూచుండిపోయి ఆపూటకి అక్కడే భోంచేసి, రెండింటికి హాస్టల్‌కి వెళ్ళిపోయాడు. మరునాడు సర్కార్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరేవేళప్పుడు అతను కాకినాడ పోర్టుస్టేషనుకి సంపంగి పువ్వులపొట్లంతోసహా వచ్చాడు. అతను స్టేషనుకొచ్చినందుకు సురేఖ ఆశ్చర్యపోలేదు. మద్రాసులో తమ ఎడ్రసుకూడా యిచ్చింది. తిరిగి యిరవై రోజులకి టాటానగర్‌లో ప్రోగ్రామ్‌వున్న విషయంకూడా చెప్పింది. ఈసారి సామర్లకోట స్టేషన్‌కి పువ్వులతోవచ్చి, రైలురాకకోసం ఎదురు చూస్తూ నుల్చున్నాడు.

సామర్లకోట స్టేషన్ రావటానికి ముందుగానే సురేఖ తలుపుదగ్గిర నుల్చుని బయటకి చూడటం మొదలుపెట్టింది. సాధారణంగా ఇటువంటి టూర్స్‌లో గురువుగారు మిగతా ట్రూప్‌తో రారు. ఆయన విడిగా ఫస్టుక్లాస్‌లో కూచుంటారు. మిగతా వాద్యగాళ్ళూ, పాటగాళ్ళూ డాన్సర్సూ అంతా గ్రూప్‌గా స్లీపర్‌కోచ్‌లో ప్రయాణం చేస్తూంటారు. ఇటువంటి ప్రయాణాల్లో ప్రతివారికీ కొంత స్వేచ్ఛా, ఆ స్వేచ్ఛలోనే కొన్ని కట్టుబాట్లూ వుంటాయి. అందరూ సరదాగా కబుర్లాడుకోవచ్చు. చీకటిపడ్డాక స్త్రీలు వేరూ, పురుషులు వేరుగా బెర్తులు తీసుకుంటారు. గురువుగారు పక్కన వుండరు కాబట్టి అందరికీ కొంతలో కొంత ఆటవిడుపు.

సురేఖ తలుపుదగ్గిర నుల్చుని చూస్తుంటే ఎవరూ అడ్డుపెట్టలేదు. పక్కన తల్లిలేదు, గురువుగారూ లేరు. అంచేత ధైర్యంగా నుల్చుంది. ఈ రైలుకి వస్తున్నానని ఇరవై రోజులక్రితం కాకినాడలో రాజగోపాల్‌కి చెప్పింది. అతను వస్తాడా? రాడా? డోలాయమానంగా వుంది ఆమె

హృదయం. పారీకంపెనీవాళ్ళ ఫాక్టరీదాటుకుని, రైలు సామర్లకోట ప్లాట్‌ఫారమ్‌మీదకి జరజర పాకుతోంది. దూరాన రాజగోపాల్ రైలులోకి ఆత్రంగా వుత్సాహంగా చూస్తున్నాడు. తలుపుదగ్గిరవున్న సురేఖ చెయ్యి వూపింది. అతని ముఖం పెయ్యికాండిల్స్‌బల్బులాగా సంతోషంతో మెరిసి పోయింది. చేతిలోని పూలపొట్లం గాలిలోకి బంతిలా ఎగరేసి కిందపడకుండా రెండుచేతుల్తోనూ పట్టుకున్నాడు. రైలు ఆగింది. సురేఖ చేతికి సంపంగిపూల పొట్లం అందించాడు.

అలా రెండేళ్ళపాటు రాజగోపాల్ సురేఖ వచ్చేప్పుడు, వెళ్ళేప్పుడూ సామర్లకోటస్టేషనుకి వస్తూండేవాడు. క్రిస్‌మస్ సెలవలకి మద్రాసుకూడా వచ్చాడు. అప్పుడు సురేఖకి వారంరోజులపాటు ప్రోగ్రామ్స్‌లేవు. అందుకని ఇద్దరూ స్వేచ్ఛగా మద్రాసురోడ్లన్నీ చుట్టబెట్టారు. ఈ యిద్దరిమధ్యనున్న స్నేహం – ఎటువంటి పరిణామాలకి దారితీస్తుందోనని – గురువుగారూ, సురేఖ తల్లీ మొదట్లో భయపడుతూ వచ్చారు. కులాలు ఒకటికాకపోవటం చేతనూ, అతను చదువుకునే పిల్లవాడు కావటంచేతనూ స్నేహంతప్ప మరో సంబంధానికి దారి తీయవన్నట్లు ధైర్యంగా వుండిపోయారు.

అయితే వాళ్ళు భయపడుతున్నరోజు రానేవచ్చింది. రాజగోపాల్ ఫైనల్‌యియర్‌లో వుండగా అతని యింట్లో పెళ్ళిబేరాలు ఆరంభమయ్యాయి. ఇంజనీరు చదువుతున్నాడు ; ఒక్కడే మొగపిల్లవాడు కాబట్టి, మార్కెట్‌లో అతని విలువ పదిహేనునుంచి ఇరవై వేలుదాకా పెరిగింది.

'ఒక్కతే ఆడపిల్ల. వాళ్ళకీ ఆస్తి వుంది. అమ్మాయి వీణ వాయిస్తుంది. స్కూల్‌ఫైనలు పాసయింది. పైగా యిరవై వేలు కట్నం కూడా యిస్తారు' అంటూ మామ్మ రాయబారం మొదలుపెట్టింది.

'మామ్మా – నా కిప్పుడప్పుడే పెళ్ళివద్దు. వుద్యోగం దొరికాక చేసుకుంటాను' అనిమాటలు తప్పించబోయాడు రాజగోపాల్. అతని

మనసులో సురేఖ రూపం కదలాడుతున్నది. ఈ రెండేళ్ళ పరిచయంలో సురేఖ మనసు అతనికి బాగా అర్థం అయింది. తను చెయ్యి అందిస్తే సురేఖ – ఈ డాన్సులనీ, ప్రదర్శనలనీ అన్నిటినీ వొదులుకు వచ్చేస్తుందని తెలుసు. ఆఖరికి జూనియర్ ఇంజనీరు జాబ్ దొరికినా, అందరికీ నచ్చజెప్పి సురేఖని పెళ్ళిచేసుకోవాలని వుంది.

'పెళ్ళిచేసుకో – మీ మావగారే వుద్యోగం వెతికిపెడతాడు. తన కూతురుకోసం ఆమాత్రం చెయ్యడా?' అంది మామ్మ.

'వాళ్ళెవరో – ఎందుకు వెతకాలి. నాకు నేను సంపాయించుకోగలను' అన్నాడు రాజగోపాల్ అభిమానంతో.

'వోరి వెర్రినాగమ్మా. మన బ్రాహ్మణులకి వుద్యోగాలు పిల్చి యిస్తారుటరా. మీ మావగారు – జైలు కెళ్ళివచ్చాడుగా – ఎవరి కాళ్ళైనా పట్టుకుంటాడు.'

'నాకీ పెళ్ళి వద్దు'

'ఎందుకని ?' పక్కా వకీలులాగా ప్రశ్నించింది మామ్మ, ముసుగు సవరించుకుంటూ.

'నే నిప్పుడు చేసుకోను'

'నేను చచ్చిపోయేలోగా నీపెళ్ళికళ్ళారా చూడాలిరా – బ్రతికినన్నాళ్ళు బ్రతకను'

'ఇప్పుడప్పుడే పోవులే....'

'పోను .... అయితేమటుకు – మునిమనవడిని ఎత్తుకోవాలని నాకు మటుకు వుండదా ?'

'కొన్నాళ్ళు ఆగు'

'ఎందుకు ఆగాలి ?'

'నాకు యీపెళ్ళి యిష్టంలేదు'

'ఎందుకిష్టంలేదు ? పిల్లకి కాలు వంకరా – కన్ను వంకరా లేదు. మంచి సంప్రదాయమైన కుటుంబం. ఒక్కగాని ఒక్క కూతురు. యిరవై వేలు .... '

'నాకు కట్నం వద్దు'

'నీకు అక్కర్లేకపోతే మాకు కావాలి. ఆ కట్నంతో నీ చెల్లెళ్ళిద్దరికి పెళ్ళిచెయ్యాలి – '

'అందుకని నన్ను అమ్ముకుంటారా?'

'అమ్ముకోడమని ఎవరన్నారు. నీ చదువుకీ నీ తెలివికీ మెచ్చి-కాళ్ళ గడిగి పిల్లతోపాటు ఇరవై వేలు కానుకగా యిస్తుంటే అది కొనుక్కోటం ఎందుకవుతుంది' ఎదురుసవాల్ వేసింది మామ్మ.

'నాన్నా, మీరు ఎన్ని చెప్పండి – నా కిప్పుడప్పుడే పెళ్ళి వద్దు' అన్నాడు రాజగోపాల్ తండ్రిని శరణు వేడుతూ.

'నీకు కాకపోతే - నీ చెల్లెలికూ అవదు' అన్నాడు తండ్రి నిదానంగా.

'వాళ్ళకోసం నా కిష్టంలేని పెళ్ళి చేస్తారా?' అడిగాడు రాజగోపాల్ నిస్సహాయంగా.

'ఆ పిల్లని చూడకుండా నీకు యిష్టంలేదని ఎలా చెబుతావ్?' నిలవదీసింది మామ్మ.

'నాకు పెళ్ళే యిష్టంలేదు.'

'నీకు యిష్టం లేకపోతే – మాకుంది. సరేనా ? ముందు పెళ్ళి చేసుకో. ఆపైన యిష్టం దానంతట అదే పుట్టుకొస్తుంది' అంది మామ్మ ఇక ఈ విషయం గురించి మాట్లాడేది ఏమీ లేదన్నట్లు.

ఈ యింట్లో మామ్మని తనవైపు తిప్పుకుంటేతప్ప – ఈ పెళ్ళి ఆపటం సాధ్యంకాదని తెలుసుకున్నాడు రాజగోపాల్. అయితే మామ్మని తనవైపుకి ఎలా తిప్పుకోవాలి – ఏంమాటలు చెప్పాలి ?

ఆరాత్రి భోంచేశాక, మెల్లిగా మామ్మ మంచంమీద కూచుని, కబుర్లు మొదలుపెట్టాడు. మామ్మని తనవైపు తిప్పుకోవాలని మనుమడు ప్రయత్నిస్తుంటే, కుర్రనాగమ్మ రాజీబేరానికి వస్తున్నాడని మామ్మ సంతోష పడిపోతున్నది.

'పిల్ల తెల్లగా బాగుందిరా. చక్కగా వీణ వాయించింది. ఒకమాత్రం పిల్ల అయితే నేనుమటుకు వొప్పుకుంటానా ? నాకు నచ్చాకగాని, మా మనవడు రాడు అని చెప్పాను. ఎంత మర్యాద, ఎంత అణుకువ, చాలా మంచికుటుంబం. రాజా, పెళ్ళి అయాక నీ పెళ్ళాం, నువ్వూ, నేనూ ముగ్గురం కాపరం పెడదాం .... నీ వుద్యోగం వూరికి నన్ను కూడా తీసుకెళతావా ? ముసలిముండనని వొదిలేసిపోతావా ?' అడిగింది మామ్మ ఆపేక్షగా.

'నువ్వు ముసలిదానివా ? ఎవ రన్నారు – మా అమ్మకంటే నువ్వే నయం.'

'చిన్నప్పటినుంచీ – నేనంటే నీకు వెర్రి ఆపేక్షరా. అందుకే నేను బతికుండగానే ఆ నాలుగుఅక్షింతలూ....'

భూమి గుండ్రంగా వుంది. మామ్మ మళ్ళీ మళ్ళీ బయలుదేరినచోటుకే వస్తోంది.

'మామ్మా .... నేను ఒకమ్మాయిని ప్రేమించాను ....' మాటలకి తడుముకుంటున్నాడు రాజగోపాల్.

మామ్మ పడుకున్నదల్లా నిటాగ్గా కూచుంది.

'ఎవరమ్మాయి ? మనవాళ్ళేనా?' అడిగింది మామ్మ.

రాజగోపాల్ జవాబుకి తడుముకోవలసివస్తోంది. సురేఖ తమ కులానికి చెందదు. ఆ విషయం మామ్మకి ఎలా చెప్పాలి? పైగా డాన్సు చేస్తుంది అంటే, ఆ కళాసేవ యీ ముసలావిడికి ఎలా అర్థం అవుతుంది?

'ఆ అమ్మాయి, చాలా బాగావుంటుంది.'

'నేను చూసిన పిల్లగూడా చక్కనిదేరా ! ఇంతకీ అమ్మా-నాన్నా-కులం గోత్రం....'

సురేఖ తండ్రెవరో తనకి తెలియదు. తల్లి సినిమా వేషాలకని మద్రాసొచ్చి, చివరికి కూతుర్ని నర్తకి చేసింది అని చెపితే – యీ మామ్మ బుర్ర పేలిపోతుంది. ఎలా చెప్పటం?

'మామ్మా – నే నిప్పుడప్పుడే పెళ్ళిచేసుకోను.'

'ఏం నువ్వు ప్రేమించిన అమ్మాయి నయితే చేసుకుంటావా? చెప్పరా – పోనీ, నీకిష్టమైన పిల్లనే చేస్తాను' అంది మామ్మ వరాలిచ్చే దేవతలాగా.

రాజగోపాల్‌కి పోయిన ధైర్యం పుంజుకుంటూ వుంది. మామ్మని తనవైపు తిప్పుకుంటే, సురేఖని పెళ్ళిచేసుకోవచ్చు.

'వాళ్ళు కట్నం యిచ్చుకోలేరు' అన్నాడు రాజగోపాల్ నెమ్మదిగా. మామ్మ బదులు చెప్పలేదు. రాజగోపాల్ ఆగకుండా చెప్పుకుపోతున్నాడు. 'నేను వుద్యోగంచేసి – చెల్లెళ్ళ కిద్దరికీ పెళ్ళిచేస్తాను. రేపీపాటికి వుద్యోగం సంపాయించుకుంటాను' ఆగాడు.

'ఇంతకీ, పిల్ల కులంగోత్రం చెప్పావుకాదు' మామ్మ అసలు విషయం వింటేగాని వూరుకునేట్టులేదు.

'వాళ్ళకులం....నాకు తెలియదు' అన్నాడు రాజగోపాల్ నెమ్మదిగా.

మామ్మపక్కన బాంబు పడ్డట్టు, ఒక్కదూకులో మంచంమీంచి కిందకి దిగి 'ఒరే అబ్బాయి, ఓసారి యిలారా?' అంటూ పెద్దకేక పెట్టింది.

తండ్రి, ఆ తరువాత తల్లి, వెనుక చెల్లెళ్ళు అందరూ పుట్టలోంచి పాముల్లాగా బిలబిల్లాడుతూ మామ్మ మంచందగ్గిర కొచ్చారు. రాజగోపాల్‌కి ఆ క్షణంలో ఈ మంచం నేలలోకి అలానే కూరుకుపోతే బాగుండునని

అనిపించింది. వీళ్ళందరిదగ్గిరనుంచీ దూరంగా పారిపోవాలని వుంది. కాని ఎక్కడికి పోతాడు?

'ఏరా? నేను చెపితే విన్నావా? వీడు ఆ తైతక్కలాడేపిల్లతో తిరుగుతున్నాడని - నీ బావమరిది చెపితే, ఇంతెత్తున లేచావే విను, వాడు తన నోటితోనే చెపుతున్నాడు. మన కులం గాదుట .... ఏరా - ఆపిల్లేనా? చెప్పు' గద్దిస్తోంది మామ్మ.

'సురేఖ తైతక్కలాడేపిల్ల కాదు. భరతనాట్యం చేస్తుంది.'

'భేష్, యింకేం నువ్వు పక్కన నుల్చుని తాళం వాయించు. పెళ్ళాంచేత ఆడించి - ఆ డబ్బుతో ఆడపిల్లల పెళ్ళి చేస్తానంటావురా - దౌర్భాగ్యుడా....' మామ్మ గట్టిగా కేకలు మొదలుపెట్టింది.

రాజగోపాల్‌కి మతిపోయినట్లుగా వుంది. వీళ్ళందరికి సురేఖ విషయం తెలుసునన్నమాట. తెలిసే, యీ పెళ్ళి ప్రయత్నం మొదలు పెట్టారా? చిన్నప్పటినుంచి తనని వెనకేసుకొచ్చే మామ్మ - ఈరోజు శత్రుకూటమిలో చేరింది. అసలు పరమవైరిలాగా తనపై యుద్ధం ప్రకటిస్తోంది.

'ఇదిగో యిప్పుడే చెపుతున్నాను. నేను చెప్పినట్లు బుద్ధిగా ఆ పిల్లను చేసుకుంటే నువ్వు నాకు మనుమడివి - నేను నీకు మామ్మని! లేదన్నావా, కృష్ణలో దూకి చచ్చిపోతాను. అంతేగాని ఆ డాన్సుదాన్ని కట్టుకున్నావంటేమటుకు వూరుకోను....' మామ్మ అల్టిమేటమ్ యిచ్చేసింది. రాజగోపాల్ నోట్లోంచి మాటరాక కూచుండిపోయాడు.

ఆ మరునాడు రాజగోపాల్ వూరికెళ్ళాలి. ఇంట్లో అందరూ ఎడమొహం పెడమొహంగా వున్నారు. మామ్మ మనుమడివేపు కన్నెత్తి కూడా చూడలేదు. రైలు వెళ్ళే సమయం ఆసన్నమవుతోంది. ప్రతిసారీ

మామ్మే బయలుదేరేముందు మూడొందలు, అయిదొందలు చేతిలో పెడుతూండేది. హాస్టల్ ఖర్చుకూ, రైలు ఛార్జీలకని. మామ్మ డబ్బువిషయం ఎత్తకుండా వూరుకుంది.

'నాన్నా !'

'ఏవిటిరా ?' ఎరగనట్లు తండ్రి బదులుపలికాడు.

'మీరంతా నా మెడలు విరిచి యీ పెళ్ళిచేసినా, నేను సుఖంగా వుండను.'

'సుఖం అంటే అర్థం ఏమిటి ? .... నేను సుఖంగా వున్నానా ? నాగురించి ఒక్కసారి ఆలోచించు. అయిదుగురు ఆడపిల్లలకి పెళ్ళి చెయ్యాలి. మొగవాడు మొయ్యవలసింది బాధ్యతగాని, సుఖాలకోసం పరుగెత్తకూడదు....'

'అంటే.... నాకు నచ్చిన పిల్లను చేసుకునే హక్కులేదంటారా?'

'ఉంది. నీకు అయిదుగురు చెల్లెళ్ళు లేకపోతే .... బడిపంతులు నీ తండ్రి కాకపోతే....ఈ యింట్లో పుట్టివుండకపోతే....'

'నన్నేం చెయ్యమన్నారు ? మనసారా ఇష్టపడిన ఆ పిల్లను వదులుకోలేను.'

'వొదులుకోకు. నీదారిన నువ్వు పెళ్ళు. కాని ఆ తరువాత ఈ అయిదుగురు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు అవవు.'

'నా కట్నంతోతప్ప వాళ్ళకి పెళ్ళిళ్ళుకావా ? నాకు ఆస్థి ఏమీవద్దు. ఆఖరికి మామ్మ నాకు పొలంకూడా యివ్వద్దు – అవన్నీ అమ్మి చెల్లెళ్ళకు పెళ్ళిచెయ్యండి.'

'డబ్బయితే ఆస్తి అమ్మితే వస్తుంది. మరి, పోయిన మర్యాద ఎలా వస్తుంది ? నువ్వు కులంలేనిదాన్ని, సినిమాల్లో వేషాలువేసినదాని పిల్లని కట్టుకుంటే, రేపు నీ చెల్లెళ్ళకి పెళ్ళి అవుతుందా ? ఒక్కక్షణం ఆలోచించు'

'అయితే, నేను పెళ్ళి మానేస్తాను. ఎవరినీ చేసుకోను.'

'అంటే - యీ వున్న యిల్లు కాస్తా అమ్మి పెద్దపిల్లలకి పెళ్ళి చెయ్యమంటావు. అవునా? ఈ యిల్లు మీతాత కట్టించింది. కనీసం మీమామ్మ అన్నా, యీ యింట్లో ప్రాణం విడుస్తుందనుకున్నా. అద్దెయింట్లో ప్రాణం పోతే ఊరుకోరు. యిల్లు మైలపడిపోతుందని - ప్రాణం పోకండానే రోడ్డుమీదకి లాగిపడుకోపెట్టమంటారు' అన్నాడు తండ్రి.

రాజగోపాల్‌కి తనచుట్టూ వుచ్చులు గట్టిగా బిగుసుకున్న ట్లనిపిస్తున్నది. ఎలా బయటపడాలి ? వీళ్ళందర్నీ వొదులుకుని అతను వెళ్ళిపోగలడా ?

'నేను మరో నాలుగునెలల్లో వుద్యోగం సంపాయించుకుంటాను. జూనియర్ యింజనీరుగా....'

'సంతోషం. నెలకి ఆరొందలు - లేక ఏడొందలు యిస్తారు - అవునా ? ఎంత 'సేవ్' చేస్తావ్ ? ఓ నాలుగొందలు. అంటే ఏడాది గడిచేప్పటికి నువ్వు అక్షరాల నెలకి నాలుగువందలు కూడబెడితే - నాలుగు వేల ఎనిమిదివందలు 'సేవ్' చేస్తాం. బడిపంతుల్నికదా లెక్క సరిగ్గానే వేశాననుకుంటా....'

'మనకి డబ్బు అవసరం అని - ఇంకో తల్లితండ్రులని పీడించటం న్యాయమా ? మీలాగే ఆ పిల్ల తండ్రి కష్టపడడా?'

'నీ గురించీ - నీవాళ్ళ గురించీ ఆలోచించు. ఎవరో పరాయివ్యక్తి బలువు సులువులు నీ కెందుకు ? అసలు యింతకీ ఆ యివ్వబోయే ఆయనకి ఇరవై వేలు ఒక లెక్కకాదు. ఒక్కగాని ఒక్కకూతురు. ఆస్థి వున్నవాడు. జైలు కెళ్ళానని మరో అయిదెకరాలు అదనంగాకూడా సంపాయించాడు. చూడు, రాజూ, నాకు హృదయం లేదనుకోకు. నేనూ ఆడపిల్లలని కన్నవాడినే. వాళ్ళని పీడించి నేను యీ కట్నం అడగటంలేదు. వాళ్ళంతట వాళ్ళు యిస్తానన్న మొత్తం! ఇంకా అడిగితే యివ్వటానికి సిద్ధంగావున్నారు' అన్నాడు తండ్రి.

'నేను ఆలోచించుకు రాస్తాను. ప్రస్తుతం కాకినాడ వెళ్ళనివ్వండి' అన్నాడు రాజగోపాల్.

'నీ మెడలువంచి పెళ్ళి చెయ్యటం నాకు ఎంత మాత్రం యిష్టంలేదు. అయితే మన యింటిపరిస్థితి ఆలోచించమంటున్నాను. నువ్వు పుట్టింది లగాయితు యీ క్షణందాకా యింట్లో ఎకరికీ జరగని వైభవం నీకు జరిగింది. ఆఖరికి నేనుకూడా నీఅంత సుఖం అనుభవించలేదు. మానాన్న స్కూలు ఫైనల్తో ఆపేయమంటే ఆపి, సెకండరీగ్రేడు ట్రయినింగ్కి వెళ్ళాను....'

'ఇదంతా నాకు తెలియదా?' అడిగాడు రాజగోపాల్.

'ఒక్కొక్కప్పుడు తెలిసిన విషయాల్నికూడా మర్చిపోతూంటాం. నీ చెల్లెళ్ళిద్దరికీ సంబంధాలు రెడీగా వున్నాయి. ఆరేసివేలు యిస్తే, వాళ్ళు చేసుకునేందుకు రెడీగా వున్నారు.'

'నన్ను అమ్మి చెల్లెళ్ళ పెళ్ళి చేస్తానంటారు'

'అలాగే అనుకో. నిన్ను అమ్మి – ఆ డబ్బుతో యిద్దరు అల్లుళ్ళని కొనుక్కుంటున్నాననుకో. నాకేం అభ్యంతరంలేదు. నీ పెద్దచెల్లెలికి ఇరవై దాటుతోంది, రెండోదానికి పద్దెనిమిది....'

'నాకెందుకు చెపుతున్నారు ? వాళ్ళ వయసులు నాకు తెలియవా?'

'ఎందుకంటే – ఇంకో రెండేళ్ళు పోతే, యీ సంబంధాలూ రావని ; ఆ పెళ్ళికొడుకులు మనకోసం కనిపెట్టుకు కూచోరని.'

రాజగోపాల్ మాట్లాడలేదు.

'నీ ప్రయాణానికి డబ్బు రెడీగా వుంచాను. మీ మామ్మ పిచ్చిది. ఆడది కాబట్టి అలిగి తన బాధ్యతనించి తప్పించుకోవాలనుకుంది. మనం మగవాళ్ళం – మాటఅంటే కట్టుబడి వుండాల్సినవాళ్ళం. ఈ అయిదు వందలూ వుంచుకో.'

ఎక్కడినుంచి తెచ్చారు?' అడిగాడు రాజగోపాల్. తండ్రిదగ్గిర డబ్బు వుండదని తెలుసు. ఆయనకి ప్రావిడెంట్ ఫండ్ తప్ప, మరో డబ్బు లేదనీ తెలుసు.

'నోటురాసి'

'నన్ను క్షమించండి, నాన్నా.'

'ఇందులో క్షమార్పణలూ - మన్నింపులూ ఏవీలేవు. తండ్రిగా నా కర్తవ్యం నెరవేరుస్తున్నాను - ఇక మిగిలింది, నీ బాధ్యత ఒక్కటే....' అన్నాడు తండ్రి.

'నేను ఆలోచించుకుని వుత్తరం రాస్తాను' అన్నాడు రాజగోపాల్ డబ్బు తీసుకుంటూ. అతను వెళ్తుంటే మామ్మ తలఎత్తి చూడలేదు. వెళ్తున్నానని చెపుతుంటే, తల గోడవైపు తిప్పుకు పడుకుంది. తండ్రిమటుకు స్టేషనుకొచ్చి రైలెక్కించాడు.

కాకినాడ వెళ్ళాక, రాజగోపాల్ రెండురోజులు పిచ్చిబట్టినట్లు తిరిగాడు. తన కర్తవ్యం ఏమిటి? తన పెద్దలు చెప్పినట్లు పెళ్ళి చేసుకోవాలా? తన మనసు చంపుకుని యీ పెళ్ళికి వొప్పుకుంటే, జీవితం అంతా అసంతృప్తితోనే గడపాల్సివస్తుంది. తనకి సురేఖ కావాలి - సురేఖ లేకుండా తను బ్రతకలేడు.

అయితే, సురేఖ తనని పెళ్ళిచేసుకునేందుకు వొప్పుకుంటుందా? ఎందుకు వొప్పుకోదు! తప్పకుండా యిష్టపడుతుంది. తనకి చదువుంది - తెలివితేట లున్నాయి. సంపాయించుకోగల శక్తి వుంది. అన్నిటికీమించి ప్రేమించే హృదయంవుంది. సురేఖకి తనమీద యిష్టంవుంది. రెండేళ్ళుగా నడుస్తున్న యీ పరిచయం వట్టి స్నేహమేనా? అంతకంటే లోతైన ఆకర్షణ తమ మధ్య లేదా? వుంది. పెళ్ళిచేసుకున్నాక సురేఖ తన నృత్యం మానేస్తుందా? ప్రదర్శనలిస్తూ - యిలా వూరూరా తిరగడం తను భరించ

గలడా? సురేఖని గృహిణిగా—తన నెచ్చెలిగా ఊహించుకుంటున్నాడేతప్ప—ఆమెని నర్తకిగా — వేలాది ప్రేక్షకులముందు నృత్యంచేసే నర్తకిగా — ఊహించుకోలేకుండా ఉన్నాడు.

సురేఖకి ఉత్తరం రాస్తే? ఏమని? పోనీ, మద్రాసువెళ్ళి తన చిక్కులు వివరిస్తే. పెళ్ళిచేసుకోడానికి సురేఖ యిష్టపడినా, తల్లి వొప్పుకుంటుందా? ఆ గురువుగారు వూరుకుంటారా? ఒకవేళ ఆ తల్లీ కూతుళ్ళూ వొప్పుకున్నా — వెంటనే వాళ్ళ బాధ్యతని స్వీకరించగల స్థితిలో తాను ఉన్నాడా? రాజగోపాల్ పరిస్థితి సుడిగుండంలో చిక్కున్న గడ్డిపోచలాగా ఉంది. అతను గిరగిర తిరిగిపోతున్నాడు; సుళ్ళుతిరిగి పోతున్నాడు — ప్రవాహవేగంలో చిక్కుకుని!

ఆ తరువాత పదిరోజులకి అతను శని ఆదివారాల్లో ఇంటికెళ్ళాడు. మామ్మ సమక్షంలో పెళ్ళిచూపులు జరిగినాయి. పిల్ల ఎలావుంది అన్నది రాజగోపాల్ గమనించలేదు. ఆ పిల్లవంక కన్నెత్తికూడా చూడలేదు. 'పిల్ల నచ్చిందా' అని మామ్మ అడిగి, జవాబుకి ఎదురుచూడకుండా 'మావాడికి పిల్ల నచ్చింది — లగ్గాలు పెట్టుకోండి' అని ప్రకటించింది. ఆరోజునుంచీ మళ్ళీ రాజగోపాల్ మామ్మకి ముద్దుల మనుమడు అయ్యాడు. అతనికి రాజ మర్యాదలు జరగటం ఆరంభించాయి. అయితే, రాజగోపాల్‌కి ప్రపంచ మంతా — నిస్సారంగా, శూన్యంగా తోచసాగింది. ఒక యంత్రంలాగా చదువుతున్నాడు. పరీక్షలు రాశాడు. పాసయాడు. పెళ్ళిలగ్నం పదిరోజు లుందనగా సురేఖకి ఒకే ఒక్కలైను జాబు రాశాడు— 'నేను పిరికివాణ్ణి — నన్ను క్షమించు' అని!

ఒక్కలైనులో వచ్చిన ఈ ఉత్తరం చూచుకు సురేఖ గాబరాపడింది. అర్థం తెలియక తికమకపడింది. ఆ ఉత్తరం తల్లికి చూపించలేదు. దాని గురించి ఎవరితోనూ చర్చించలేదు. ఆ తరువాత నాలుగురోజులకి — పోస్టులో రాజగోపాల్ పెళ్ళిశుభలేఖ వచ్చింది.

ఆ సాయింత్రం 'బెనిఫిట్ షో'లో నృత్యంచేస్తూ, వేదికమీద విరుచుకు పడిపోయింది, సురేఖ. ప్రేక్షకుల్లోవున్న డాక్టరు, గభాలున వేదికమీదకొచ్చి - పల్సు చూసి, చాలా బలహీనంగావుందనీ, బాగా జ్వరంగా కూడా వుందనీ చెప్పి - గ్రీన్‌రూమ్‌లోకి తీసుకెళ్ళి 'గ్లూకోజ్' ఎక్కించాడు. ఆ రాత్రి సురేఖకి బదులు అమీనా మిగతా అయిటమ్సు చేసింది. ఒక నర్తకి యిలా వేదికమీద పడిపోవటం, దినపత్రికలు చాలా విచిత్రమైన వార్తగా ప్రకటించాయి.

ఈవార్త. స్నాతకంపీటలమీద కూచోబోతున్న రాజగోపాల్ చెవిని ఎవరో వేశారు. అప్పటికి నాలుగురోజులక్రితం వార్త అది. రాజగోపాల్ తన నరాల్లో రక్తం పారటంలేదనుకున్నాడు. సీసం కరిగించిన ద్రవం తన నరాల్లోకి ఎక్కించారు. అందుకే శిలారూపుడై - పెండ్లితంతు పుగిస్తున్నాడు.

# 3

అలా వేదికమీద పడిపోయిన సురేఖ మూడునెలలదాకా పక్కమీంచి లేవలేదు. ముందు మామూలుజ్వరం అన్నారు. ఆపైన టైఫాయిడ్ అన్నారు. నార్మల్‌కి వచ్చిందని పథ్యం పెడితే, మళ్ళీ తిరగబెట్టింది. డబుల్ టైఫాయిడ్ నెమ్మదించి మళ్ళా లేచి కూచునేసరికి - సురేఖ పుల్లలాగా అయిపోయింది. ఆమెలోని లావణ్యాన్ని, యవ్వనాన్ని, ఆరోగ్యాన్ని ఎవరో గొలుసులువేసి లాక్కెళ్ళిపోయినట్లు ఎముకలగూడులా మిగిలింది. ఆ మూడునెలలూ గురువుగారు సురేఖని వదలలేదు. డాక్టర్లని తీసుకురావడం, మందుమాకులు - టానిక్కులు యిలా యింటికి కావలసిన సామాను నుంచి ప్రతిదీ యింటిమనిషిలా - రోజూ వచ్చి కనుక్కుంటూ ఉండేవారు. సురేఖమంచంమీద కూచుని, పసిపిల్లని లాలించినట్లు లాలించి, మధ్యమధ్య కేకలువేస్తూ, సురేఖని మళ్ళీ మనిషిని చేశారు. కేవలం

శిష్యురాలిగాకాక, తన స్వంత బిడ్డలాగా ఆయన అంతటి శ్రద్ధా అనురాగం కనపరిచినపుడు సురేఖకి ఒక్కోసారి దుఃఖంవచ్చేది - ఒక్కోసారి ఆయన పట్ల జాలిగా వుండేది.

మూడునెలలు గడిచి నాలుగోనెల ప్రారంభమయింది. సురేఖ ఎందుకు అలా స్టేజిమీద పడిపోయిందో, దానికి కారణం సూటిగా గురువుగారు అడగలేదు ; తల్లీ అడగలేదు. ఆతరువాత సురేఖ జ్వరంలో వుండగా టేబుల్‌మీదవున్న శుభలేఖ చూసి అసలు విషయం గ్రహించుకున్నారు. ఒకవైపు వారిద్దరికీ పెద్దఆపద తొలిగిపోయినట్లుగా అనిపించినా, మరోవైపు సురేఖమీద జాలిగాకూడా వుంది.

'రేపటినుంచీ మళ్ళీ ప్రాక్టీసు ఆరంభించు' అన్నారు ఆ సాయంత్రం గురువుగారు.

'నేనింక డాన్సు చెయ్యలేనండీ' అతి నెమ్మదిగా అంది సురేఖ.

'నువ్వు చెయ్యగలవో లేదో నాకు తెలుసు. పిచ్చివేషాలు వెయ్యకు. రేపు మంచిరోజు. ఏడున్నరకి - రాహుకాలం వెళ్ళిపోతుంది. నేను వస్తున్నాను—నువ్వు కాలికి గజ్జ కడుతున్నావు' అన్నాడు ఫీంకరిస్తున్నట్లు.

సురేఖ గురువుగారివంక నిస్సహాయంగా చూసింది. ఆయనకి మామూలు నాట్యాచార్యుల్లాగా గిరజాలు వుండవు. తమలపాకులు వేసుకోరు. నుదుట బొట్టుపెట్టుకోరు. పొడవుగా, కడ్డీలా వుంటారు. సిల్కులాల్చీ, తెల్లపైజామా వేసుకుని, క్లోజ్‌గా క్రాప్ చేసుకుంటారు. ఆయన్ని రోడ్డుమీద చూస్తే, ఎవరూ నాట్యాచార్యుడు అనుకోరు. సహజంగా నాట్యంచేసే పురుషుల నడకలో ఒక స్త్రీత్వం కనిపిస్తుంది. గురువుగారి నడకలో ఆ అడంగితనం వుండదు. ఆయన అడుగులు దృఢంగా, గంభీరంగా వుంటాయి.

'ఇంకో మూడునెలల్లో మన ట్రూప్ యూరప్ వెళ్ళబోతున్నది....'

సురేఖ వుత్సాహంగా కళ్ళెత్తి చూసింది. మళ్ళీ నీరసంగా రెప్పలు వాల్చింది. అయితే ఆమె కళ్ళలో తళుక్కుమన్న మెరుపు – గురువుగారు కనిపెట్టకపోలేదు. తృప్తిగా వూపిరి పీల్చుకుని, 'మనదేశంలోచేసే నృత్యాలు వేరు. బయటదేశాలలో యివ్వవలసిన అయిటమ్స్ వేరుగా వుంటాయి. ఒక పదిరోజులు బాగా ప్రాక్టీసుచెయ్యి. ఆ తరువాత ఏఏ అయిటమ్స్ చెయ్యాలో నిర్ణయించుకుందాం' అన్నారాయన.

'నేను చెయ్యలేనేమో !'

'చెయ్యగలవు. ప్రోగ్రామ్ రెండుగంటకంటే వుండదు. నీ అయిటమ్స్ మూడుకంటే వుండవు. మిగతావి గ్రూప్ అయిటమ్స్. మనవాళ్ళకిమల్లే ఆదేశాల్లో మూడుగంటలు కూచోలేరుట. అయిటమ్‌కీ అయిటమ్‌కీ మధ్య మూడునుంచి అయిదునిముషాలు – ఇంగ్లీషులో చిన్న పరిచయం వుంటుంది' అన్నారు గురువుగారు.

సురేఖ మాట్లాడలేదు.

'బయటదేశాలకి వెళ్ళే అవకాశం అందరికీ రాదు. ఆంధ్రసంస్కృతి చాటడానికి వెళ్తున్న ట్రూపు మనది – మొట్టమొదటిది. పిచ్చి పిచ్చి ఆలోచనలు మనసులో పెట్టుకోకు. నువ్వు కళాకారిణివి. నృత్యం చెయ్యటం నీ ధ్యేయం. మిగతావన్నీ సెకండరీ' అన్నారు గురువుగారు లేస్తూ.

ఆరాత్రి పడుకునేముందు హార్లిక్సు తాగుతుంటే తల్లి అంది. 'నువ్వు వొళ్ళెరక్క పడివున్నపుడు. మీ గురువుగారు కన్నతండ్రిలా వచ్చి ఆదుకున్నారు. ఆయన ఋణం ఎన్నిజన్మలకీ తీర్చుకోలేం.'

'నాకు డాన్సు చెయ్యాలని అనిపించటంలేదు.'

'ఈమాత్రం అవకాశంకోసం మీ 'స్కూల్లో' ఎంతమంది కాచుకున్నారో తెలుసా? మీ గురువుగారికి నీమీద ప్రత్యేకమైన అభిమానం కాబట్టి మూడునెలలూ – నీ మందు మాకులేకాదు, ఇంటి ఖర్చులుకూడా

ఆయనే చూసుకున్నారు' అంది తల్లి. నృత్యనికేతనాన్ని తల్లి 'స్కూలు' అంటుంది. సురేఖ చాలాసార్లు చెప్పింది, అది స్కూలుకాదు డాన్సు నేర్పే గురుకులం అని.

'నాకేమిటో నీరసంగా వుంటున్నది.'

'ఇంత జబ్బుపడ్డాక – నీరసంగా వుండదా? రెండురోజులు నిస్త్రాణగా వుంటుంది. ఆ తరువాత ఆకలి అదే పుట్టుకొస్తుంది. రేపటినుంచి యాపిల్‌జ్యూస్‌కూడా యిమ్మన్నారు. గ్లూకోజ్ కలిపి యిస్తే బలంగా వుంటుందిట. అమ్మాయ్, నామాట విను – ఎంత చెప్పినా, ఎంత చదువుకున్నా పెళ్ళి అనేప్పటికి ఎవరికులం వాళ్ళు చూసుకుంటారు. నువ్వు పిచ్చిదానిలాగా లేనిపోని ఆశలు పెట్టుకున్నావు' అంది తల్లి కిటికీలోంచి బయటకి చూస్తూ.

'అమ్మా, నీకూ యిటువంటి చేదు అనుభవం కలిగిందా? నాకంటే లోతుకి నువ్వు దిగిపోయావా? నేను హృదయాన్నే పారేసుకున్నాను – నువ్వు – నువ్వు యింకా ఏం పారేసుకున్నావు? దాని ఫలితమే నేనా?' ఎన్నో తల్లిని అడగాలని వుంది సురేఖకి. కాని ఆ ప్రశ్నలు నాలిక చివరికి రావటంలేదు. మరునాటినుంచీ మళ్ళీ ప్రాక్టీసు ఆరంభించింది. సురేఖ, రాజగోపాల్ జ్ఞాపకాన్ని పూర్తిగా తుడిచివెయ్యటానికి, గుండె రాయి చేసుకుని, ప్రాక్టీసులో పడిపోయింది. ఈ సురేఖలో గురువుగారికి కొత్త వ్యక్తి కనిపించింది. ఆమెలో బాల్యం, అల్లరీ మాయమైపోయాయి. పట్టుదల, గంభీరత ఒకేరకమైన ఏకాగ్రత కనిపించాయి. అనుకున్నదానికంటే ముందుగా సురేఖ ఆరోగ్యం పుంజుకుంది. ఆమె హావభావాల్లో మానసికమైన పరిణతి కనిపించాయి. మూడునెలల తరువాత ట్రూప్ అంతా యూరప్ వెళ్ళారు.

* * *

రాజగోపాల్ వధువుమెడలో తాళి కడుతున్నాడు. అతని చేతులు యాంత్రికంగా ఆమె మెడచుట్టూ వున్నాయి. పసుపుతాడు రెండుచేతుల్తో పట్టుకుని మూడుముళ్ళు వేస్తున్నాడు. ఎదుట వున్నది ప్రాణంవున్న యువతి. ఆమెలో రక్తమాంసా లున్నాయి. ఈ మూడుముళ్ళతో జీవితాంతం తామిద్దరూ కలిసి బతకాలి. ఈ ఆలోచనలు ఏమీ అతనికి రావటంలేదు. స్తంభంచుట్టూ చేతులు వేసినట్లు ఆ సన్నని మెడచుట్టూ చేతులువేసి మూడుముళ్ళూ వేస్తున్నాడు. సన్నగా, నాజూగ్గావున్న ఆ పిల్ల మెడ అతను గమనించలేదు. కష్టసుఖాల్లో, భోగభాగ్యాల్లో తామిద్దరూ పాలుపంచుకుంటామని పౌరోహితుడు మంత్రాలు తమచేత వల్లింపచేస్తున్నాడు. అర్థం తెలియకండా ఈ అపరిచితు లిద్దరూ ఆ రెంటినీ తిరిగి తిరిగి అంటున్నారు యాంత్రికంగా. ఈ మంత్రాల తరువాత, ఈ క్రతువు తరువాత తామిద్దరూ ఒకటవుతారు. అయితే ఇలా ఒకటిగా కలిసి జీవించవలసిన ఆ పిల్ల పేరు కూడా రాజగోపాల్‌కి గుర్తులేదు. ఆ అమ్మాయిపేరు కృష్ణవేణి అనీ, స్కూలుఫైనలు పాసయిందనీ, తన సర్వస్వం – యీ వ్యక్తికి ధారాదత్తం చెయ్యడానికి సిద్ధపడి, పెద్దల సమక్షంలో తాళి కట్టించుకుంటున్నదనీ అతనికి తట్టటంలేదు. సురేఖ – సురేఖ ఈమూడు అక్షరాలపేరుమటుకే అతని చెవుల్లో గింగురుమంటున్నది. సురేఖ వేదికమీద విరుచుకుపడిపోయింది.... దానికి కారణం తనే. ఆమెలో లేనిపోని ఆశలు కలిపించి, చివరికి పిరికివాడిలాగా తను ఈ పెళ్ళికి వొప్పుకున్నాడు. ఈ ఆలోచనలే అతని మెదడులో సుళ్ళు తిరుగుతున్నాయి.

పెళ్ళి అనుకున్నదానికంటే వైభవంగా జరిగిందని అందరూ మెచ్చుకున్నారు. ఆడపెళ్ళివారు ఎటువంటి కొరతా లేకుండా అమితమైన మర్యాదలు చేశారని మామ్మ వేయినోళ్ళ పొగిడి ఆనందపడిపోయింది. రాజగోపాల్ పెళ్ళి అయిన వారంలోపలే అతని ఇద్దరి చెల్లెళ్ళకూ ఒకే ముహూర్తంలో పెళ్ళి జరిగింది. పెద్దచెల్లెలికి రాజగోపాల్ తలిదండ్రులూ,

చిన్న చెల్లెలికి రాజగోపాల్ దంపతులూ పీటలమీద కూచుని కన్యధార పోశారు. తనపక్కన పీటలమీద కూచున్న కృష్ణవేణి అపరిచితవ్యక్తి. ఆమె ఎవరో తనకి తెలియదు. ముక్కూ, ముఖం తెలియని ఒక అపరిచితురాలు, తనని అంటుకుని, తాకుతూ కూచునివుంది. తాను పెళ్ళికొడుకు కాళ్ళు కడుగుతుంటే - ఈ అపరిచితురాలు, నీళ్ళు పోస్తున్నది - చేతులు తుడుచుకోమని టవల్ అందిస్తున్నది. రాజగోపాల్ మనసంతా గందరగోళంగా వుంది.

చెల్లెళ్ళిద్దరూ అత్తవారింటికి పెళ్ళిపోయాక - రాజగోపాల్ మొదటిసారి కృష్ణవేణిని గురించి ఒకమనిషిగా, తోటిప్రాణిగా ఆలోచించాల్సిన అవసరం వచ్చింది. బంధువులు అందరూ వెళ్ళిపోయారు. ఇల్లు ప్రశాంతంగా వుంది. పరీక్షలు అయిపోయిన రాజగోపాల్‌కి కాలేజీ వంకపెట్టి తప్పించుకుని పారిపోయే అవకాశంకూడా లేదు.

రాత్రి గదిలోకి వచ్చిన కృష్ణవేణివంక తొలిసారి కన్నెత్తి చూశాడు. అప్పటికి అయిదారురోజులుగా కృష్ణవేణి ఈ గదిలోకి వచ్చి పడుకుంటున్నది. అతను ఆమెను పలకరించలేదు. దగ్గరకు రమ్మని పిలువలేదు. స్పృశించనూలేదు. కృష్ణవేణి తన భర్త నిరాదరణని నిశ్శబ్దంగా సహించింది. 'ఇష్టంలేదా ?' అని ప్రశ్నించలేదు - 'నన్నెందుకు నిరాదరణగా చూస్తున్నా'రని అడగలేదు - 'ఇష్టంలేనివారు యీ పెళ్ళి ఎందుకు చేసుకున్నా'రని నిలవదియ్యనూలేదు. నిశ్శబ్దంగా, మంచంమీద ఒకమూలగా వొరిగిపడుకుంటోంది - అతన్ని తాకనైనా తాకకుండా ! పుస్తకంలాగా జాగ్రత్తగా వొదిగి పడుకుంటోంది. చాలాసేపు రాజగోపాల్ సురేఖని గురించి కలలుగంటూ కళ్ళు మూసుకుని, నిద్రపోకుండా మూసిన రెప్పల క్రింద దొంగతనంగా కలలుకంటూ గడుపుతున్నాడు. అంతక్రితంరోజు రాత్రి కృష్ణవేణి, సన్నగా ఏడుస్తున్నట్లు అతనికి వినిపించింది. ఎందుకు ఏడుస్తున్నదో అనికూడా కుతూహలం కలగలేదు. ఆ గదిలో మరోమనిషి

వున్నట్లుకూడా అతనికి గు ర్తుకు రాలేదు. కళ్ళు గట్టిగా మూసుకు పడుకున్నాడు.

తెల్లవారాక అత నింకా పక్కమీంచి లేవలేదు. కృష్ణవేణి గదిలోంచి వెళ్ళిపోయింది తలుపు వోరవాకిలిగావేసి. రాజగోపాల్ ధైర్యంగా కళ్ళు తెరిచి గది నాలుగువైపులా పరకాయించి చూశాడు. మంచంమీద మరో వ్యక్తి పడుకున్న గుర్తులు. తలగడమీద లోతుగా తల ఆనిన గుర్తు. పక్కన తలగడగలీబుమీద కన్నీటిమరకలు. రాజగోపాల్‌కి తొలిసారి కృష్ణవేణి గురించి - ఆమె ప్రాణంవున్న మనిషిగా ఆలోచనలు వచ్చాయి.

తను తల్లితండ్రులకోసం — మనసు చంపుకుని — యీ పెళ్ళి చేసుకున్నాడు. తండ్రి ఆ కట్నం డబ్బుతో చెల్లెళ్ళ పెళ్ళి చేశాడు. ఇరవై వేలు కట్నంతో తన జీవితాన్ని పాలుపంచుకోడానికి, తన సర్వస్వాన్ని అర్పించడానికి ఈ ఇంటి కొచ్చిన యీ పిల్ల మాటేమిటి? ఆమె ఆలోచనలు ఎలా వుంటాయి ? అందరి ఆడపిల్లలులాగానే ఆ అమ్మాయి ఆశలతో, కలలతో తమ ఇంట అడుగు పెట్టిందా ? ఈ పెళ్ళికి ఆ పిల్ల ఎంతవరకూ బాధ్యురాలు ? కట్నం తీసుకుని ఆమె మెడలో తాళికట్టిన తనకు - కనీసం పల్కరించి ఆదరించగలిగిన బాధ్యతలేదా? ఆరోజు చాలాసార్లు కృష్ణవేణి ఏడ్పు జ్ఞాపకం వచ్చింది. ఈ పరిస్థితుల్లో మరో ఆడపిల్ల అయితే ఏం చేసేది ? ఏడ్చి రాగాలుపెట్టి - నాభర్త నాతో మాట్లాడటంలేదని యాగిచేసి వుండేదికదా ? కాని, ఈ కొత్తవ్యక్తి-నోరెత్తలేదు. పల్లెత్తుమాట అనలేదు. చాలా గుంభనగా, సహనంగా ప్రవర్తిస్తున్నది. ఆ అమ్మాయి అంత గంభీరంగా ప్రవర్తిస్తున్నపుడు తన కర్తవ్యం ఏమిటి ?

కృష్ణవేణి సహనంముందు, ఆమె గుంభనముందు రాజగోపాల్ వోడిపోయాడు. వయసులోవున్న అతని దేహం, ఆమెపట్ల జాలి కృతజ్ఞతలతో మిశ్రమైన అతని హృదయం కృష్ణవేణికి దగ్గర అయాయి. అతను ఆమెతో ఒకటి రెండుమాటలుకూడా మాటాడేవాడుకాదు. చాలా

యాంత్రికంగా, ఇది తన కర్తవ్యంలో ఒకభాగ మన్నట్లు భార్య వంటిమీద చెయ్యివేసేవాడు. కృష్ణవేణి అతనిచేతిలో బొమ్మలాగా మారిపోయేది. వారి కలయికలో పుద్రేకంగాని, తీవ్రమైన ఆకాంక్షగాని వుండేదికాదు. భర్తగా ఆమెపట్ల అతని కర్తవ్యం నెరవేరుస్తే - భార్యగా ఆమె తన బాధ్యత నెరవేర్చేది. అయితే ఆమెను తాకిన ప్రతిసారీ అతను తనని తాను న్యూనత పరచుకుంటున్నట్లు, వ్యభిచారం చేస్తున్నట్లూ బాధపడుతూండేవాడు. భార్య అయిన యీ స్త్రీని తాకడం, ఆమెతో ఒకమంచంమీద గడపడం అతనికి చాలా అసహజమైన విషయంలాగా అనిపిస్తూండేది. ప్రతిసారీ తను సురేఖకి ద్రోహంచేస్తున్నట్లు – సిగ్గుతో కుంచించుకుపోయేవాడు.

మనమడి పెళ్ళి అయింది – భార్యాభర్తలు అన్యోన్యంగా వున్నారు- అన్నీ సర్దుకుపోయినాయి. వాడి కడుపున ఒకకాయ గాయాలి, అన్న శుభోదయంకోసం ఎదురుచూస్తున్నది మామ్మ. మనుమడు బుద్ధిగా వుద్యోగంలో జేరాడు. అన్నిగొడవలూ సర్దుకున్నాయి – అనుకుంటున్నారు ఇంట్లో అయితే. పైకి మామూలుగా జీవితం వెళ్ళిపోతున్నా రాజగోపాల్ మనసులో అగ్ని రాజుకుంటూనే వుంది. అందరూకలిసి తనని సురేఖకి కాకుండా చేశారు. సురేఖ ఎలా వుంది ? జబ్బు నయమయి, ఆమధ్య విదేశాలకుకూడా వెళ్ళిందని పేపర్లో చదివాడు. ఆమె గురించిన వార్తలు చదివినకొద్దీ, అతని హృదయం అగ్నిపర్వతంలాగా పొగలుకక్కుతూ వుంది. ఆమెను చూడాలన్న కోర్కెను అతికష్టంమీద అణుచుకుని ఉద్యోగం చేస్తున్నాడు – సంసారం ఈడ్చుకొస్తున్నాడు.

అతను వుద్యోగంలోజేరి రెండేళ్ళు దాటుతోంది. హైద్రాబాద్‌లో ఒక కంపెనీలో జూనియర్ పర్చేజ్ ఆఫీసరుగా జేరాడు. కంపెనీ చిన్నది – అతని డెజిగ్నేషన్ పెద్దది .... జీతం ఆరువందలు యిస్తున్నారు. యాంత్రికంగా జరిగిపోతున్న అతని జీవితంలో చిన్నమార్పు. కృష్ణవేణికి నెలతప్పింది. ఇరువైపులవారు వీరి సంసారనౌక తీరం చేరిందనుకున్నారు.

పెద్దఎత్తులో పేరంటాలూ, వాలూ చేశారు. రాజగోపాల్‌కి ఆడపిల్ల కలిగింది. ఈ పిల్ల జననం అతనికి పెద్ద ఆనందాన్ని యివ్వలేదు. పెళ్ళిచేసుకోటం, ఉద్యోగం చెయ్యటం, భార్యతో కాపరం చెయ్యటం, పిల్లని గనటం ఇదంతా తన కర్తవ్యంలోని భాగాలు. ఆ పసిపిల్లని చేతుల్లోకి తీసుకున్నప్పుడు కూడా పుస్తకాల్లో చెప్పే – ఆనందంగాని, గర్వంగాని అతనికి కలుగలేదు. ఒకసారి పిల్లని చూసి, భార్యపక్కగ పడుకోబెట్టి, గదిబయటికి వచ్చాడు.

రాజగోపాల్ కూతురుకి ఏం పేరుపెట్టాలన్న సమస్య రాలేదు. ఎందుకంటే మామ్మ, తనపేరు మనుమరాలికి పెట్టబోతున్నారనీ, ఆ యింట్లో చిన్నసీత పుట్టిందనీ – ఘంటాపధంగా అందరికీ చెప్పటం మొదలుపెట్టింది. చిన్నసీత బారసాల అయిన మూడునెలలకి మామ్మ తృప్తిగా ఈలోకం లోంచి నిష్క్రమించింది. మామ్మ స్వంతయింట్లో చచ్చిపోయింది. ప్రాణం గుడుగుడుమంటుంటే, వీధిలోకి లాగెయ్యలేదు – అందుకని తన కర్తవ్యంలో ఒక బాధ్యత సక్రమంగా తీరిపోయింది అనుకున్నాడు రాజగోపాల్.

కాలం ఎవరికోసమూ ఆగదు అంటారు. కాని కొందరికి కేలండరులో కాయితాలు చినిగిపోవచ్చు. సూర్యోదయ సూర్యాస్తమయాలు క్రమం తప్పకుండా రావచ్చు. అయినప్పటికీ కాలం స్తంభించిపోయినట్లు ఘనీభ వించిన నీటిచుక్కలా క్రిందపడకుండా అలా చూరుపట్టుకు లోలకంషెలె వేళ్ళాడుతున్నట్లూ అనిపిస్తుంది. రాజగోపాల్ పరిస్థితికూడా అలానేవుంది. అతనికి ఈ సంసారజీవితంగాని, వుద్యోగంగాని ఏమీ తృప్తినివ్వకుండా వున్నాయి. ఏదో మహదానుభవం – తనకి అందీ అందనంత దూరంలో చేతి వేళ్ళనుతాకే పిల్లగాలిలాగా – దగ్గరకు వచ్చినట్లే వచ్చి, మళ్ళీ దూరం వెళ్ళిపోతున్నది. జీవితం అంటే ఇంతేనా ? ఇంకేం లేదా ? లేనప్పుడు యీ పరిచయాలూ, యీ హృదయస్పందనలూ వీటి అర్ధం

ఏమిటి ? కొందరు వ్యక్తులపట్లే ఈ ఆకర్షణ దేనికి ? ఈ జ్ఞాపకాల దావానలం దేనికి ?

ఆ సంవత్సరంలోనే రాజగోపాల్ ఆఫీసు మేనేజిమెంటుతో ఘర్షణ పడ్డాడు. కంపెనీ డైరక్టర్లకి యీతని పని తృప్తినివ్వటం లేదు. వారి ఆదేశాలని అనుసరించి పోలేకుండా వున్నాడు రాజగోపాల్. ఆఫీసులో చికాకులు, ఇంట్లో ఒక రకమైన యాంత్రికజీవితం. అన్ని మధ్యతరగతి సంసారాలకిమల్లే, ఇద్దరికి చెల్లెళ్ళ పెళ్ళితో వారి సమస్యలు తీరలేదు. కష్టాలు గట్టెక్కనూ లేదు. మళ్ళీ ఇద్దరుచెల్లెళ్ళు కాలేజీల్లో చేరి - వరాన్వేషణ ఎప్పుడన్నట్లు చీరెలు కట్టుకు నిల్చున్నారు. ఈ జీతం ఎదగదు — ఈ సంసారంలో స్పందన లేదు - ఈ పెళ్ళిళ్ళ సమస్యలకి అంతంలేదు. అతనిమనసు, ఏదో కావాలని, మార్పుకావాలని తీవ్రంగా ఆరాటపడి పోతున్నది. అటువంటి సమయంలోనే — అతను ఒకరోజున పేపరు తెరిచే వేళకు — సురేఖ తల్లి మరణవార్త కనిపించింది. సురేఖ తల్లి ప్రసిద్ధ నటీమణికాదు. ప్రసిద్ధవ్యక్తీ కాదు. ఆమె మామూలు సగటు స్త్రీ. కాని, సురేఖకి తల్లి. సురేఖ తన తల్లిపై గల భక్తిని - ప్రేమని దినపత్రికలో 'బాష్పాంజలి' ద్వారా 'ఫోటో'తోపాటు ప్రకటించింది. పేపరు తెరిచీ తెరవగానే, ఆత్మశాంతి అన్న ఆ ఫోటోచూసి — తాగే కాఫీసంగతి మర్చిపోయి కూచుండిపోయాడు రాజగోపాల్.

ఆ ఛాయాచిత్రం ఒకసారి అతనిపై జ్ఞాపకాల వెల్లువలా దూకింది. సురేఖ తల్లి చనిపోయింది. సురేఖకి ఎవరూలేరు. ఏకాకి అయిన సురేఖని తాను వదలలేడు. ఆ రాత్రి అర్జంటు పనివుందని మద్రాసు మైలు ఎక్కాడు రాజగోపాల్. అతను ఇంటికెళ్ళేవేళకి ఏడు దాటింది. సెంట్రల్‌లో రైలు దిగి — సరాసరి మాంబళం వెళ్ళాడు. తలుపుతట్టగా, పనిమనిషి తలుపు తీసింది.

'అమ్మగారున్నారా ? ' అడిగాడు రాజగోపాల్.

'తమరెవరు ? '

'వారి బంధువుని, స్వంతవాడిని.'

'ఉన్నారండి. రెండు రాత్రిళ్ళుగా ఒక్కక్షణం కన్ను మూత పడలేదండి. అలా చూస్తూ పడుకున్నారండి. మేస్టారు చెప్పారని వున్నాను గానీండి, ఆ అమ్మగారు అలా పడివుంటే భయంగా వుందండి - మాట్లాడరు, ఏడవనన్నా ఏడవరు.'

రాజగోపాల్ పనిమనిషి చెప్పేది వినిపించుకోకుండా, ఆమెను తోసుకుంటూ లోపలిగదిలోకి వెళ్ళాడు. సురేఖ పైకప్పుకేసి చూస్తూ పడుకుని వుంది.

'సురేఖా' అన్నాడు రాజగోపాల్ బొంగురుగా.

'గోపీ, వచ్చావా - నా కెవ్వరూ లేరనుకున్నాను. అమ్మ వెళ్ళిపోయింది. నాకు భయంగా వుంది గోపీ.' బల్లిలా, పసిబిడ్డలా అతన్ని కరుచుకుని గుండెలు అవిసేలాగా ఏడ్చింది సురేఖ. ఆమెని ఎలా సముదాయించాలో తెలియలేదు. గట్టిగా గుండెలకి అదుముకున్నాడు - ఇక ఎన్నడూ విడిచిపెట్టను అన్నట్లు!

ఒక పావుగంటదాకా సురేఖ ఏడుస్తూనే వుంది. ఆమె ఎక్కిళ్ళు కొద్దికొద్దిగా తగ్గినాయి. సురేఖ అలావే డస్సిపోయినట్లు అతని గుండెల మీదనే తలపెట్టుకుని వుంది. రాజగోపాల్ నెమ్మదిగా ఆమె తలఎత్తి చూశాడు. సురేఖ నిద్రపోతున్నది. ఆమె వుచ్ఛ్వాస నిశ్వాసాలు క్రమంగా వున్నాయి. మధ్యమధ్య వులిక్కిపడుతోంది. మరికాసేపు అలాగే కదల కుండా కూచుని, నెమ్మదిగా సురేఖని మంచంమీద పడుకోబెట్టి - అలాగే చెయ్యి పుచ్చుకుని పక్కన కూచున్నాడు. అతను సురేఖచెయ్యి వదలలేదు.

మూడురాత్రిళ్ళనుంచీ కన్నుమూయని సురేఖ ఆ వుదయంపూట అలిసి పోయినట్లు నిద్రలోకి జారుకుంది.

తొమ్మిదింటివేళ గురువుగారు వచ్చారు. ఆయన వెనుక పనికుర్రాడు కారియర్ తీసుకొచ్చాడు. గదిలోవున్న రాజగోపాల్‌ని చూసి ఒక్కక్షణం పస్తాయించి, మళ్ళీ వెంటనే సర్దుకుని 'ఎప్పుడొచ్చారు ?' అని ప్రశ్నించారు చాలా క్లుప్తంగా.

'మెయిల్లో' బదులు చెప్పాడు రాజగోపాల్.

'ఆ బాబుగారు వచ్చాక – గట్టిగా ఏడ్చి, నిద్రపోయారు. అమ్మగారు పోయాక యిప్పుడే నిద్రపోయారు. మూడురాత్రిళ్ళు అలా కళ్ళు మూయ్యలేదండి' పనిమనిషి చెపుతోంది గురువుగారితో.

'ఎలా పోయారు ? ఏం జబ్బు చేసింది?' అడిగాడు రాజగోపాల్.

'మీకెలా తెలిసింది ?'

'డైలీలో చూశాను.'

గురువుగారు కుర్చీలో యిటూ అటూ కదిలి, 'హార్ట్ఎటాక్. ఆ రాత్రికూడా ఫోంచేసిందిట. ఒకరాత్రివేళ గుండెల్లోనెప్పి అందిట. ఇంట్లో ఎవరూలేరు. పాపం, ఆడపిల్ల ఎవరిని పిలుస్తుంది? పక్కింటివాళ్ళని బతిమాలితే డాక్టరుని తీసుకొచ్చారు. నాకు ఫోన్ చేశారు. నేను వచ్చేప్పటికే అంతా అయిపోయింది. డాక్టరు ఆర్టిఫిషెల్ రెస్పిరేషన్‌ట – గుండెలు మర్దించాడు. నోట్లో నోరుపెట్టి వూదాడు. ఆఖరికి లాభంలేదని వదిలేశాడు' అన్నాడాయన.

'వాళ్ళ బంధువులు ఎవరూ లేరా?' అడిగాడు రాజగోపాల్.

'ఆమెకి ఒక అన్నగారున్నారుట. ఆయ నెక్కడో విజయనగరంట. వాళ్ళకీ వీళ్ళకి రాకపోకలు లేవనుకుంటా.'

'ఇంకెవరూలేరా?' నొక్కి నొక్కి అడిగాడు రాజగోపాల్.

'సురేఖ – తండ్రివైపువాళ్ళా ?'

అవునన్నట్లు తలవూపాడు రాజగోపాల్.

'వాళ్ళెవరూ యీమెని లక్ష్యం చెయ్యరు. సురేఖ తండ్రి చాలారోజుల క్రితం పోయాడు'

'వాళ్ళ కుటుంబం గురించి మీకేం తెలియదా?'

'తెలిపి ప్రయోజనం? వాళ్ళకి వీళ్ళు అక్కరలేనపుడు - ఎవరు ఎవరికి తెలిపీ లాభం ఏమిటి?' అడిగారు గురువుగారు.

'సురేఖ సంగతి ఎలా?' అడిగాడు రాజగోపాల్ యింక ఏవిధంగా అడగాలో తెలియక.

'ఎలా ఏవుంది - ఇన్నాళ్ళనుంచీ బతకటంలేదా? అలాగే బతుకుతుంది' అన్నారాయన కాస్త తీక్షణంగా.

'ఇప్పుడు వొంటరిది - తల్లిలేదు....' ఆగాడు రాజగోపాల్.

'ఫరవాలేదు. మా నికేతనంలో ఒకగది ఖాళీ చేయిస్తాను. అక్కడుంటుంది. మీకు తెలియదేమో; నా కాపరంకూడా అక్కడే' అన్నాడాయన.

రాజగోపాల్‌కి ఏం చెప్పాలో తెలియటంలేదు. తల్లిలేకుండా ఈ సురేఖ వంటరిగా ఎలా వుంటుంది? గురువుగారికి ఆపిల్లమీద వాత్సల్యం వుండచ్చు. కూతురులాగా చూసుకోవచ్చు. కాని, ఎన్నాళ్ళు యిలా గడుస్తుంది? ఆయన భార్యాపిల్లలు వూరుకుంటారా? సురేఖ ఈ ట్రూప్‌లో ముఖ్యనర్తకి కావచ్చు. అంతమాత్రంచేత యింట్లో తెచ్చిపెడితే వూరుకుంటారా? ఇరవై రెండేళ్ళ యీ పిల్ల భవిష్యత్ ఏమిటి?

'మీరింకా వుంటారా?' అడిగారు గురువుగారు.

'ఏదీ నిశ్చయించుకోలేదు. పేపరు చూడగానే రైలెక్కి వచ్చేశాను' అన్నాడు రాజగోపాల్.

'మళ్ళీ కలుస్తాను. సాయంత్రం వస్తాను. సురేఖతో చెప్పండి' అంటూ గురువుగారు వెళ్ళిపోయారు.

రాజగోపాల్ యిలా పరుగెత్తుకు రావటం ఆయనకి ఆశ్చర్యంగా వుంది. ఒకవైపు కాస్త నిశ్చింతగాకూడా వుంది. అనుకోని ఈ హటాత్ దుర్ఘటనతో, సురేఖని ఏంచెయ్యాలి అన్నది, ఆయనకి సమస్యగానే వుంది. తన భార్య, యిద్దరు పిల్లలు, నృత్యనికేతనంలోని స్టూడెంట్సు, మధ్య మధ్య చేసే టూర్సు, వీటన్నిటిమధ్యనా యింకో ప్రాణి బాధ్యత వహించడానికి ఆయనకి తీరికలేదు. సురేఖపైన ఇంకొక భావమూలేదు. బాల్యంనుంచీ సురేఖకి నాట్యశాస్త్రంలో శిక్షణ యిచ్చాడు. మిగతాపిల్లలకంటే కాస్త ప్రత్యేకతతోనే ఆ పిల్లకి విద్య గరిపాడు. ఆపిల్లవల్ల నృత్యనికేతనం కొంతవరకూ నిలదొక్కుకుంది. తన జీవనాధారంలో యీ సురేఖకి ముఖ్యభాగం వుంది. అటువంటి సురేఖని – యీ సమయంలో వదులుకోడం సాధ్యంకాదు. కాని, నికేతనంలో తెచ్చిపెట్టుకుంటే – ఏర్పడగల చిక్కులని విస్మరించనూలేడు. సురేఖతల్లి పోయినబాధకంటే, ఆ అమ్మాయిని ఏం చెయ్యాలో తెలియక తల్లకిందు లౌతున్నారు గురువుగారు. నిన్న మొన్నటి దాకా సురేఖని సినిమావాళ్ళు లాక్కుంటారేమో, మొగవాళ్ళు తమవైపు తిప్పుకుంటారేమోనన్న భయాల్తో సురేఖ తల్లీ, తనూ యిద్దరూకలిసి, అతి జాగ్రత్తగా ఆపిల్లచుట్టూ కనపడని గోడకట్టారు. ఆ గోడవల్ల సురేఖ వంటరిదయిందు. ఏకాకిగా మిగిలిపోయింది. ఆ పిల్లని ఆదుకుని, రక్షణ యిచ్చేపాటి ధైర్యం తనకిలేదు. పెళ్ళి అయిన యీ రాజగోపాల్ సురేఖని ఆదుకుంటాడా? ఎలా ఆదుకుంటాడు? ఒకటిరెండురోజులయినా ఆ పిల్లకి మార్పుగా వుంటుంది. ప్రస్తుతం యిదీ మంచిదే అనుకున్నారు గురువుగారు.

రాజగోపాల్ బుర్రలోకి ఎటువంటి ఆలోచనలూ రావటంలేదు. అతను భార్యను, పిల్లను, తనవాళ్ళని అందరిని మర్చిపోయాడు. పక్కమీద వడిలి పోయిన తామరతూడులాగా పడివున్న సురేఖ ఒక్కతే అతని మనసులో ముద్రితమయింది. ఆపిల్లవంక చూస్తున్నపుడు అతనికి అనిర్వచనీయమైన శాంతిగా వుంది. పోగొట్టుకున్న పెన్నిధి దొరికినంత ఆనందంగా వుంది.

అతను ముఖం కడుక్కోలేదు, కాఫీ తాగలేదు. పనిమనిషి ఒకటిరెండుసార్లు జ్ఞాపకంచేసి – లాభంలేదని ఊరుకుంది. మధ్యాహ్నం పన్నెండింటికి సురేఖ కళ్ళుతెరిచింది. 'నేను ఎక్కడున్నాను?' అంటూ వులిక్కిపడుతూ కళ్ళు తెరిచింది.

'ఇక్కడ – నాపక్కన ఉన్నావు' అన్నాడు రాజగోపాల్ మంచంమీద ఆనుకుని కూచుని. సురేఖ రెండుకళ్ళూ వర్షించాయి. రాజగోపాల్‌ని పట్టుకుని మళ్ళీ గొల్లుమంది.

'లే – ముఖం కడుక్కో – కాఫీ తాగుదువుగాని లే –'

'నా కొద్దు – నాకు తాగాలని లేదు'

'నేనూ తాగలేదు. నీకోసం పొద్దుటనుంచీ మొహంకూడా కడుక్కోకుండా కూచున్నాను, లే – ఇద్దరం కాఫీ తాగుదాం–' అంటూ బలవంతాన ఆమెని లేవదీసి కూచోపెట్టాడు. మొహం కడిగించి – కప్పులో కాఫీపోసి అందించి – సురేఖ గుటకవేసేదాకా ఆగి, ఆమె ఒకగుక్క తాగాక – తనూ కాఫీ తాగాడు.

'గోపీ, నాకు ఎవరూ లేరు. నాకు భయంగావుంది –' అంటూ మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది, సురేఖ.

'నీకు అందరూ ఉన్నారు. నేను ఉన్నాను. మీ గురువుగా రున్నారు. నీకేం భయంలేదు –' అంటూ బుజ్జగించాడు.

'నువ్వు – నువ్వు....' తడుముకుంటున్నది సురేఖ.

'జరిగిపోయిన విషయాల గురించి నన్ను ప్రశ్నించకు. ఈ మూడేళ్ళూ నేను – చస్తూ బతికాను.'

సురేఖ గభాలున చేత్తో అతని నోటిని మూసేసింది.

'చెప్పదలుచుకున్నది చెప్పనివ్వకపోతే - మళ్ళీ నీదగ్గర తలెత్తుకోలేను'

'వొద్దు – గోపీ, వొద్దు' అంది సురేఖ – ఏం వినాల్సివస్తుందోనన్న భయంతో.

'నా పెళ్ళి—నా జీవితం—ఉద్యోగం అవన్నీ చిక్కుముళ్ళు. మావాళ్ళ కోసం నా మనసు చంపుకున్నాను. నువ్వు స్టేజీమీద పడిపోయావు – అని విన్నపుడు——'

'నీకు తెలుసా ?'

'పెళ్ళిపీటలమీద కూచున్నపుడు ఆవార్త తెలిసింది'

'గోపీ, నువ్వు స్వయంగా వచ్చి చెప్పివుంటే, అంత షాకయివుండే దాన్ని కాదు'

'లాభంలేదు. నేను నిన్ను ఒక్కసారి చూశానా – మళ్ళీ వెనక్కి వెళ్ళలేకపోయేవాడిని. ఈ నాలుగేళ్ళనుంచి ఒక్కరోజుకూడా నాకు శాంతి కలగలేదు. నువ్వు యింత కష్టంలో వున్నావా — అయినా నీపక్కన కూచున్నపుడు నాకు కొత్త శక్తి, అపరిమితమైన తృప్తి కలుగుతున్నాయి' అన్నాడు రాజగోపాల్ ఆమెని గట్టిగా గుండెలకి హత్తుకుంటూ.

'ఇప్పుడేంచేద్దాం' అడిగింది సురేఖ.

'ఏమీలేదు – నే నిక్కడే ఉండిపోతాను'

'ఎలా ?'

'నా భార్యకి తల్లీ, తండ్రీ ఉన్నారు ; అత్తమామ లున్నారు. కడుపున పుట్టిన బిడ్డ ఉంది. నీకు ఎవ్వరూలేరు — నేనుతప్ప ! అందేత నేను యిక్కడినుంచి కదలను.'

'ఉద్యోగం ?'

'అది ఉద్యోగం కాదు – బానిస బతుకు. నా ఆత్మని చంపుకు, నా గౌరవాన్ని చంపుకుని మూడేళ్ళు చేశాను. ఇక చాలు.'

'మీవాళ్ళు ?'

'అమ్మా నాన్నా – వాళ్ళా ? వాళ్ళకోసం నాజీవితాన్ని, నిన్ను బలి చేశాను. ఇరవై వేలకి నన్ను అమ్మారు – ఇక చాలు. మిగతా చెల్లెళ్ళకి పెళ్ళి వాళ్ళే చేస్తారు – లేకపోతే అలాగే ఉండిపోతారు.'

'అల్లరిచేస్తారేమో ?'

'చెయ్యరు .... మావాళ్ళు చెయ్యదల్చుచ్చిన్నా - కృష్ణవేణి - అంటే నా భార్య - చెయ్యనివ్వదు.'

'మీ మామగారు ?'

'చూద్దాం. అట్లాంటి పరిస్థితి వస్తే - అప్పుడు ఆలోచిస్తాను.'

సురేఖ కొంచంసేపు నిశ్శబ్దంగావుంది. ఆమె ఏదో నిశ్చయానికి వచ్చినట్లు, 'గోపీ - నీ నిర్ణయం చెప్పావు. అయితే, నా ప్లానుకూడా చెపుతా, విను. నేను యీ నాలుగేళ్ళలో చాలా దేశాలు తిరిగాను. అనేక విషయాలు తెలుసుకున్నాను. నువ్వు యింకా పెద్దచదువు చదువుకోవాలి. నావల్ల నీ జీవితం చెడిపోయిందని కాక, నువ్వు చాలా పెద్దవాడివి అయ్యావు అని అందరిచేత అనిపించుకోవాలి....' అని ఆగింది సురేఖ.

రాజగోపాల్ సురేఖ వంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

'నువ్వు నాదగ్గర వుండిపో. మనిద్దరిమధ్య ఎటువంటి బాంధవ్య మున్నదన్న విషయం - ఎవరికీ అక్కర్లేదు. గురువుగా రంటావా - ఆయనకి నా డాన్సుతప్ప మిగతావిషయాలు అక్కర్లేదు. ప్రస్తుతం నాకు నెలకెంత వస్తోందో తెలుసా ?' అడిగింది సురేఖ.

ప్రశ్నార్థకంగా చూశాడు రాజగోపాల్.

'ఏడువందలయాభై నుంచి - వెయ్యిదాకా వస్తోంది. ప్రోగ్రామ్సు ఎక్కువ ఉంటే పన్నెండువందలుకూడా వస్తుంది. నువ్వు ఎమ్. బి. ఎ. లో చేరు. నీకు చదువుచెప్పించి గొప్పవాడిని చేస్తాను.'

'ఏం - యిలా పనికిరానా ?'

'నీకు ఎలా చెపితే అర్థం అవుతుందో తోచకుండావుంది. ఆ రాజగోపాల్ - డాన్సరు సురేఖ వెంటబడి తిరుగుతున్నాడని గాక, ఆయన కారులో ఈ సురేఖ తిరుగుతోందని అనిపించుకోవాలి ___ ' దృఢంగా, గంభీరంగావుంది కంఠం.

సురేఖ బాగా ఎదిగిపోయింది. తనకంటే పైకి ఆలోచిస్తోంది— అనుకున్నాడు రాజగోపాల్.

'నేను ఎక్కువ చదువుకోలేదు – చదువుకునే అవకాశమూ లేకపోయింది. ప్రోగ్రామ్ అయిపోయాక ప్రతిసారీ – ఎవరో ఒక మొగాడు, 'నా కారులో డ్రాప్ చేస్తాను రండి—' అంటూ పిలుస్తాడు. నేను ఎవ్వరి కార్లోనూ ఎక్కను – గురువుగారు వెంటవుండి దించుతానుకో. అప్పుడు ప్రతిసారీ అనిపిస్తుంది—నామనిషి అన్నవాడు నన్ను కారులో యింటికి తీసుకెళితే, యీ దేభ్యంగాళ్ళంతా 'లిఫ్ట్' యిస్తామని వెంటబడరుగదా – అని.'

'అయితే, నా అవసరం కారులో దించడందాకానేనా....' నవ్వుతూ అడిగాడు గోపి.

అంత దుఃఖంలోనూ సురేఖ నవ్వి 'గోపీ – నీది మొద్దుబుర్ర కాదు. ఇంతకుమించి విడమర్చి చెప్పక్కర్లేదనుకుంటా.' అంది.

ఆ సాయంత్రం గురువుగారొచ్చే వేళకి సురేఖ మంచంమీద లేదు. ముందుగదిలో – సోఫాలో కూచుని ఉంది. ఆ పక్కనే మరో కుర్చీలో రాజగోపాల్ కూచుని ఉన్నాడు. గురువుగారికి బరువుతీరినట్లు అయింది. ఈ రాజగోపాల్ రాకతో, సురేఖ కాస్త మనుషుల్లో పడింది. అయితే, ఎన్నాళ్ళుంటాడు?— అన్న ప్రశ్న కలిగింది, ఆయనకు. ఆ విషయం సూటిగా ఆయన అడగలేదు—సురేఖ చెప్పలేదు.

పదిరోజులపాటు సురేఖ గుమ్మం కదలలేదు....

నికేతన్‌వాళ్ళు రావడం, పలకరింపులూ యథావిధిగా జరిగాయి....

పదిహేనోరోజున సురేఖ మళ్ళీ వేదికనెక్కి డాన్సు ప్రోగ్రామ్ యిచ్చింది.

# 4

రాజగోపాల్ మద్రాసు వెళ్ళి అప్పటికి పదిరోజు లయింది. అతనిదగ్గర నుంచి ఉత్తరం లేదు – ఎటువంటి కబురూ లేదు. పసిపిల్ల సీతతో ఒంటరిగా ఉన్నది, కృష్ణవేణి. అతను అంత అకస్మాత్తుగా ఎందుకు ప్రయాణంపెట్టుకున్నాడో కూడా కృష్ణవేణి ఊహించుకోలేకుండావుంది. ఎందుకంటే – పేపరుచదవగానే రాజగోపాల్ అలా పడేసి వెళ్ళిపోలేదు – చేత్తో పట్టుకెళ్ళాడు. ఏంచెయ్యాలి–ఏంచెయ్యాలి–అని ఖంగారుపడుతున్న సమయంలో రాజగోపాల్‌నుంచి ఉత్తరం వచ్చింది. కృష్ణవేణి తన భర్త దగ్గరనుంచి అందుకున్న తొలి లేఖ అది.

'నేను ఆరునెలలదాకా అటువైపు రావటానికి వీలవదు. ఉద్యోగం కూడా రిజైన్ చేశాను. నువ్వు గుడివాడలో మా నాన్నదగ్గిరకుగాని, లేక బందరులోని మీ నాన్నగారిదగ్గరకుగాని వెళ్ళు. నీకు ఎక్కడ సౌకర్యంగావుంటే అక్కడవుండు. —రాజగోపాల్.'

ఈ ఉత్తరం చదువుకునేప్పటికి కృష్ణవేణి క్షణకాలంపాటు—'అమ్మయ్యా – ఎక్కడో ఒకచోట క్షేమంగా ఉన్నారు – ఎటువంటి ఆపదా సంభవించలేదు' అని తృప్తిపడింది. అయితే, ఆ భావం మరుక్షణంలో మాయమైపోయింది.

భర్త ఎక్కడ ఉన్నాడు ? ఎందుకు ఉద్యోగం రాజీనామాచేశాడు ? కృష్ణవేణి మనసులో క్రీనీడలాగా – ఆ డాన్సుచేసే అమ్మాయి కదలాడు తున్నది. ఈపెళ్ళి ఇష్టంలేకుండా, మెడలువంచి చేశారన్నది పెళ్ళయిన కొత్తలోనే గ్రహించుకుంది కృష్ణవేణి. ఇష్టమో కష్టమో – మూడేళ్ళు కలిసి బ్రతికాము – ఒక పిల్ల కలిగింది – ఫరవాలేదు, అనుకుంటున్న సమయంలో ఈ ఉపద్రవం వచ్చిపడింది.

తను మద్రాసు వెళితే ? .... వెళ్ళి ఏంచేస్తుంది ? .... తండ్రినిగాని, మామగారినిగాని పంపితేనో ? .... వాళ్ళుమటుకు ఏంచేస్తారు ? అతను భార్యనీ, పిల్లనీ వదిలి వెళ్ళిపోదలుచుకున్నపుడు మెడలువంచి ఎవరుమటుకు వెనక్కి తీసుకొస్తారు ?

కృష్ణవేణిరాసిన ఉత్తరం చూసుకుని, ఆమె తండ్రి రాజారావు పరుగెత్తుకొచ్చాడు. ఆయనకి కృష్ణవేణి ఒక్కతే కూతురు. మరి పిల్లలు కలుగలేదు. ఆయన గాంధేయవాది – క్విట్ ఇండియా మువ్‌మెంటులోనూ, అంతకుముందూ జైల్లో వుండివచ్చాడు. చాలా లేటుగా పెళ్ళి చేసుకున్నాడు. మిగతా కాంగ్రెస్‌వాదులలాగా ఆయన పెద్దలుయిచ్చిన ఆస్తిని పాడు చెయ్యనూలేదు, స్వాతంత్ర్యం వచ్చాక పదవులకోసం ఎగబడనూలేదు. చిన్న ఆర్ఫనేజ్ ప్రారంభించి, దాని గ్రాంటులూ, స్వంతభవనం, విరాళాలూ– అంటూ తిరుగుతూవుంటాడు. కృష్ణాజిల్లాలో న్యాయమార్గాన అనాథ శరణాలయం నడుపుతున్నవారిలో రాజారావుగారిని ప్రప్రథములుగా పేర్కొంటారు. సాంఘిక కార్యకర్తల్లో, రాజకీయవాదుల్లో ఆయనకి పేరుంది. అవినీతికి దూరంగావున్న వ్యక్తిగా ప్రతిష్ఠవుంది.

కృష్ణవేణి ఉత్తరం చూసుకుని రాజారావుగారూ, భార్య రుక్మిణమ్మా మరునాటికల్లా ఊడిపడ్డారు. రుక్మిణమ్మ కూతురిని కావిలించుకుని గట్టిగా ఏడ్చింది.

'ఏంజెయ్యమన్నావమ్మా....' అడిగారు రాజారావుగారు, కూతురు పక్కన కూచుని.

కృష్ణవేణి తల్లిదండ్రులని చూడగానే ఏడవలేదు. చాలా నిబ్బరంగా, గంభీరంగావుంది. ఆమె తండ్రిపోలికని పుట్టింది – అన్నీ తండ్రిగుణాలే అంటారు.

'మీరు చెప్పండి' అంది కృష్ణవేణి.

రుక్మిణమ్మగారు మనవరాలిని ఎత్తుకుని ఆడిస్తోంది.

'నేనోసారి అల్లుడిదగ్గిర కెళ్ళిరానా ?'

'వెళ్ళి, ఏమని అడుగుతారు ; నాన్నా? మనం ఆటవికయుగంలో పెరగటంలేము. ఆయనకి ఇష్టంలేనపుడు, మీరంతా మెడలువిరిచి యీపెళ్ళి ఎందుకు చేశారు ?' సూటిగా అడిగింది, కృష్ణవేణి.

'ఇలా జరుగుతుందని అనుకోలేదమ్మా — ఎంతమందో మొగపిల్లలు పెళ్ళిచేసుకోము అని గునుస్తూవుంటారు. చిన్నతనం, యీ ప్రేమలూ అవీ పెళ్ళి అవగానే పోతాయనుకున్నాము.'

'ఆయన, వద్దు కుయ్యో-మొర్రో అంటుంటే యీపెళ్ళి చేశారుట. వాళ్ళ నాన్నగారు కేవలం కట్నంకోసం ఆశపడి చేశారు. ఆతరువాత నేను ఏమవుతానో అని మీ రెవ్వరూ ఆలోచించలేదు.' కళ్ళమ్మట నీళ్ళుతిరిగాయి, కృష్ణవేణికి.

'అతనికంత యిష్టంలేకపోతే — పెళ్ళికి ముందే పారిపోకపోయాడా ? మూడేళ్ళు కాపరంచేసి, ఒక పిల్లని కని.... నేను అసహాయవాదిని — కాని సమయంవస్తే — నాకూ పౌరుషం పట్టుదలా ఉన్నాయి. కోర్టుకెక్కి నీకు జరిగిన అన్యాయానికి....'

'ఏంచేస్తారు ? డైవర్సు యిప్పిస్తారు—మెయింటినెన్సు యిప్పిస్తారు. అందువల్ల నాకు జరిగిన అన్యాయం భర్తీ అవుతుందా?' అడిగింది కృష్ణవేణి.

రాజారావుగారు జవాబు చెప్పలేకపోయాడు — తల వంచుకున్నాడు.

'నాన్నా, ఒకడే కొడుకని — ఇంజనీరు చదువుకున్నాడని మీరు హడావుడిగా, సంబంధం దాటిపోతుందేమోనని పెళ్ళిచేశారు. ఇరపై వేలు వస్తాయని మామగారు బలవంతాన నా మెడలో తాళి కట్టించారు. మీఇద్దరిలో ఎవరన్నా, మాఇద్దరిగురించీ లోతుగా ఆలోచించారా ? మొదట్లో ఎడమొహం పెడమొహంగా ఉన్నా, ఆయనే నాగురించి కాస్తకాకపోతే కాస్తఅయినా, సానుభూతి చూపించి, అర్థంచేసుకునేందుకు ప్రయత్నించారు....'

రాజారావుగారు ప్రశ్నార్థకంగా చూశారు.

'మేమిద్దరం రాజీపడక, ఈ పిల్లకూడా కలగకపోతే ఏం చేసేవారు?' అడిగింది, కృష్ణవేణి.

'కోర్టుకెళ్ళి అంతకంతా కక్కించేవాడిని'

'బాగుంది. అందువల్ల ఎవరికి ప్రయోజనం? మీ డబ్బు మీకు వచ్చేది—అంతేగదా! కాని, మాఇద్దరి సంగతి? రెండు జీవాలు జీవితాంతం కలిసిమెలిసి బతకాలి – వాళ్ళ మనసేమిటి? – అని మీరుగాని, మామగారు గాని ఆలోచించారా?'

'పెళ్ళికి అల్లుడు ఇంత విముఖత కలిగివున్నాడని నాకు తెలియదు.' అన్నాడు రాజారావుగారు యిబ్బందిగా.

'నిజం చెప్పండి. మీరు గాంధేయవాదులు. మీ అల్లుడికి యీపెళ్ళి యిష్టంలేదని మీకు తెలియదా? వాళ్ళు, ఆయన చెడిపోకుండా యీ పెళ్ళి చెయ్యాలని ఆతుర్దాపడుతున్నారని మీకు తెలియదా?'

కూతురు, బోనులో నిలబెట్టినట్లు – ఇలా క్రాస్‌ఎగ్జామిన్ చేస్తుంటే – రాజారావుగార్కి కొంత యిబ్బందిగానే ఉంది.

'ఈ విషయం మీరు అమ్మతోనన్నా చెప్పారా? పెళ్ళిచేసుకోవలసిన నాదగ్గర పూర్తిగా దాచేశారు. కనీసం అమ్మకుకూడా తెలియకుండా దాచి పెట్టారే.... మీకంటే, మా మామగారికంటే మా ఆయన నయంకదా! ఒక్క సారి ఆలోచించి చూడండి.'

రాజారావుగార్కి చిన్నతనంగా ఉంది. ఇరవై రెండేళ్ళ తన కూతురు, తనలోని లోపాల్ని ఎత్తి చూపిస్తున్నది.

'నేను మద్రాసువెళ్ళి అంతు తేల్చుకొస్తాను. మీ మామగార్నికూడా వెంట తీసుకెళ్తాను.'

'వద్దు' అంది కృష్ణవేణి క్లుప్తంగా.

'ఏం – అతను చేసింది న్యాయంగా ఉందా? –పెళ్ళిచేసుకుని, భార్యా బిడ్డనూ వదిలేసి....'

'నాన్నా, న్యాయాన్యాయాలు ప్రశ్నించేహక్కు మీరు మూడేళ్ళ క్రితం – ఆయనకి ఇష్టంలేదని తెలిసీ, మెడలువంచి పెళ్ళిచేశారే – ఆనాడే కోల్పోయారు. ఒకసారి వొదులుకున్న హక్కులు, మరి రావు. నాకూ అభిమానముంది. నాలోనూ చీమూనెత్తురూ ఉంది. మీకు యింకా పిల్లలు ఉంటే – మీతోకూడా వచ్చివుండేదాన్ని కాదు. ఒక్కపిల్లనేకాబట్టి – మీవెంట వచ్చేస్తాను.' అంది కృష్ణవేణి దృఢంగా.

'మీ మామగారితో....?'

'వాళ్ళెవరు? కట్నండబ్బుకోసం ఈ పెళ్ళి చేశారు. వాళ్ళకి అందాల్సింది అందింది. ఇక నాకూ వాళ్ళకీ సంబంధం లేదు. మీ అల్లుడు అంటారా? ఆయనమీద నాకు ప్రేమ లేకపోయినా, సానుభూతి ఉంది; ఈ బంధుత్వంవల్ల నలిగిపోయింది మే మిద్దరం కాబట్టి. నిజానికి నాకంటేకూడా ఆయనే ఎక్కువ బాధపడ్డారు.'

'అదేమిటమ్మా, ఇంతచేసినవాడిమీద నీకు జాలెలా....'

'మీలోకూడా యీ జాలి ఉండిఉంటే, బలవంతపుపెళ్ళి చేసివుండేవారు కాదు. మనసులో ఏ రూపమూ లేనపుడు అది అద్దంలాగా – ఏమనిషి రూపాన్నయినా ప్రతిబింబింపజేస్తుంది. కాని, అప్పటికే ఓ రూపము స్థిరపడివున్నపుడు కొత్త ప్రతిబింబానికి అవకాశం ఉంటుందా?' అడిగింది, కృష్ణవేణి.

'నువ్వు ఏంచెయ్యమంటే అది చేస్తాం. అతనిమీద నీకు సానుభూతి ఉంటే, దాన్ని చెడగొట్టడానికి మేము ఎవ్వరం ప్రయత్నించం. ఆఖరికి మీ మామగార్నికూడా కల్పించుకోనివ్వను.' అన్నాడు రాజారావుగారు.

ఆ మూడోరోజున కృష్ణవేణి, ఇల్లు ఖాళీచేసి, మూటాముల్లె కట్టేసి తండ్రితో బందరు వెళ్ళిపోయింది. ఈ మార్పులన్నీ జరిగిన ఇరవైరోజులకి రాజగోపాల్ తండ్రికి ఈ విషయం తెలిసింది.

ఆయన వెంటనే బందరు పరుగెత్తుకొచ్చారు.

'ఏమిటండీ బావగారూ, ఏంజరిగింది? మావాడికి బుద్ధిలేకపోతే - పెద్దలు మీరు చెప్పవద్దా ? అడిగారు ఆనందరావుగారు, వియ్యంకుడిని తప్పుపడుతూ.

రాజారావుగార్కి వియ్యంకుడితో వాదించే శక్తి లేకపోయింది. కూతురు మాటలు ఆయన్ని కలవరపరుస్తున్నాయి. తాము మెడలువంచి యిద్దరి జీవితాలని నాశనంచేశారు. ఇకముందు తాము కల్పించుకుని వ్యవహారాన్ని యింకా చెడగొట్టడం ఆయనకి ఇష్టంలేదు. ఒక యువకుడు ఒద్దుమొర్రో అంటూంటే - బలవంతాన జీవితభాగస్వామిని కట్టిపెట్టే హక్కు తమకి లేదు. తమకేకాదు, ఎవ్వరికీ లేదు. అటువంటిపని అని తెలిసీ, తామిద్దరూ చేశారు. దాని ఫలితం అందరూ అనుభవిస్తున్నారు.

'ఇందులో నాదేం లేదు. అంతా మీ కోడలి ఇష్టం ; కొడుకు ఇష్టం. వాళ్ళు ఎలా చెపితే అలా చేస్తాను. అంతకుమించి నా ప్రమేయం లేదు.' అన్నారు, రాజారావుగారు.

'ఏం అమ్మా, కృష్ణవేణీ ! నేను పెళ్ళి వాడికి బుద్ధిచెప్పి లాక్కు వస్తాను. శుభ్రమైన ఉద్యోగం, భార్య, పిల్లనూ వొదిలి - వీడి కిదేం బుద్ధని ? ' ఆయన చిందులు వేస్తున్నారు.

కృష్ణవేణి జవాబుచెప్పకుండా - అంతా తాపీగా వింది.

'నీ మెతకవల్లనే వాడు యింత బరితెగించాడు. ఇంత సాధుస్వభావం పనికిరాదమ్మా.'

కృష్ణవేణికి నవ్వొచ్చింది. అందరు ఆడవాళ్ళలాగానే - తను పెళ్ళయిన మరునాడే మొగుడు మాట్లాడలేదని యాగీచేస్తే ఏమయివుండేది ? ఆడదానికి అంత గద్దరితనం పనికిరాదు - సహనంతో దారికి తెచ్చుకోవాలి - అని వీళ్ళంతా నీతులు బోధించేవారు. లేకపోతే - తను పుట్టింటికి జేరుకో వలసివచ్చేది ఆనాడే.

'ఏం చెయ్యమంటారు ?' అడిగింది తమాషాగా.

ఆపిల్ల కంఠంలో ఒక దిలాసా, నిర్లక్ష్యం ధ్వనించాయి ఆయనకి.

'నేను వెళ్ళి చెప్పి తీసుకొస్తాను'

'ఏమని ?' అడిగింది కృష్ణవేణి.

'నువ్విలా చెయ్యటం న్యాయంకాదని'

'అదేప్రశ్న మిమ్మల్ని వేస్తేనో ! ఇష్టంలేనిపెళ్ళి చెయ్యడం న్యాయం కాదని మొత్తుకున్నపుడు ఆయనమాటలు విన్నారా ? మీ ఆడపిల్లలకోసం మీరు ఆనాడు అన్యాయంగా ప్రవర్తించారు—ఈనాడు నాపట్ల ఆయన అన్యాయంగా ప్రవర్తిస్తున్నారు.'

'నా ఆడపిల్లలకోసం అన్యాయంగా ప్రవర్తించానా ?' ఆశ్చర్యంగా ప్రశ్నించారు ఆనందరావు. 'వాడు మాగురించి నీతో యిలా చెప్పాడా ?' ఆయన నోరు కప్పలాగా తెరుచుకుపోయింది.

'మీ అబ్బాయి ఈమాత్రం తీరిగ్గా ఏనాడూ మాట్లాడలేదు. మామధ్య అంత సామరస్యం ఎక్కడ ఏడ్చిందిలెండి. అమమ్మగారే యివన్నీ చెప్పు కొచ్చారు. మీ అబ్బాయి ఇట్లాటివిషయాలు ఎత్తరు. అంతమటుకూ మెచ్చుకోవచ్చు.' అంది కృష్ణవేణి.

ఆనందరావుగారికి తన కోడలికి తన కొడుకుమీద మక్కువో-కోపమో అర్థంకావటంలేదు. ఒక క్షణంలో అతనికి అన్యాయం జరిగిందన్నట్లు జాలిపడుతున్నది - మరో నిముషంలో కసిగా మాట్లాడుతున్నది.

'ఇంతకీ ఏంచెయ్యమన్నావమ్మా ?' అడిగాడు ఆయన.

'మిమ్మల్ని ఏమీ చెయమనటం లేదు. మా నాన్న నన్ను పోషించ గలడు. అందువలన మీకు నేను బరువుకానులెండి.' అంది కృష్ణవేణి తీక్షణంగా.

అంత నిష్ఠూరంగా కోడలు మాట్లాడగలదనీ, ఈ అమ్మాయికి ఇన్ని మాటలు వచ్చుననీ – అనుకోలేకపోయాడు ఆనందరావు.

'వీడు యిటువంటి అప్రతిష్టపని చేస్తాడని అనుకోలేదు. ఇంకా పెళ్ళి కావలసిన చెల్లెళ్ళు, ఈ పసిది – రేపు, తండ్రి ఏడి? – అని అడిగితే....'

'ఉన్నారుగా—మద్రాసులో ఉన్నారని చెబుతాను.' అంది చటుక్కున కృష్ణవేణి.

'అది పెరిగి .... '

'అప్పుడు చూద్దాంలెండి. ఆయన ఆరునెలల్లో వస్తానని రాశారుగా. చూద్దాం....'

'నాకు కసిగా ఉంది. ఆ పిల్లని నాలుగు చివాట్లువేసి....'

'ఏమని వేస్తారు ? ఆ అమ్మాయి రమ్మందా ? ఈయనగదా పెళ్ళిందిః చూడండి ; మనం అడవిమనుషులం కాదు. సభ్యత నెరిగిన మానవులం. ఇంతవరకూ జరిగిన పొరపాట్లు చాలు. వాటిని ఇంకా సాగదియ్యకండి.' అంది కృష్ణవేణి.

'అయితే, ఇప్పుడేంచేస్తావమ్మా .... పోనీ, నాతో రా....'

'నేను రాను.' అంది కృష్ణవేణి ఖచ్చితంగా.

'మాకు మటుకు ఎవరున్నారు ? .... దాన్నీ, పిల్లనీ యిక్కడే ఉండనివ్వండి. ఆ పసిపిల్లముఖం చూసుకుని దుఃఖం మర్చిపోతుంది.' అంది తల్లి రుక్మిణమ్మగారు.

కృష్ణవేణికి తల్లి మాటలు వింటుంటే నవ్వుగాఉంది. ఇప్పుడు కొత్తగా వచ్చిపడిన కష్టమేమీ లేదని వీళ్ళకి చెప్పినా అర్థం అవదు. తనూ, భర్తా యించుమించు మూడేళ్ళు అపరిచితుల్లా ఒక యింట్లో గడిపారు. పిల్లకలిగింది_అది దేహధర్మంకొబట్టి. అతను ఏనాడూ తన హృదయానికి దగ్గరగా రావటానికి ప్రయత్నించలేదు. కొంత సానుభూతితో తనగురించి ఆలోచించాడు అంతే ! అతనిపట్ల కృష్ణవేణికి కోపం రావటంలేదు. జాలి కలుగుతున్నది. అతన్ని బలవంతాన ఈ వివాహబంధంలోకి దించిన మామగారంటే, ఆ చచ్చిపోయిన ముసలావిడ అంటే విపరీతమైన కోపంగా ఉంది.

తొలిరాత్రినుంచీ భర్త ప్రవర్తనలో ఒక నిర్లిప్తత, అయిష్టత ఆమెకి కనిపిస్తూనే వున్నాయి. ఆనాడే తను పుట్టింటికి వెళ్ళిపోయివుంటే, అతను మాట్లాడకుండా వూరుకుని వుండేవాడు. తనవంటిమీద చెయ్యివేసి వుండేవాడుకాదు. తాను ఎందుకు వూరుకుంది ? ఆనాడే ఎందుకు వెళ్ళలేక పోయింది ? కృష్ణవేణి తనని తాను తరచి తరచి ప్రశ్నించుకుంటున్నది. ఆ ప్రశ్నకు సరిఅయిన జవాబు దొరకడంలేదుగాని, భర్తమీద తనకి ఒక రకమైన సానుభూతి, యిష్టంకలిగినాయి ఈ మూడేళ్ళలో. అతను ఏనాడూ తనమీద విసుక్కోలేదు. పల్లెత్తుమాట అనలేదు. ఇంటివిషయాల్లో జోక్యం చేసుకోనూలేదు. అతనికి ఎటువంటి చెడుఅలవాట్లూ కూడాలేవు. ఎంతకీ ఏదో పోగొట్టుకున్నట్లు నిశ్శబ్దంగా కూచుని చూస్తూండేవాడు ఇంట్లో వున్నంతసేపు. అటువంటి సమయాల్లో అతను ఆ డాన్సరు గురించి ఆలోచిస్తున్నాడని వెంటనే తనకి అనిపించేది. మనసు కలుక్కుమనేది. మనిషి ఎదురుగావున్నా, మనసు యిక్కడలేని అటువంటి కాపరంకంటే ఇలా మనిషీ మనసూ రెండూ దూరంగా వుండటమే సుఖంగా వుంది. ఒకరకంగా, పెద్దబరువు దించు కున్నట్లుంది కృష్ణవేణికి.

గంటలు, రోజులు, వారాలు, నెలలు గడుస్తున్నాయి. కృష్ణవేణికి చంటిపిల్ల సీతతో ఆటలుతప్ప – జీవితంలో పెద్దమార్పు వున్నట్లు తోచటం లేదు. ఎందుకంటే పెళ్ళికాకమునుపు తను తిరిగిన పరిసరాలూ, నివసించిన యిల్లు, తల్లిదండ్రులుమధ్య తను వుంటున్నది. ఈ కొద్దికాలంలో తాను ఎక్కడికీ వెళ్ళలేదు. యీ మూడేళ్ళ వైవాహికజీవితం తనకికాదు, మరో స్త్రీకి సంభవించినది అన్నంతగా 'రొటీన్'లో పడిపోయింది. పసిపిల్ల సీత రాకతో అమ్మమ్మా – తాతగార్లకి రోజుకి యిరవైనాలుగుగంటలు చాలటం లేదు. దాని ఆటలు, కబుర్లూ వీటితో నిండిపోతున్నది కాలం.

ఆరునెలలు గడిచాయి. రాజగోపాల్ దగ్గరనుంచి వుత్తరం రాలేదు. అతను యీ ప్రాంతాలకి వచ్చినట్లులేదు. కలకత్తా మెయిలులో అతను కాలుపెట్టలేదు.

'అమ్మా – నువ్వు చదువుకోగూడదా?' అడిగాడు రాజారావుగారు.

'దేనికి? ఉద్యోగం చెయ్యటానికా?' అడిగింది కృష్ణవేణి.

జవాబుకు ఆయన తడుముకోవలసివచ్చింది.

'నాన్నా, మనకి డబ్బు అవసరం వుందా?'

'లేదమ్మా, మేము లేకపోయినా నీకూ, పిల్లకూ చాలు. ఇల్లుంది, పొలం వుంది.'

'మరి వుద్యోగం దేనికి?'

'నీకు కాలక్షేపంగా వుంటుందని. ఎప్పుడూ ఇంట్లో కూచునుంటే మనసుకి విశ్రాంతి వుండదని.'

'అయితే మీ ఆర్ఫనేజ్‌లో పనిచేస్తాను.'

'అక్కడ పనేముంటుంది – గుమాస్తా వున్నాడు. మేట్రన్ వుంది.'

మీ ఆర్ఫనేజ్‌లో పిల్లలు ఏ స్కూళ్ళకి వెళ్తారు? వాళ్ళు బయట కంటూ వెళ్ళక్కర్లేకుండా అక్కడే మనమే చిన్నస్కూలు పెడితే— '

'అది మనం నిర్వహించలేము. గవర్నమెంటు రికగ్నిషన్ – వగైరా చాలా గొడవ లున్నాయి.'

'అదికాదు, నాన్నా. ప్రస్తుతం ముప్పైమంది వున్నారుకదా. మొదట్లో చిన్నపిల్లలకి – నేను అక్షరాలూ అవీ నేర్పుతాను. వాళ్ళు మొదటి తరగతుల్లో నేర్చుకునేవి యిక్కడ నేర్పుతాను. మీకు నచ్చితే – పై ఏడుకి స్కూలు సంగతి ఆలోచిద్దురుగాని. నేను రోజూ వెళ్ళి చూసుకుంటాను కాబట్టి మీరు పై పనులకి, బయటవూళ్ళకి తిరిగినా, అంత యిబ్బంది వుండదు. నాకు ఇప్పుడు కాలేజీకి వెళ్ళి చదవాలని లేదు' అంది కృష్ణవేణి.

రాజారావుగారికి కూతుర్నిచూస్తే ఆశ్చర్యంగా వుంది. ఈ మూడేళ్ళలో కృష్ణవేణి చాలా ఎదిగిపోయింది. దృఢమైన అభిప్రాయాలూ, వాటిని ఆచరణలో పెట్టగలిగిన ఆత్మశక్తీ వచ్చాయి. ఆయనకి కూతురు స్థితికంటే మనవరాలు భవిష్యత్ తలుచుకుంటేనే భయంగా వుంది. రెండు మూడేళ్ళ పిల్లకాబట్టి ప్రస్తుతం దానికి తల్లితప్ప ఎవరూ అక్కర్లేదు. ఆకలీ - ఆటలూతప్ప ప్రపంచం తెలియని ఈ శైశవదశలో ఏమీ ఫరవాలేదుగాని, ఆ పిల్ల ఎదిగి పెద్దదయినపుడు తండ్రి దగ్గరలేని లోపం కనిపించదా ? తండ్రి ఎందుకల్లా చేశాడన్న ఆలోచనలు రావా ? అప్పుడు తామేం చెప్పాలి? నీ తండ్రి డబ్బుకోసం పెళ్ళి చేసుకుని, ఆ తరువాత డాన్సర్‌తో బ్రతుకుతున్నాడని చెప్పాలా ? కాని అతను ఆ డబ్బు అనుభవించలేదు. కుటుంబానికే యిచ్చేశాడు. ఆ తాత మీ తండ్రిని అమ్ముకున్నాడు - యీ తాత కొనుక్కున్నాడని - నీకూ మీ అమ్మకీ అన్యాయం చేశాడని చెప్పాలా ? సీత భవిష్యత్‌ని తల్చుకున్న ప్రతిసారీ రాజారావుగార్కి భయంగా వుండేది.

ఇక్కడ రాజగోపాల్ పూర్తిగా సురేఖదగ్గిర స్థిరపడిపోతాడన్న విషయం - గురువుగార్కి క్రమక్రమంగా అవగతమవుతూ వచ్చింది. ఆయనకి యీ ఏర్పాటు మొదట్లో చాలా కోపం తెప్పించింది. అతని తాలూకు వ్యక్తులొచ్చి అల్లరి చేస్తారేమో - తన నృత్యనికేతనానికి చెడ్డ పేరు వస్తుందేమోననికూడా భయపడ్డారు. గురువుగారి నృత్యనికేతనంలో సంపన్నుల యింటిపిల్లలూ, మర్యాదస్తుల పిల్లలూ విద్యార్థినిలుగా వున్నారు. అప్పుడూ అప్పుడూ సినిమాతారలు నేర్చుకోడానికి వచ్చినా - ఆయన వాళ్ళపట్లకూడా గాలా కఠినంగానూ, క్రమశిక్షణతోనూ వుంటారు. ఈ నృత్యనికేతనంచుట్టూ ఆయన ఒక గౌరవాన్నీ - ప్రతిష్టనీ నిర్మించు

కుంటూ వచ్చారు. అది ఈ సురేఖ గొడవలవల్ల దెబ్బతింటుందేమోనని - ఒక ఆరునెలలపాటు భయపడిపోయారు. కాని ఆయన భయాలు అబద్ధమని తేలాయి. సురేఖ మామూలుగా ప్రదర్శనలు యిస్తోంది - పై పెచ్చు నికేతనంలో క్లాసులుకూడా తీసుకుంటున్నది.

రాజగోపాల్ ఎమ్. ఇ. లో చేరాడు. ఆ రెండేళ్ళూ అతను విద్యార్థిలాగా అతి శ్రద్ధగా చదివి పాసయ్యాక వుద్యోగంలో జేరుతానంటే - సురేఖ వొప్పుకోలేదు.

'గోపీ - నువ్వు యమ్. బి. ఏ. లో చేరు' అంది సురేఖ.

'ఇంతవరకూ నువ్వు ఖర్చు పెట్టింది చాలు. నీ సంపాదనమీద యింకా చదువుకోమన్నావా? వొద్దు, సురేఖా!' అన్నాడు రాజగోపాల్ ఆమె ముంగురులు సవరిస్తూ.

'గోపీ - నువ్వూ నేనూ అని యింకా వేరుగా మాట్లాడుతున్నావా - నేనెవరు? నీకు నేను ఏమవుతాను చెప్పు?' అడిగింది సురేఖ.

అలాంటప్పుడు ఎలా బదులు చెప్పాలో అతనికి తోచదు. 'సురేఖా - నువ్వు నా వూపిరివి. నా దేహంలో ప్రతి రక్తబిందువూ నువ్వే. నా మనసులోని ప్రతి ఆలోచనా నువ్వే' అని చెప్పాలా? చెపితే ఆ మాటలు సినిమా డైలాగ్స్‌లా వుంటాయి. కాని ఈ రెండేళ్ళలో తన మనసు చాలా ప్రశాంతిగా వుంది. దేహమూ, హృదయమూ రెండూ ఒకరకమైనతృప్తితో శాంతిగా వున్నాయి. రాజగోపాల్‌కి అప్పుడప్పుడు కృష్ణవేణి జ్ఞాపకం వచ్చేది. సురేఖతో అతను గడుపుతున్న మధురక్షణాలు, ముఖ్యంగా ఆమెను తాకిన ప్రతిసారీ అతనికి తప్పు చేస్తున్నానన్న భావం కలిగేదికాదు. కృష్ణవేణిని దగ్గరకు తీసుకున్న - ఆ కొద్దిసార్లూ ప్రతిసారీ - తానేదో కానిపని చేస్తున్నట్టు బాధపడేవాడు. అటువంటి భావం తనకిప్పుడు ఎందుకు కలగడం లేదు? పెళ్ళి. పెళ్ళిలో చదివే వైదికమంత్రాలు ఇవి వివాహానికి పవిత్రతనీ,

సాంఘికమైన అనుమతినీ యిస్తాయంటారే! ఈ రెంటినీ పొంది పెద్దల సమక్షంలో వివాహమాడిన, కృష్ణవేణిపట్ల తనకి, తనమనిషి అన్న భావం ఎందుకు కలగలేదు? అందరూ అనేటువంటి ఈ వివాహక్రతువులో నమ్మకం తన కెందుకు కలుగలేదు?

పెండ్లి అయాక హైద్రాబాద్‌లో గడిపిన ఆ మూడేళ్ళకాలంలో అతను యిదేదో తాత్కాలికమైన ఏర్పాటు అన్నట్లూ, రెండు ప్రవాహాల మధ్యనున్న మట్టిదిబ్బమీద నుల్చున్నట్లు ఫీలయ్యేవాడు. ముందేమిటి అన్న ఆలోచనలు వచ్చేవికావు. కృష్ణవేణికి యివి కొనివ్వాలి - లేక తామిద్దరి కలయికవల్ల కలిగిన ఆ పిల్లకి యివి చెయ్యాలి. ఆ పసిపిల్ల భవిష్యత్ గురించిగాని ఆలోచనలు వచ్చేవికావు. ఏరోజు కారోజు వర్తమానంలో - 'ఈరోజు నడిచింది, హమ్మయ్యా' అనుకున్నట్లు ఆ మూడేళ్ళూ గడిపాడు.

కాని మద్రాసు వచ్చాక రాజగోపాల్‌కి జీవితంపట్ల అనురక్తి, సురేఖకి తానేదో చెయ్యాలన్న తాపత్రయం ఎక్కువయిపోయింది. ఆమె తనకి పునరుజ్జీవనం ప్రసాదించింది. ఎటువంటి సంకోచమూ లేకుండా తనని తాను అర్పించుకుంది. పెళ్ళికాకపోయినా తాము భార్యాభర్తల్లా ఒకరి కొకరు తోడునీడలు. అందుకని అతనికి ఎంత త్వరగా వుద్యోగం సంపాయించి, అంతకంటే త్వరగా సురేఖని సుఖపెట్టాలి అని వుండేది.

'సురేఖా, నేను జాబ్‌లో చేర్తాను' అన్నాడు యమ్. ఇ. క్లాస్‌లో పాసయిన రాజగోపాల్.

'వొద్దు. నువ్వు ఎమ్. బి. ఎ. కూడా చదువు - మనకొచ్చేది చాలు.'

'నువ్వు ఎమ్. బి. ఎ. అని ఎందుకింత పట్టుదలగా వున్నావు?' అడిగాడు రాజగోపాల్.

డాన్సు ప్రదర్శన యిచ్చిన మరునాడు సురేఖ - వొళ్ళంతా తైలంతో మర్దన చేయించుకుంటున్నది. డాన్సరు శరీరంలోని ప్రతి జాయింటూ, సుద్దలాగా ఎటుపడితే అటు వొంగాలని, శరీరంలో బొమికలు

వుండకూడదని అంటారు గురువుగారు. ఉత్తరోజున కొబ్బరినూనెతో వొళ్ళంతా మర్దన చేయించుకుని – వేడినీళ్ళ స్నానం చేస్తుంది. ప్రదర్శన ముందురోజూ, మరునాడూ తైలంతో – కీలు కీలూ వంచి మరీ మర్దన చేస్తుంది పనిమనిషి. ఆరోజు పనిమనిషి రాలేదు. ఆ డ్యూటీ రాజగోపాల్ మీద పడింది. అతను చాలాసార్లు సురేఖ దేహాన్ని – తైలంతో రాచాడు. ఆపని చెయ్యటంలో యిద్దరికీ న్యూనత అనిపించలేదు. అది సర్వసహజమైన విషయంగా పరిగణిస్తా డతను.

'మా నృత్యనికేతనంలో ఒక సీనియర్ పర్చేజ్ ఆఫీసరుగా రమ్మాయి డాన్సు నేర్చుకుంటున్నది.'

'ఊ' అన్నా డతను, పచ్చని ఆమె భుజాలకి తైలం పట్టించి మర్దనచేస్తూ ! సురేఖ పొడవాటి బల్లమీద బోర్లపడుకుని వుంది. ఇంచు మించు వడ్డి మంగలాడి పోజులో నిక్కర్ వేసుకుని, ఆమె బుజాల్ని రెండుచేతుల్తో 'మాసాజ్' చేస్తూ – 'ఊ' అన్నాడు చెప్పమన్నట్లు.

'ఆ అమ్మాయి పెద్ద కారుమీద వస్తుంది. అది కంపెనీ కారుట' ఆగింది సురేఖ.

'ఊ' అన్నాడతను చేతిలో మరి కొంచెం తైలం పోసుకుంటూ.

'యూనిఫారమ్ డ్రయివర్, కారు దిగి, తలుపు తీస్తాడు. వాళ్ళింటికి రమ్మని చాలాసార్లు చెప్పింది. వాళ్ళ నాన్న విజిటింగ్‌కార్డు యిచ్చింది.

'అయితే ?'

'అందులో – ఎమ్. యి. యమ్. బి. ఎ. అని వుంది. అప్పు డనుకున్నాను – నువ్వూ అంత చదవాలి. అంత పెద్దవుద్యోగం చెయ్యాలి. నేను అలాంటి కారులోంచి దిగాలని....' అంది సురేఖ.

రాజగోపాల్‌కి నవ్వొచ్చింది. సురేఖ నాలుగేళ్ళనుంచీ – బయట దేశాలలోకూడా ప్రదర్శనలు యిస్తోంది. తను తొలిసారి చూసినప్పుడు, ఇంకా చిన్నపిల్ల, అమాయకురాలు. అప్పటికి చాలా ప్రదర్శనలు యిచ్చివున్నా –

దక్షిణాదినిమటుకే తిరిగింది. అటు తరువాత ఢిల్లీ, బొంబాయి, కలకత్తా వంటి నగరాల్లోనే గాక పలుమార్లు విదేశాలకి వెళ్ళింది. ఆమె అన్నిదేశాలు చూసింది. అంతమంది మన్ననలు పొందింది. అయినాకూడా యీ కారూ యీ దర్జాలపైన మోజుపోలేదు.

'నీకోసం కారు పంపేవారూ, కారు తలుపు తీసి పట్టుకునేవారూ లేరా? అటువంటి మర్యాద – ఎన్నడూ ఎరగనట్లు ఆలోచిస్తున్నావేమిటి?' అడిగాడు రాజగోపాల్.

'అది కేవలం నన్ను డాన్సరుగా చూసి చేసే మర్యాద. ప్రదర్శన మూడుగంటలసేపే – ఆ ఘనత! ఆపైన నేను అనేకసార్లు రోడ్డుమీద నడిచి వెళ్ళాను. మనిద్దరం కలిసివెళ్తుంటే, నేను సురేఖనని ఎవరన్నా గుర్తించారా? చెప్పు?'

'అటువంటి గుర్తింపు ఒక్క సినిమావారికితప్ప యింక ఎవ్వరికీ లభించదు. గొప్పరచయిత, గొప్ప సంగీతవిద్వాంసుడు, ఆఖరికి రాజకీయ నాయకుడుకూడా రోడ్డుమీద వెళుతుంటే ఎవరూ గుర్తించరు. నీకు అటువంటి గ్లామరు కావాలంటే – సినిమాల్లో చేరాలి.'

'నాకు అటువంటి గ్లామరు వద్దు. ఇంకో అయిదారేళ్ళు యిలా ప్రదర్శన లివ్వగలిగితే చాలు.'

'ఆపైన?'

'పక్కా గృహిణి నయిపోతాను. నువ్వు సంపాయిస్తావు – హాయిగా యింట్లో వుంటాను.'

'ఇప్పుడుమటుకు గృహిణివి కావా?'

'ఇదివేరు – అప్పుడు మనకి డబ్బు అవసరం వుండదు. నువ్వు ఏ కంపెనీలోనో పెద్దఆఫీసరు అయిపోతావు. నేను పెద్దకార్లో తిరిగేస్తాను. అప్పుడు....యిల్లు పిల్లలు....' ఆగిపోయింది సురేఖ.

రాజగోపాల్ వులిక్కిపడ్డాడు. సురేఖకి పిల్లలమీద ఆశ వుందా? తామిద్దరికీ పిల్లలు గలిగితే వాళ్ళు ఏమవుతారు? పెళ్ళికాకుండా పిల్లలు కలిగితే ఇక లీగల్ చిల్డ్రిన్ కారా ? 'బాస్టర్డ్స్' అనరా ?

సులేఖ యివ్వేమీ ఆలోచించడలేదు. ఆమె మనసులో రాజగోపాల్ భవిష్యత్తు దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉంది. అందులో తమ యిల్లు - తామిద్దరి అన్యోన్య దాంపత్యం, పిల్లలూ - యివే కనబడుతున్నాయి. తాము పెళ్ళిచేసుకోలేదు. సంఘం తమ యీ అనుబంధాన్ని ఆమోదిస్తుందా?—అన్న సంశయం ఆమెకి రావడంలేదు. అటువంటి అనుమానాలు ఎందుకనో సురేఖకి వచ్చేవికావు.

రాజగోపాల్ జీవితం సురేఖచుట్టూ లతలా అల్లుకుపోయింది. ఆమె ప్రదర్శనలనిబట్టి అతని దైనంది జీవితం నిర్ణయించుకునేవాడు. ఉదయం పూట ఎనిమిదిన్నరకల్లా సురేఖ - నృత్యనికేతనంకి పెళ్ళి, అక్కడ చిన్న పిల్లలకి డాన్సు పాఠాలు చెప్పేది. ఒక రెండుగంటలు ప్రాక్టీసుచేసి మధ్యాహ్నం ఒంటిగంటన్నరకి ఇంటికి వచ్చేది. ఆ తరువాత ప్రోగ్రామ్‌లేని రోజునైతే, సాయంత్రం రాజగోపాల్ కాలేజీనుంచి వచ్చాక - ఇద్దరూ బీచికో, సినిమాకో వెళ్ళేవారు. ఆమెకి ప్రదర్శనవున్నరోజునా, అతనికి పరీక్షలయినపుడూ చాలా నియమబద్ధమైన జీవితం గడిపేవారు.

ముఖ్యంగా సురేఖ ప్రదర్శనవున్న ముందురోజునా, ఆతరువాత రోజునా ఆమెని పసిపిల్లలాగా చూసేవాడు. మానసికంగా ఆమెకు ఎటువంటి అలజడి లేకుండా, కోపం రాకుండా నవ్విస్తూ ఉల్లాసంగా ఉంచేవాడు. సురేఖ, మిగతావిషయాల్లో ఎంత సహృదయంతో వుండేదో, తన డాన్సు గురించి ఎవరేనా విమర్శించినా, బాగాలేదని హేళనచేసినా అంత 'డిస్టర్బ్' అయేది. చాలా ఉద్రేకపడిపోయేది. కోపం తెచ్చుకుని ఏడ్చేసేది. ఒకటి రెండుసార్లు యిటువంటివి అనుభవమయ్యాక, రాజగోపాల్ సురేఖని 'హ్యూమర్' చెయ్యడం, లాలించడం నేర్చుకున్నాడు.

శారీరకంగాకూడా అతను సురేఖపట్ల ప్రత్యేకమైన నిగ్రహం చూపాల్సివచ్చేది. కృష్ణవేణి విషయంలో నిర్లిప్తతగావున్న రాజగోపాల్ దేహం – సురేఖ విషయంలో తీరని కోర్కెతో ఆరాటపడేది. ఆమెని మాటిమాటికి తాకాలని అనిపించేది. తాకిన వెంటనే అతని దేహం వశం తప్పేది. ఒకసారి, ప్రదర్శన మరునాడుఅనగా, రాజగోపాల్ సురేఖతో చాలాపొద్దుపోయేదాకా కబుర్లు చెప్పాడు. ఆ రాత్రి వారిద్దరూ తీవ్రమైన కాంక్షతో – సన్నిహితులయ్యారు. అది దేహాలకలయిక అనిపించలేదు. రెండుఆత్మల సంయోగం అనుకున్నారు. ఇద్దరూ చాలా సంతోషంగా వున్నారు. చాలా అందంగా సూర్యోదయమయింది వారిద్దరికీ ! అయితే ఆ సాయంత్రం ప్రదర్శనలో గురువుగారికి చాలా లోపాలు కనిపించినాయి. ఇది ఆయన అంతరాంతరాల్లో నిగూఢమైన అసూయో, లేక నృత్యంలో వుండాల్సినంతటి 'ఎమోషనల్ హైట్సు' రాలేదో – రాజగోపాల్‌కి తెలియదు. ఎందుకంటే అతను సురేఖ ప్రదర్శనలకి వెళ్ళటంలేదు. అతను ప్రేక్షకులలో వుండటం – గురువుగారికి యిష్టంలేదు. ఆ రాత్రి – డాన్సుప్రోగ్రాము అయిపోయాక, గురువుగారు సురేఖని చాలా చివాట్లు వేశారు.

'వాళ్ళ దగ్గరపెట్టుకుని వుండమని నీకు ఎన్నిసార్లు చెప్పాను ? నువ్వు ఆడదానివికదా ! అంత బరితెగించావా ? ' అరుస్తున్నారు గురువుగారు.

సురేఖ – భూమి బద్దలయిపోవాలనీ, అందులో తాను మాయమై పోవాలని కోరుకుంది. తమ మధురమైన అనుభవాన్ని – యీయన యింత బట్టబయలుగా యీగిచేస్తున్నారే !

'నీకు జ్ఞానమైనా వుండాలి – లేక – పెద్దలమీద గౌరవమేనా వుండాలి. ఈ రెండూ లేనివాళ్ళు ఎందుకూ కాకుండాపోతారు.'

సురేఖ మాట్లాడలేదు.

'మీరంతా మురుగుకాలువలో బతకండి. జంతువుల్లా ప్రవర్తించండి. అది మీ మీ కర్మ. డాన్సుకొచ్చేటప్పుడుమటుకు, కొంత నిష్ఠా – నియమం వంటివి వుండాలి. అదికూడా పాటించలేని – నీలాంటి మహాతల్లులు ప్రేక్షకుల ప్రాణాలు తీసి, నాలాంటివాళ్ళపేరు చెడగొడతారు'

'.... .... .... .... .... '

'నువ్వు మర్యాదగా, నియమంగా బ్రతకలేకపోతే – అతన్తో చెప్పేస్తాను. పెట్టా బేడా సర్దుకుని వెళ్ళిపొమ్మంటాను.' ఆయన కరకర మన్న కంఠంతో అరుస్తున్నారు.

'మీరెవరు – ఆయన్ని వెళ్ళిపొమ్మని చెప్పటానికి ? అంతగా అయితే యీ డాన్సే మానేస్తాను. అంతేగాని ఆయన్ను వొదులుకోను' – అన్న మాటలు సురేఖ నాలిక చివరిదాకా వచ్చాయి - కాని పెదిమలు దాటలేదు. ఈ నృత్యప్రదర్శనలు, అందువల్ల రాబడి తనకి చాలా అవసరం. రాజగోపాల్ చదువుఅయిపోయేదాకా – తాను పళ్ళబిగబట్టి - గురువుగారి తిట్లు భరించాలి. ఆయన పెట్టేటువంటి ఆంక్షలు పాటించాలి. అటు తరువాత- ఈ మాదిరి పరిస్థితి రాకుండా సురేఖ జాగ్రత్తపడింది. అసలు రాజగోపాల్ కూడా అతి నిగ్రహంతో ప్రవర్తించేవాడు.

సురేఖ బయటదేశాలకి వెళ్ళినపుడు మూడువారాలు, రెండేసినెలలు అతను వంటరిగా వుండిపోవాల్సివచ్చేది. నెలకి నాలుగైదు తడవలు సురేఖ, మూడేసి నాలుగేసిరోజులు టూర్స్‌లో వుండేది. ప్రతిసారీ ఇంటికి అమితోత్సాహంతో తిరిగివచ్చేది. రాజగోపాల్‌కూడా ఆమె ఎప్పుడు వస్తుంది, ఏ రైలుకి వస్తుంది, అని తృష్ణతో ఎదురు చూస్తూండేవాడు. ఈ చిన్న చిన్న ఎడబాటులు వారిద్దరిలోని ప్రేమనీ, కాంక్షనీ ద్విగుణీకృతం చేసేవి. ప్రతిసారీ టూర్‌నుంచి వచ్చేప్పుడు – సురేఖ రాజగోపాల్‌కోసం –

ఏదో ఒక చిన్న కానుక తెచ్చేది. ఆ టూర్‌లో ఆమె మనసంతా అతనిపైననే లగ్నమయిందని - యీ బహూమతులు నిశ్శబ్దంగా ప్రేమ వూసులు చెప్పేవి.

రాజగోపాల్‌కి జీవితం తృప్తిగా, పరిపూర్ణంగావున్నా మధ్య మధ్య అవమానకరమైన పరిస్థితులు ఎదుర్కోవలసి వచ్చేది. సురేఖదగ్గర కొచ్చాక, అతను దేనికీ తడుముకోవలసివచ్చేదికాదు. సురేఖ ఎప్పుడూ యింట్లో డబ్బు వుంచుతూండేది. సంపాదన ఆమెదయినా, దేనికి ఖర్చు చెయ్యాలి - ఎంత ఖర్చు చెయ్యాలి అన్నది, అతనే నిర్ణయించేవాడు. ఈ ఇంట్లో అతనిదే పైచెయ్యి. తనకంటే చదువుకున్నవాడు, తెలివైనవాడు అని సురేఖ అతని ఆధిక్యతని ఏనాడో అంగీకరించింది. కాని ఎవరైనా అతిధులు - ముఖ్యంగా గురువుగారితోపాటు ప్రోగ్రామ్స్ ఫిక్స్ చేసుకునేందుకు వచ్చిన పార్టీలముందు రాజగోపాల్ పరిస్థితి తమాషాగా వుండేది.

సాధారణంగా యిటువంటివారిని తీసుకువస్తున్నానని గురువుగారు ముందే ఫోన్ చేసేవారు. ఈమధ్యనే ఆయన సురేఖపేరున ఫోన్ తెప్పించి పెట్టారు. ఒక్కోసారి ఫోన్ చెయ్యకుండా వచ్చినపుడు ముందుగదిలో రాజగోపాల్ వుండేవాడు. అతను కూచున్నతీరు - చదువుకుంటున్నవిధమూ చూస్తే - యీతను అతిధికాదు, ఇంట్లోవ్యక్తి అని అవతలవారికి అర్థం అయేది. అయితే ఈ సురేఖ మిస్ అనీ, ఆమెకి పెళ్ళికాలేదని వినటంచేత, 'ఎవరు ఈతను? యీమెకి ఏమవుతాడు?' - అన్నట్లు చూసేవారు. ఎవరూ నోరుతెరిచి అడిగేవారుకాదుకాని - వారి కళ్ళలో ప్రశ్నలూ, వూహలూ కదలాడుతుండేవి.

సురేఖ ప్రదర్శనను ఏర్పాటు చేయించిన పెళ్ళిపెద్దలూ, సాంస్కృతిక కార్యకర్తలు - మద్రాసు వస్తే ఆ పరిచయంచేత యీమె యింటికి వస్తూవుండేవారు. అట్లాంటివారిని రావద్దు అని చెపితే బావుండదు.

ఆ వచ్చినవాళ్ళు ఈ సురేఖ అందగత్తె, పెళ్ళికానిది, అందులోనూ వేదిక నెక్కి ప్రదర్శనలు యిస్తుంది - అన్న విషయం మర్చిపోయేవారుకాదు. ఒంటరిగా ఒక యువతి, ఒక్క పనిమనిమనిషితోపాటే వుంది అంటే, ఇటువంటి అమూల్యమైన అవకాశం వదులుకోగూడదు - అన్నట్లుండేవి వారి మాటలు.

ఇలా చెప్పాచెయ్యకుండా అతిథులు వచ్చినపుడు సురేఖ వెంటనే గురువుగారికి ఫోన్ చేసేది. ఆయన యింట్లో లేకపోతే అక్కడవున్న నికేతనంలోని స్టూడెంట్సో, పనివారో, ఎవరో ఒకరు వచ్చేవారు. లోపల గదిలో రాజగోపాల్ వున్నా నికేతనంనుంచి ఎవరినో ఒకర్ని పిలిపించుకునేది సురేఖ - ఇదికూడా గురువుగారి ఏర్పాట్లలో ఒకటి.

అయితే ఆ సాయంత్రం గురువుగారు వూళ్ళోలేరు. పైగా ఆదివారం. అనకాపల్లినుంచి వచ్చిన అతిథి బుట్టనిండా మామిడిపళ్ళు పట్టుకొచ్చాడు. మనిషి మధ్యవయస్కుడు. బాగావున్నవాడు. వాళ్ళ చెల్లెలి పెళ్ళి - సురేఖ డాన్సు పెట్టించాడు. ఆమె నృత్యాన్ని మెచ్చుకుని ఎనిమిదివందలు ఖరీదుచేసే పట్టుచీరె కానుకగా యిచ్చాడు ప్రత్యేకం. అటువంటి మనిషి యింటికి వచ్చినపుడు అంతదూరంనుంచి పళ్ళబుట్ట తీసుకొచ్చినపుడు - కనీసమర్యాద చెయ్యటం తన విధి అనుకుంది సురేఖ. పనిమనిషి బజ్జీలు చేసింది. వేడి వేడి బజ్జీలు తిని, కాఫీ తాగి ఆ అతిథి కదలలేదు. సాయంత్రం - మునిమాపులోనికి, చీకటిలోకి జారిపోయింది. ఏడయింది - ఎనిమిది అయింది. అతిథి కదలడు. అతను సురేఖ నృత్యాన్ని గురించి, ఆమె అభినయాన్నిగూర్చి పొగిడేస్తున్నాడు. రంభవంటున్నాడు - ఊర్వశి వంటున్నాడు. ఈ పొగడ్తలంతా ముందుగదిలోవున్న సురేఖ - చెవులతో వింటున్నది. ఆ వ్యక్తిని కళ్ళతో చూస్తున్నది. లోపలవున్న రాజగోపాల్‌కి యీ పొగడ్తల విందు కంటకంగా వుంది. ఈ మనిషి ఎంతసేపు వుంటాడు? ఈరాత్రి వెళ్ళడా? ఈతన్ని ఎలా వదిలించుకోవాలి? ఆ

మనిషి వచ్చేప్పటికి రాజగోపాల్ లోపలగదిలో వున్నాడు. బయటకి రాలేదు. సాధారణంగా సురేఖకోసం వచ్చేవారికి అతను కనబడడు.

'మీతో కొన్నివిషయాలు చెప్పుకోవాలని వచ్చాను' అన్నాడు అతను. అల్లిబిల్లిగా పరుగెడుతున్న సంభాషణని ఒకదరికి తీసుకొద్దామన్నట్లు ! అతనిపేరు సర్వేశ్వర్రావు.

'మా గురువుగారికి చెప్పండి. ఆయనే నాకు తల్లీతండ్రీ – సర్వస్వం ఆయనే.'

'మీ డాన్సు విషయంకాదు. ఇది మీ జీవితానికి సంబంధించిన విషయం.'

సురేఖ మాట్లాడలేదు. తలవంచుకుని చేతిగోళ్ళవంక చూస్తున్నది. మౌనం అర్ధాంగీకారంగా, అలా తలవంచుకు కూచోడం స్నిగ్ధత్వానికి చిహ్నంగా తలిచి సర్వేశ్వరరావు - తా నొక రాజకుమారుడనన్న విశ్వాసంతో సంభాషణ ప్రారంభించాడు.

'మేము జమిందార్లం. మా నాన్నకి ఒక్కడే కొడుకుని–' అన్నాడు సర్వేశ్వరరావు.

'ఒక్క కొడుకునవటంచేత – నేను పడ్డపాట్లు ఎవరికి చెప్పుకోను? మెడలువంచి – నన్నీగదిలో దాక్కునే స్థితికి తీసుకొచ్చాయని యీ సర్వేశ్వర్రావుకి నా గోడు చెప్పుకోనా ?' అనుకున్నాడు రాజగోపాల్ – పుస్తకం మూసి ఇంకా ఏం చెప్పబోతాడోనన్న కుతూహలంచేత !

'పెళ్ళయిన నాలుగేళ్ళకే నా భార్య పోయింది. అది వుండీ నేను సుఖపడింది లేదనుకోండి–' ఆగాడు సర్వేశ్వరరావు.

ఈ సురేఖ నొసట అంతా రెండోపెళ్ళివాళ్ళే రాసిపెట్టారుకాబోలు. మొదటిపెళ్ళిలో మొగవాళ్ళు సుఖపడరా? రాజగోపాల్‌కి ఆలోచన లొస్తున్నాయి.

'నాకు లలితకళలంటే చాలా యిష్టం. చిన్నప్పుడు నాటకాలు వేస్తూండేవాడిని. ట్రూప్‌వెంట పోతూవుండేవాడిని - మానాన్న నా ఇష్టానికి వ్యతిరేకం చెప్పరు.'

'ఇప్పుడు డాన్సుమీద యిష్టం పెంచుకుంటాడు కాబోలు. ఒక విషయంలో నాకంటే అదృష్టవంతుడు. తండ్రి మాటని యితను వినటం లేదు. ఇతని యిష్టప్రకారం తండ్రి నడుస్తాడుట. ఇదీ బాగానేవుంది'— అనుకున్నాడు రాజగోపాల్.

'మీకు – మీకు' తడుముకుంటున్నాడు సర్వేశ్వర్రావు.

సురేఖవైపునుంచి ఎటువంటి మాటా రావటంలేదు.

'పెళ్ళి చేసుకున్నందువల్ల – మీ నాట్యానికి అడ్డుతగులుతుంది అనుకోకండి. అందుకు ఎటువంటి యిబ్బందీ వుండదు. నేనేకాదు మావాళ్ళు ఎవరూ....' ఆగాడు.

ఆ మానవుడు యింతసేపటికి అసలు విషయం బయటపెట్టాడు. సురేఖ ఏం చెబుతుందో, యీ పరిస్థితినుంచి ఎలా తప్పించుకుంటుందో వినాలని కుతూహలంగా వుంది రాజగోపాల్‌కి. సర్వేశ్వర్రావు – సురేఖ పక్కన చతికిలబడి ప్రేమ వొలకబోస్తాడా? అప్పుడు తనేం జెయ్యాలి? విలన్‌లాగా ముందుగదిలోకి అడుగుపెట్టాలా? వెనకవైపునించి వీధివైపుకి వెళ్ళి అప్పుడే వస్తున్నట్లు ముందుగదిలోకి వెళితే? అప్పుడు సురేఖ తనని ఏమని పరిచయం చేస్తుంది? రాత్రి ఎనిమిదిన్నరవేళ వస్తున్న యీ స్నేహితుడిని చూసి, ఆ సర్వేశ్వర్రావు ఏమనుకుంటాడు? సురేఖ తేలిగ్గా లభ్యం అవుతుంది – పెళ్ళికూడా అక్కరలేదనుకుంటాడా ? రాజగోపాల్‌కి ఒకవైపు నవ్వూ, మరోవైపు కోపమూ వస్తున్నది. ఇంతలోనే సురేఖ కంఠం.

ఆమె కంఠం దృఢంగానూ, శాంతంగానూ, కాస్త బిగ్గరగాకూడా వుంది. 'నా విషయంలో మీరు పొరబడ్డారు. చాలామందికి నా అసలు

పరిస్థితి తెలియదు. అంచేత నాకు పెళ్ళి కాలేదనుకుంటారు' రాజగోపాల్ వూపిరి బిగబట్టుకుని వింటున్నాడు.

'నాకు చిన్నపుడే మా మామతో పెళ్ళయింది. మావాళ్ళు చాలా పూర్వకాలంవాళ్ళు. ఎనిమిదేళ్ళు రాకుండా పెళ్ళిచేశారు.'

ఆ సర్వేశ్వర్రావు ముఖం ఎలా వుందో చూడాలని వుంది - రాజగోపాల్‌కి. 'పెళ్ళయిన ఏడాదికే మా మామయ్య కోపంవచ్చి పారిపోయాడు. మిలటరీలో జేరాడనీ, ఏదో ఆశ్రమంలో వున్నాడనీ....'

'ఎప్పుడో జరిగిన పెళ్ళికి మీరు ప్రాధాన్యం యివ్వకూడదు' సర్వేశ్వర్రావు కంఠం.

'కాని మా అమ్మగారు చేతిలో చెయ్యి వేయించుకున్నారండి - మా మామ తిరిగి వచ్చేదాకా నే నెవరినీ పెళ్ళిచేసుకోనని' - డెత్‌బెడ్‌మీద మా అమ్మకు మాటిచ్చాను. తమ్ముడికోసం కలవరించి, కలవరించి మా అమ్మ ప్రాణాలు విడిచింది' సురేఖ కంఠం విచారంగా వుంది. నర్తకికదూ- కన్నీళ్ళుకూడా తళతళమని వుంటాయి ఆ 'ట్యూబ్‌లైట్' కాంతిలో - అనుకున్నాడు రాజగోపాల్.

సర్వేశ్వర్రావు మరోపావుగంట కూచుని బహుశా హతాశుడై వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాక బయటకొచ్చిన రాజగోపాల్, పొట్ట చేతబుచ్చుకు, పకపకా నవ్వాడు. నవ్వి నవ్వి కడుపునొప్పికూడా వచ్చిందతనికి.

కాని సురేఖ అతనితోపాటు కలిసి నవ్వలేకపోయింది. 'గోపీ, నువ్వు వెనకగదిలో వుండటంచేత అంత ధైర్యంగా కధ అల్లి చెప్పాను. లేకపోతే ఏమైపోదును? ఇంకా ఎన్నాళ్ళు మనకీ చాటుమాటు బతుకు - నువ్వు చెప్పు?' అడిగింది. దానికి బదులు చెప్పలేకపోయాడు రాజగోపాల్.

# 5

మరో ఏడాదికి చదువు పూర్తిఅవుతుంది. రాజగోపాల్ యమ్. బి. ఎ. కూడా అయిపోతాడు – అని పళ్ళుబిగపట్టుకుని నాట్యప్రదర్శనలకి వెళ్ళివస్తోంది.. అతను మద్రాసు వచ్చేసి నాలుగేళ్ళు అవుతోంది. ఈ మధ్యకాలంలో అతని తండ్రివైపునుంచిగాని, భార్యవైపునుంచిగాని వుత్తరాలు లేవు. ఎవరూ యిటువైపులకి తొంగిచూడలేదు. గురువుగారూ, నృత్యనికేతనంతో పరిచయం వున్నవారూ, అక్కడి స్టూడెంట్సూ రాజగోపాల్‌ని సురేఖ మనిషిగా 'యాక్సెప్ట్' చేశారు. వాళ్ళిద్దరి గురించి – రహస్యంగా మాట్లాడుకునే స్టేజికూడా దాటిపోయారు – అతను తమలో ఒకడన్న స్థితికి వచ్చారు.

నృత్యనికేతనం తప్పించి సురేఖకి సోషల్‌లైఫ్ వుండేదికాదు. ఆమె ఎవరిళ్ళకూ వెళ్ళేదికాదు. ముఖ్యంగా మామూలు కుటుంబాలతో స్నేహం వుండేదికాదు. ఎంతకీ ఆమెని ఒక నృత్యకారిణిగా – పరిచయం చేసుకుని గౌరవించేవారుతప్ప – ఇళ్ళకి పిలిచేవారుకాదు. ఒక్కోసారి సురేఖకి కష్టంగా వుండేది. తననీ, రాజగోపాల్‌ని కలిపి ఎవరూ ఎందుకు పిలవరు అని కచ్చగా వుండేది. అయితే తన యింటికి వచ్చినవాళ్ళని – రాజగోపాల్‌ని పరిచయం చేయటంలేదు. ఎవరొచ్చినా అతను వెనక గదిలో బెడ్‌రూమ్‌లో వుండిపోతాడన్నది ఆమెకి జ్ఞాపకం వచ్చేదికాదు. 'తను ధైర్యంగా ఈతను నామనిషి – అని ఎందుకు పరిచయం చేయలేక పోతున్నది? అవతలవాళ్ళు చులకనగా చూస్తారని భయమా? లేక, నర్తకిగా తన గ్లామర్ తగ్గిపోతుందన్న సంశయమా? గురువుగారికి కోపం వస్తుందన్న భీతా?' – ఇవేమి సురేఖ విశదంగా ఆలోచించలేకుండా వుంది.

ఒకోసారి విపరీతమైన వుద్రేకం తెచ్చుకు పెద్దగా ఏడుస్తూండేది - చుట్టూవాళ్ళు తామిద్దరిపట్లా కఠినంగా వున్నారన్నట్లు.

'ఇతరులు ఎలావుంటే మనకేం? నీకూ నాకూ యిష్టమైనపుడు....' వాదించేవాడు రాజగోపాల్.

'అదికాదు గోపీ, ఆ శ్యామల - దానికి పేరుకి మొగుడంటూ వున్నాడు. పెద్ద పెద్ద మంగళసూత్రాలు వేసుకు తిరుగుతుంది. బియ్యపు కొట్టు చెట్టియారు దాన్ని, మొగుణ్ణి పోషిస్తున్నాడని అందరికీ తెలుసు. ఇద్దరు పిల్లల తల్లి - స్టేజీమీదకెక్కి తైతక్కలాడుతూ - పెధవ పతివ్రత కబుర్లు చెపులోంది' కసిగా వుంది సురేఖ కంఠం.

రాజగోపాల్ సన్నగా నవ్వుతున్నాడు.

'ఎందుకు నవ్వుతున్నావు ? ఆడదానిపై పుడితేతప్ప, నీకు నా బాధ తెలీదు.'

'ఏమిటి నీబాధ - కాస్త తెలుగులో చెప్పు?' అడిగాడు అల్లరిగా.

'మొన్న సువర్ణగౌరీవ్రతంట చేసుకుంది. ముత్తయిదువులనిమటుకే పిలుస్తారుట ఆ వ్రతానికి ; అందరినీ పిల్చి - నన్నుమటుకు వొదిలేసింది' సురేఖ కంఠంలో వుడుకుమోత్తనం.

రాజగోపాల్ మాట్లాడలేదు. ఈ విషయంలో ఎవరి అభిప్రాయాలు వారివి. కళాకారిణి అయిన ఈ సురేఖకి యీ నమ్మకాలూ - పట్టుదలలూ ఏమిటో ?

'చూశావా ; నువ్వూ వాళ్ళలాగానే ఆలోచిస్తున్నావు? మొగుడు వుండీ, ఇంకోడితో తిరిగే ఆ శ్యామల పెద్ద సుమంగళి - నేనుకాదు. అవునా ? నిన్నే నమ్ముకుని నీదాన్ని అనుకున్న - నాగురించి నీకే లేనపుడు....' సురేఖ కన్నీళ్ళు అంతకంతకి ఎక్కువవుతున్నాయి.

'ఏయ్ పిచ్చీ, నీకెందుకోయ్ యివన్నీ. నువ్వు నా భార్యవి. ఆ వ్రతాలూ – పూజలూ నీకెందుకు? నువ్వు కళాసరస్వతివి. నటరాజమూర్తిని నీ కొంగుకు కట్టుకున్నావు. నీ ప్రతిభంగిమలో భగవంతుడు సాక్షాత్కరిస్తున్నపుడు, నువ్వింకా పూజలూ, వ్రతాలు అని దేవులాడటం 'సిల్లీ'గా వుంటుంది. ప్రతిరోజూ నటరాజవిగ్రహానికి పూజ చేస్తావు. గురువుగారి పాదాలకి నమస్కరిస్తావు. ఇంతకి మించిన నియమనిష్ఠలు యింకేం కావాలి?'

'అదికాదు గోపీ, స్త్రీగా – గృహిణిగా.'

'పోవోయ్ – ఈ పిచ్చినమ్మకాలు వొదిలెయ్. రోజూ నాసేవ చేస్తున్నావుగా చాలు, నీకు తప్పకుండా అరుంధతిపక్కన సీటు రిజర్వ్ చేసేశాను.'

'ఛీ, నీకన్నీ వేళాకోళాలే' పన్నీటిజల్లులా ఫక్కున నవ్వింది, ఆ కన్నీళ్ళలోనించే.

'నిజంగా చెప్తున్నాను. నన్ను పోషిస్తున్నావు. చదువు చెప్పిస్తున్నావు. తెల్లవారిలేస్తే నాకేం తక్కువయిపోతుందోనని గిలగిల్లాడిపోతావు. ఇన్నివేలమంది నీ అభినయానికి ముగ్ధులై, నీకోసం పడిగాపులు పడితే, కన్నెత్తికూడా చూడవు. మనసావాచా అంతా నాగురించే....'

సురేఖ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. 'ఆగు – ఆగు, నువ్వుకూడా పొగడ్తలు మొదలుపెట్టకు–' అంది అప్పటికి శాంతిస్తూ.

యమ్. బి. ఎ. లో చేరాక, రాజగోపాల్ 'లా'కికూడా యీవెనింగ్ క్లాసెస్‌కి వెళ్ళటం మొదలుపెట్టాడు. సురేఖ ఆశిస్తున్న పెద్ద పోస్టు కావాలంటే–ఎగ్జిక్యూటివ్‌పోస్ట్ సంపాయించాలంటే, 'లా' డిగ్రీకూడా చేతిలో వుండాలని–అందులోనూ 'కంపెనీ లా' మీద ఒక కన్నుంచి చదువుతున్నాడు. ఒక్కఏడాది గడుస్తే, అతని దీక్ష పూర్తిఅయిపోతుంది. ఆ తరువాత తమ జీవితాలకి ఒక భద్రత ఏర్పడుతుంది అనుకుంటున్నాడు.

ఆ ఏడాదే – చెప్పాపెట్టకుండా రాజగోపాల్ తండ్రి వూడిపడ్డాడు ఒక వుదయంవేళ. పొద్దుట ఎనిమిదిగంటలవేళ సంచీపుచ్చుకుని వచ్చిన మనిషిని_ముందుగదిలో కూచోపెట్టి, పనిమనిషి లోపలికి వచ్చి చెప్పింది_ ఎవరో వచ్చారని ।

సురేఖ తనకోసం ఎవరన్నా వచ్చారేమోనని పేరు, వివరాలు కనుక్కోమని పంపింది పనిమనిషిని ముందుగదిలోకి.

ఆ వచ్చిన మనిషి రాజగోపాల్‌కోసం వచ్చాడు. తనకోసం కాదు. సురేఖకి తృటికాలం – భయంవేసింది. ఎవరు? వాళ్ళవాళ్ళా – ఎందు కొచ్చారు ?

రాజగోపాల్ ముందుగదిలోకి వచ్చాడు. సోఫాలో కూచున్నవ్యక్తిని చూసి వులిక్కిపడి సర్దుకుని పక్కకుర్చీలో కూచున్నాడు.

గదిలో గుండుసూది పడినా, చప్పుడు వినిపించేటంత నిశ్శబ్దంగా వుంది. లోపలి గదిలోని సురేఖ చెవివగ్గి వింటున్నది.

అయిదునిముషాల నిశ్శబ్దం తరువాత 'నీకు మాట్లాడటానికి విషయాలు లేకపోయినా నేను ఆడపిల్ల తండ్రిని.'

ఆ వచ్చినవ్యక్తి గోపి మామగారా ? లేక తండ్రా ? ఎవరయి ఉంటారో ఊహించుకునేందుకు మథనపడుతోంది సురేఖ.

'నీ చెల్లెలి పెళ్ళి కుదిరింది.'

రాజగోపాల్ నిశ్శబ్దంగా వింటున్నాడు. గదిలోని సురేఖకి – ఈ వచ్చినతను రాజగోపాల్ తండ్రి అని అర్థమయింది.

'కట్నం పదివేలు_'

ఈ కట్నం అన్న పేరు ఎన్నిసార్లు విన్నాడు – ఈ కట్నం అన్న పిశాచి ఎన్ని జీవితాలని బలిగొంటుంది ; ఎందరి జీవితాలని నాశనంచేస్తుంది? ఎంతమంది ఆత్మగౌరవాన్ని నలిపేస్తుంది ? – ఆలోచిస్తున్నాడు రాజగోపాల్.

'చాలాచోట్ల ప్రయత్నించాను. పొలం తాకట్టుపెట్టుకునేవాళ్ళు లేరు. ఇల్లు తాకట్టుపెడితే దాన్ని విడిపించుకోలేను _'

అవునవును. అందులో మీరంతా ఆఖరిరోజులు గడపాలికదూ _ మామ్మలాగానే మీరూ అక్కడే _ ఆ చూరుకిందే వెళ్ళిపోవాలికాబోలు. తన ఆలోచనకి తనకే ఆశ్చర్యంగా ఉంది. ఎదుట కూచున్న వ్యక్తి _ తనకి జన్మనిచ్చిన తండ్రి. అతన్నిగురించి తానింత నిర్దాక్షిణ్యంగా ఎందుకు ఆలోచిస్తున్నాడు? రాజగోపాల్ తనని తాను మందలించుకుంటున్నాడు. తన మెడలు వంచి పెళ్ళిచేసిన ఈవ్యక్తికి _ ఈరోజున తనపై ఎటువంటి హక్కూ లేదు. హక్కు లేదుగాని అల్లరిపెట్టే శక్తి ఉందికదా! ఉందీ! ఎందుకు అల్లరిపెట్టలేదు? సానుభూతివల్లనా? లేక భయపడ్డాడా?

'ఏంగావాలి?' నోరువిప్పి అడిగాడు రాజగోపాల్.

'ఒక్క అయిదువేలు సర్దితే .... మిగతావన్నీ సమకూరాయి. కట్నంలో అయిదువేలు పూడాలి.'

'ఎల్లుండి డ్రాఫ్ట్ పంపుతాను' అంటూ లేచాడు రాజగోపాల్. తండ్రీ లేచాడు సోఫాలోనించి. రాజగోపాల్ ఆయన్ని వుండమనలేదు. కాఫీకూడా యివ్వలేదు. బయటగదిలోనించే ఆయన వెళ్ళిపోయాడు. ఆ మూడోరోజున అయిదువేలూ పంపాడు రాజగోపాల్. సురేఖ దాచిపెడ్తున్న డబ్బులోంచి అయిదువేలు తీసి పంపాడు. సురేఖ ఎవరికి అని అడగలేదు. ఎందుకు పంపుతున్నావని ప్రశ్నించలేదు. ఆమెకి తనపైనగల నమ్మకం చూస్తుంటే _ రాజగోపాల్‌కి తన జీవితం ఒక కాంతివలయంతో కప్పబడి దీప్తివంత మయిందన్న తృప్తి కలిగింది. తామిద్దరిమధ్యానున్న నమ్మకం, ప్రేమ కంటేకూడా లోతైనదీ, వున్నతమైనదీను.

నాలుగో చెల్లెలి పెళ్ళికి రాజగోపాల్ వెళ్ళలేదు. అతనిపేర వచ్చిన శుభలేఖని అలా టేబుల్‌మీద పడేశాడు. అతడు ప్రయాణం అవలేదు.

సురేఖ వెళ్తావా అని అడగనూలేదు. అయితే ఆడబడుచు పెళ్ళికి కృష్ణవేణి, ఆమె తల్లితండ్రులూకూడా వచ్చారు. రాజగోపాల్ మూడో చెల్లెలు పెళ్ళి చేసుకోనని వుద్యోగం చేస్తున్నది. నాలుగో అమ్మాయి పెళ్ళి. ఈ పెళ్ళికి రమ్మని మామగారు స్వయంగా వచ్చి పిలిచారు. అంచేత కృష్ణవేణి అయిదారేళ్ళ సీతను తీసుకువచ్చింది. సీతని తోడపెళ్ళికూతురు చేశారు. తాతగారూ, మామ్మా ఎత్తుకుని దగ్గరకు తీసుకోపోయారు – కాని సీత వీళ్ళెవరిదగ్గిరకూ వెళ్ళలేదు. తన తాతగార్ని, అమ్మమ్మనీ పట్టుకుకూచుంది. చిన్నపిల్ల సీత చాలా పెంకిదనీ, అది ఏడ్చి రాగాలుపెట్టి కిందబడి దొర్లి కావలసినది సాధించుకుంటుందనీ, అనుకున్నారు పెళ్ళిలో దాని ఏడుపు చూసి।

ఈ పిల్ల ఇలా రణపెంకిగా అవటం తాతా అమ్మమ్మల గారాబమనీ, తల్లి పిల్లని ప్రేమగా చూడదనీ, తండ్రిప్రేమ కరువయి యిలా తయారయిందనీ, అందరూ సర్దుకున్నారు. ఎవరు ఎలా అనుకున్నా – పెళ్ళి బాజాలమధ్యన సీత ఆ రెండురోజులూ దేనికో ఒకదానికి ఏడుస్తూనే గడిపింది. ఎవరిదగ్గిరకు రాలేదు. ఆఖరికి ఇష్టం లేనపుడు తలలో పువ్వులు పెట్టినాసరే అవి పీకి, నేలకేసికొట్టి, రక్కి, గిచ్చి ఏడ్చేది. అంచేత ఆపిల్లకి కోపం రాకుండా జాగ్రత్తపడ్డారు అందరూను.

'బాగున్నావా అమ్మా?' కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అడిగింది అత్తగారు కృష్ణవేణిని.

కృష్ణవేణి తలవూపింది. 'బాగు'అంటే ఏమిటి? ఆరోగ్యమా—తను చిరున చీదకండా శుభ్రంగా వుంది. మనసా — అది చచ్చిపోయి ఆరేళ్ళయింది. తన ప్రమేయం ఏమీలేకుండా – యీ కుటుంబంలోని వ్యక్తి చేత మెడలో మంగళసూత్రాలు కట్టించుకుంది. అతనివల్ల ఒక పిల్లని కంది. అంతే తనకీయింటితో సంబంధం।

పెళ్ళయిన మూడునిద్రలపుడు మటుకు ఓ మూడురోజులు, ఆ తరువాత ఆడబడుచుల పెళ్ళిళ్ళలోనుతప్ప యీ యింట్లో - తను ఒక పదిరోజులుకూడా వుండలేదు. కొత్తకాపరానికి తన భర్త మామ్మగారు వెంటవచ్చింది. అందుచేత అత్తగారిదగ్గరా, ఆడబడుచులదగ్గరా కృష్ణవేణికి అంత చనువులేదు. ఈ నాలుగేళ్ళనుంచీ తను పుట్టింట్లో వుంది. ఈవైపుకి రాలేదు, ఈ యింటికే రాలేదు.

'వాడు ఎలాగూ మమ్మల్ని నష్టేట్లో ముంచాడు ; నువ్వున్నా - రా-' అని మామగారు రెండుమూడుసార్లు పిలిచారు. అయినా కృష్ణవేణి రాలేదు. నష్టేట్లో ముంచాడు అంటూనే, మామగారు అయిదువేలు భర్తనుంచి తెమ్మంటున్నట్లు కృష్ణవేణి చెవులబడింది. మామగారు చెప్పలేదు. అత్తగారు చెప్పింది కట్నం డబ్బు తక్కువయితే, పెళ్ళి అడిగితే అయిదువేలు యిచ్చాడని!

ఆయన వస్తాడా? ఈ పెళ్ళికి వస్తాడా? వస్తే బాగుండునని మనసులో ఆశగా వుంది. కృష్ణవేణికి మళ్ళీ రాకూడదనీ వుంది. అతనుగనక యీ పెళ్ళికివస్తే తానొక్కదానిపట్లా ద్వేషమనీ, యీ కుటుంబంతో పేచీ లేదనీ నిర్ధారణ అయిపోతుంది. తను ఏం చేసిందని యింత ద్వేషం? కట్నంకోసం పెళ్ళిచేసుకుని తనని ద్వేషించడం అన్యాయంకదా? వస్తారా? వచ్చి తనని పల్కరిస్తారా? సీతని పిల్చి ఎత్తుకుంటారా? పెళ్ళి సుముహూర్తందాకా కృష్ణవేణి మనసు ద్వైదీభావంతో వూగిసలాడుతూనే వుంది. వస్తే, తామిద్దరూ ఎలా ప్రవర్తిస్తారో అని యింతమంది వేయికళ్ళతో కనిపెడతారు. తను వెళ్ళి కాళ్ళుపట్టుకుని ఏడ్చి, వెంట వస్తానని ప్రాధేయపడాలని ఎదురుచూస్తారు. తనకి జరిగిపోతున్న అన్యాయానికి తీర్పు చెప్పటానికి అన్నట్లు - ఆయనముందు తన మనోవ్యథని ఏకరువు పెడ్తారు. అప్పుడు తను అతనివెంట వెళ్ళాలిఅని ఎక్స్‌పెక్ట్ చేస్తారు. తాను వెళ్ళదు. ఏమైనాసరే వెళ్ళదు. ఒకపక్క పెళ్ళిహడావుడి - మరోవైపున

బంధువు లందరూ తనపై కురిపించే సానుభూతి – ఈ రెంటితో కృష్ణవేణి లోలోన మధనపడిపోతున్నది. అతను వస్తాడో రాడో నన్న సంశయంతో గిలగిలలాడిపోతున్నది .... రాజగోపాల్ పెళ్ళికి రాలేదు. లగ్నం వేళకి రాలేదు. ఆరోజు రైలు స్టేషన్‌లో ఆగిందీ, పెళ్ళిపోయింది – అతను రాలేదు. అమ్మయ్యా అని, గాలి పీల్చుకుంది కృష్ణవేణి. కాని, ఆ క్షణంనుంచి ఇంట్లోవారు బంధువులూ ఇంటికైనవాడు, ఒక్కగాని ఒక్క కొడుకు, పెద్దవాడు పెళ్ళికి రాలేదని రకరకాల విమర్శిస్తూ వుంటే – కృష్ణవేణికి కోపంగా వుంది. ఎదురుగుండాలేని ఒకవ్యక్తిని దూషించడం ఏం న్యాయం? ఎదురుగుండా వుండి, అవతలవ్యక్తి విమర్శకి బదులు యివ్వగలిగినపుడు – ఎన్నిమాట లయినా అనవచ్చు. ఒకమనిషి అక్కడ లేనపుడు అనటం న్యాయంకాదు.

పెళ్ళిలో బంధువులంతా – 'మీఆయన రాలేదా ? పెద్దకొడుకు రాలేదా?' అంటూ ఆశ్చర్యం ప్రకటించారేతప్ప, ఆఖరికి మామగారూ, ఆడబడుచులుకూడా కృష్ణవేణిని 'నువ్వు ఎలా బతుకుతున్నావ్? నీకు ఎలా కాలక్షేపం అవుతోంది?' అని అడగలేదు. భర్త వదిలేసిన స్త్రీ – అలా నిర్వ్యాపారంగా ఆ పరారి అయిన మొగుడుని తలుచుకుని బ్రతకాలి – అన్నట్లుగా వాళ్ళ దృక్పథం. అంతేగాని ఎవరూ 'నీ భవిష్యత్ ఏమిటి? నీ పిల్ల భవిష్యత్ ఏమిటి?' అని ప్రశ్నించలేదు. అత్తవారింట్లో వారి యీ దృక్పథం కృష్ణవేణికి కోపం తెప్పించింది. తనకి తండ్రి అండ లేకపోతే, ఈ యింట్లో పడివుండి, అందరికీ చాకిరీ చెయ్యాకిల్సివచ్చి వుండేది. అంతేనా – పెళ్ళి అంటే ? చేసిన పెళ్ళి సుఖప్రదంగాకపోతే, ఆడదాని విషయం ఎవరికీ అక్కర్లేదా?

'కోడలినీ, మనుమరాల్నీ కొన్నాళ్ళు యిక్కడ వుంచండి' అడిగాడు ఆనందరావు పెళ్ళివారితోపాటు ప్రయాణ మవుతున్న వియ్యంకుడిని చూసి.

తండ్రి కృష్ణవేణివంక 'ఏమంటావ్?' అన్నట్లు చూశాడు.

'సీతకి పరీక్షలు .... దాని చదువు చెడిపోతుంది' అంది కృష్ణవేణి.

'చిన్నపిల్లకు – చదువేమిట? అది బొత్తిగా మమ్మల్ని మర్చిపోయింది. తండ్రివైపు బంధువులున్నారని దానికిమటుకు తెలియద్దా–' అడుగుతున్నాడు ఆనందరావు.

'తెలిసి ప్రయోజనం?' ప్రశ్నించింది కృష్ణవేణి సూటిగా.

'అన్నిటికి ప్రయోజనం వెతుకుతే ఎలా? రక్తస్పర్శా, ప్రేమా .... వీటికి....?' ఆగిపోయాడాయన కృష్ణవేణి కళ్ళవంకచూసి.

'రక్తస్పర్శకు ప్రయోజనం లేదా? లేకేం దాని ఖరీదు యిరవై వేలు' ఆమాట పైకి అనలేక వూరుకుంది కృష్ణవేణి.

'అక్కడ 'ఆర్ఫనేజ్'లో పిల్లలకి పరీక్షలు. దగ్గిర వుండకపోతే సరిగ్గా చదవరు. నేనూ వచ్చేస్తున్నాను నాన్నా' అంది మామగారితో సూటిగా మాట్లాడటం ఇష్టంలేనట్లు.

ఆ యింటికి చుట్టంలాగా వచ్చి చుట్టంలాగానే ప్రయాణమయింది కృష్ణవేణి. ఆమెని పట్టబలవంతాన ఆపటానికి ఎవరికీ ధైర్యం లేకపోయింది.

'వాళ్ళంత బలవంత పెడుతున్నపుడు – ఇంకోరోజయినా వుంటే బాగుండేది. అమ్మా నేనూ వచ్చేసినా – నువ్వు ఒకటి రెండురోజు లుంటావనుకున్నాను.'

'ఉండి చేసేదేముంది?'

'ఇంటికోడలివి....మరీ ముఖంమీద కొట్టినట్లు——'

'కందకిలేని దురద కత్తిపీటకిట – నాపని అలావుంది. కొడుకు రాకపోతే నోరుమూసుకు వూరుకున్నారు – మధ్య నేనెందుకు వుండాలి? అసలు నాకూ వాళ్ళకి సంబంధం ఏమిటి?'

'లేదు అనుకుంటే – పోతుందా?'

'వీలేదా?' ఛాలెంజ్ చేస్తున్నట్లు అడిగింది. తన భర్త ఏమీ సంబంధం లేనట్లు - చెల్లెలి పెళ్ళికి రాలేదు. ఏంచేశారు? నోరెత్తకండా వూరుకున్నారు.

కృష్ణవేణిలో పూర్వపు మెత్తదనం - సాధుస్వభావం తగ్గాయి. మనసులోమాట ఫెడీలని పైకి అనటం అలవాటు చేసుకుంది. ఆమె నోరుకి తల్లీ తండ్రీకూడా భయపడుతున్నారు.

ఆర్ఫనేజ్ నిర్వహణలో తలమునకలుగా - దూరుకుపోయింది ఆమె. రాజారావుగారు రోజూ శరణాలయానికి వెళ్ళటం తగ్గించేశారు. అక్కడ పిల్లలసంఖ్యకూడా రెట్టింపు అయింది. ఈ నాలుగేళ్ళలో ఆర్ఫనేజ్ వ్యవహారాలూ - గ్రాంటులూ అన్నీ కృష్ణవేణే చూసుకుంటున్నది. ఉదయం వెళితే- సాయంత్రంగాని ఇంటికొచ్చేదికాదు. పిల్లలకి పాఠాలు చెప్పడం, ఎకౌంట్స్ తణిఖీ, వాళ్ళ భోజనాలు అన్నీ స్వయంగా చూస్తున్నది. ఆమె కడుపున పుట్టిన కూతురు అమ్మమ్మ పాలనలో పెరుగుతుంటే, తల్లిదండ్రులు ఎరగని అనాథశిశువులు అరవైమందికి తాను తల్లిఅయి సేవజేస్తున్నది.

చెల్లెలి పెళ్ళిఅయిన ఆరునెలలకి రాజగోపాల్‌కి, ప్రొడక్షన్ ఎసిస్టెంట్ మేనేజర్‌గా వుద్యోగం వచ్చింది. సహజంగా మాటకారి - మూడు డిగ్రీలు చేతిలో వుంటంచేతనూ, వెనక సురేఖ 'పుల్' చేతనూ అతనికి పెద్దమొత్తంమీదనే వుద్యోగం వచ్చింది. నెలకి పదిహేనువందలు జీతంతో ఆరంభించారు. మొదటినెల జీతం అందుకున్నాక - రాజగోపాల్ బజారుకెళ్ళి, బంగారపుకొట్లో రెండు మంగళసూత్రాలు కొనుక్కొచ్చాడు.

'ఇదిగో అమ్మాయ్ - మంగళసూత్రాలు కొనుక్కొచ్చాను. గుళ్ళో కట్టమన్నావా ? ఇంట్లోనే కట్టెయ్యమన్నావా?' అడిగాడు ఆ రాత్రి సురేఖని.

సురేఖ వుక్కిరి బిక్కిరి అవుతోంది. అనేకసార్లు ఆమెకి తోటి గృహిణీలాగా మంగళసూత్రాలు కట్టుకోవాలని అనిపించేది. పైకి చెపితే

రాజగోపాల్ నవ్వుతాడేమోనని భయం. తన మనసులోని కోర్కె గ్రహించి మొదటిజీతంతో - తమ బంధానికి ఒక పవిత్రత ఏర్పరుస్తున్నాడు.

'మా గురువుగార్ని అడిగి, మంచిరోజు చెప్పమంటాను. ఆయన ఎదుట మీరు నా మెళ్ళో మంగళసూత్రాలు కట్టండి - '

'మీరు అంటున్నావేమిటోయ్, కొత్తగా వుంది. ఇంటో మరోమనిషి వున్నాడేమోనని భయపడిపోయాను'

'అదికాదు. ఇకనుంచి నిన్ను ; గోపి అని పిలవను'

'ఏంమ్మా - ఆ పేరు బాగాలేదా ? '

'పేరుకోసం కాదు. మనిద్దరం వున్నపుడు ఏ పేరుతో పిలిచినా ఒకటే - బయట - మీరు అని మన్నించదలచుకున్నాను. మీకు పెద్ద వుద్యోగం. నువ్వు అంటే బాగోదు'

'అలాంటప్పుడు - నేను వాసేవ్ - ఏమేవ్ అని పిలవాల్సి వస్తుంది. పేరుపెట్టి పిలవకూడదు'

'మీకు ఎలా పిలవాలనివుంటే - అలా పిలవండి'

'దీన్నే - పెర్రివదలి - తలకి రోకలి చుట్టుకుందంటారు. నీకు నేను ఎప్పుడూ గోపినే - అది మర్చిపోకు. నువ్వు లేకపోతే నేను లేను.'

'ఛీ - అలా అనకండి.'

'ఇదిగో, సురేఖా, నువ్వు అండీ గిండీ అంటే ఇంట్లో వుండకండా పారిపోతాను. నన్ను గోపి అని పిలుస్తేనే పలుకుతా - అండీలు లాభం లేదు.'

'సర్లే - రేపు గురువుగారితో చెపుతాను.'

'ఏమని?'

'మంచిరోజు ఎప్పుడో చెప్పండి. మా గోపి నన్ను పెళ్ళి చేసుకుంటాడుట–' అని. నవ్వుతూ చెప్పింది సురేఖ.

'సురేఖా, ఒక్కసంవత్సరం ఆగు. ఒక పాపాయినికూడా కనేసి ఏకంగా పెళ్ళి చేసుకుందాం' అన్నాడు గోపి అల్లరిగా. అన్న మరుక్షణం నాలిక కరుచుకున్నాడు. సురేఖకి పిల్లలు కావాలని – చాలా మక్కువగా వుందని అతనికి తెలుసు. పిల్లలు అంటే ఆమె కళాజీవితాన్ని తాను నాశనం చేసినవాడవుతాడు. తనకోసం ఆరేళ్ళు శ్రమించింది. ఒక్క చీరెకూడా స్వంతానికి కొనుక్కోకుండా అతి పొదుపుగా తన అవసరాలు గడుపుకునేది. టూర్స్‌కి వెళితే – అందరూ అప్పులు చేసి సామాన్లు కొనుక్కుంటే – సురేఖ తనకి బహుమతిగా ఏదో వస్తువు తేవడంతప్ప స్వంతానికి ఏమీ కొనుక్కునేది కాదు. అప్పుడే పిల్లలు అంటే – తాము సుఖంగా, హాయిగా ఉంటానికి అవదు. సురేఖ ఇంకా నృత్యం చెయ్యాలి – ఇంకా పేరుతెచ్చుకోవాలి.

'గోపీ, నాకు నిజంగా ముగ్గురుపిల్లలు కావాలి.' అంది సురేఖ సీరియస్‌గా ముఖంపెట్టి.

'అదేమిటి, ఫామిలీ ప్లానింగ్‌వాళ్ళ ప్రాపగాండాలాగా – ఇద్దరూ లేక ముగ్గురు అంటున్నావు.'

'నిజంగానే—ఇద్దరు అబ్బాయిలు, ఒక అమ్మాయి.'

'చూద్దాంలే .... ' అన్నాడు అదేదో చాలా చిన్నవిషయంలాగా ముఖం పెట్టి.

'రేపు పొద్దుట లేచి – గురువుగారిదగ్గర కెళ్ళి – ఆయనకి నమస్కారం చేసి, నువ్వు పెళ్ళిచేసుకోబోతున్నావని చెపుతాను'

'ఎవర్ని ? '

'నన్ను'

'అమ్మయ్యో - ఇంకా ఎవర్నో అనుకున్నాను –'

'పాపం – ఆశ – ఇద్దరిని చేసుకున్నావు చాలదుకాబోలు–'

రాజగోపాల్ ఉలిక్కిపడ్డాడు—అవును. తనకి 'లీగల్'గా ఇదివరకే పెళ్ళి అయింది. ఈ పెళ్ళి చట్టం దృష్టిలో చెల్లదు. సురేఖ తృప్తి కోసం తను మంగళసూత్రం కడతానన్నాడేతప్ప ; ఇది న్యాయసమ్మతమైన పెళ్ళి కాదు. సురేఖ చట్టప్రకారం తనకి భార్యకావాలంటే - కృష్ణవేణికి విడాకులు యివ్వాలి. ఆ విడాకులకి ఆమె సమ్మతిస్తుందా ? ఒక పిల్లకూడా ఉంది. ఇవ్వను అంటే తనేం చేస్తాడు ?—రాజగోపాల్ వీటన్నిటినీ లోతుగా ఆలోచించదలచుకోలేదు. సురేఖని గట్టిగా గుండెలకి అదుముకున్నాడు ; ఆమె ఎక్కడికి పారిపోతుందో అన్నంత భయంగా దగ్గరకు లాక్కున్నాడు—'హఠాత్తుగా ఇతను ఎందుకిలా నిశ్శబ్దమైపోయాడు? తనకి వూపిరి ఆడకుండా ఎందుకిలా చేస్తున్నాడు?' - సురేఖకి బోధపడలేదు. ఆమెకి ప్రతిసారీ అతని స్పర్శ ఆనందాన్ని యిస్తూనే వుంటుంది. ఇతని మాటలు విసుగనిపించవు. అతని స్పర్శ ప్రతిసారీ కొత్తగా వుంటుంది. తమ యిద్దరిమధ్యా గాలికూడా చొరకూడదన్నట్లు - అతన్ని గట్టిగా వత్తుకుంది సురేఖ.

గురువుగారు సురేఖ చెప్పింది విన్నారు. అయిదునిముషాలు నిశ్శబ్దంగా వున్నారు.

'ఈ నికేతనంలో పెళ్ళి జరిపించడం బాగుండదు. మీ యిద్దర్నీ గుళ్ళోకి తీసుకెళ్ళి స్వామి ఎదుట దండలు మార్పిస్తాను.'

'నాకు గుళ్ళో అని ప్రత్యేకత లేదండి - మీ సమక్షంలో మా పెళ్ళి జరుగుతే చాలు. మీరు భగవంతునికంటే ఎక్కువ' అంది అనేక వేలసార్లు, రోజుకు రెండుసార్లు ఆయన పాదాలకి నమస్కారం పెట్టిన సురేఖ. రోజూ నికేతనానికి రాగానేనూ, వెళ్ళేటప్పుడూ యాంత్రికంగా నమస్కారం చేసేది. కాని, ఈనాడు మనస్ఫూర్తిగా ఆయన తనకి దైవసమానుడు, తండ్రివంటివాడు అన్న భక్తితో - గౌరవంతో నమస్కారం చేసింది.

ఆ మూడోరోజు ప్రదోషకాల మప్పుడు గురువుగారు - సురేఖనీ, రాజగోపాల్ని గుళ్ళోకి తీసుకెళ్ళి, దండలు మార్పించారు. ఆయన ఎదుట ఆమె మెళ్ళో మంగళసూత్రం కట్టాడు. సురేఖ తొలిసారి భర్తపాదాలని కళ్ళకి అద్దుకుని, ఆపైన గురువుగారికి నమస్కారం చేసింది. ఆ యిద్దరి పేరునా సహస్రార్చన చేయించారు గురువుగారు.

సురేఖ ఇకనుంచి నాట్యం మానేస్తుందా అన్న సందేహం ఆయనకి రాకపోలేదు. కాని ఇది సమయం కాదని పైకి అడగలేదు. రాజగోపాల్ ఆయన మనసులోని సందేహాన్ని గ్రహించినట్లు - 'మేస్టారూ, సురేఖకోసం ఈ తంతు గానీండి. నాకు పెళ్ళి చేసుకున్నా లేకపోయినా ఒకటే. మీకు తెలుసుగా, మేము ఏనాడో భార్యాభర్తల మయ్యామని ! సురేఖ ; ముందు మీ శిష్యురాలు - ఆపైన నాభార్య' అన్నాడు. గురువుగారు ఆతనిని మనసులో అభినందించారు.

ఇప్పుడు సురేఖ జీవితం రాజగోపాల్చుట్టూ అల్లుకుపోతున్నది. అతను ఆఫీసుకి వెళ్ళేముందు టిఫిన్ చేయించడం, బట్టలు తీసిపెట్టడం, ఆఫీసునుంచి వచ్చేప్పటికి కాచుకుని, ఎదురుచూస్తూ వుంటం ఆమె నిత్యకృత్యం అయింది. పూర్వంలాగా అతను వొళ్ళు 'మాసేజ్' చేస్తానంటే వొప్పుకునేది కాదు.

'ఏం - కొత్తగా ఏం మార్పు వచ్చింది? పూర్వంమటుకు నీ మొగుణ్ణికాదా?' అడిగాడు రాజగోపాల్.

'అప్పుడు వేరు - అప్పుడు నువ్వు స్టూడెంటువి - ఇప్పుడు పెద్ద ఆఫీసరువి.'

'గాడిదగుడ్డు - ఉత్త మా మామ్మలాగా, మాట్లాడుతున్నావ్ - నాకు ఇలాంటి మార్పులు నచ్చవ్. నీకు 'మాసేజ్' సరిగ్గా జరగకపోతే - కాళ్ళు మొద్దుబారిపోతాయి.'

'అవుతే అవనీండి'

'అప్పుడు – నువ్వు నటరాజభంగిమలో నుల్చోలేవు. ఆమధ్యన ఒకావిడ అరంగేట్రానికి వెళ్ళాం జ్ఞాపకం వుందా?'

'ఉంది'

'ఆ యిల్లాలు – కుడికాలిపాదం – ఎడంకాలు మోకాటి చిప్పదాకా కూడా – ఎత్తలేకపోయింది. తొక్కుడుబిళ్ళ ఆటలాగా పాదం ఎత్తి ఎత్తి పెయ్యటం మొదలుపెట్టింది. రేపు నీకూ అదేగతి పడుతుంది.'

'పట్టనీ – డాన్సును మానేసి యింట్లో కూచుంటాను.'

'నేను వొప్పుకోను.'

'ఎందుకని ?'

'నాభార్య గొప్ప నాట్యకర్తె అంటే నాకు ఘనతకదా!'

'నీ ఎదురుగుండా గొప్పకళాకారిణి, నాట్యసరస్వతి అంటూ పొగిడి – నీవెనక తైతక్కలాడుతోంది అంటారు.'

'అనుకోనియ్ – నాకు లక్ష్యంలేదు. సరేనా? నువ్వు డాన్సు చెయ్యాలి. ఎప్పుడూ యిలాగే నృత్యం చెయ్యాలి' అన్నాడు రాజగోపాల్.

తోడునీడగా బతుకుతున్న మనిషిని గురించి తనకి తెలియని విషయంలేదు అనుకుంటారు – భార్యాభర్తలుగానీ, ప్రేమికులుగాని! రాజగోపాల్ తనకి సురేఖ గురించి తెలియని విషయంలేదు అనుకున్నాడు. ఆమె మనసులో భావాలు, దేహంలోని ప్రతిభాగం తనకి తెలుసు. ఆమెకి నేతచీరెలంటే యిష్టం. నగలుకూడా ఎక్కువ పెట్టుకోదు. మల్లెపువ్వులంటే యిష్టం. ఇలా సురేఖ అభిరుచులూ, ఆమె యిష్టాయిష్టాలు తనకి బాగా తెలుసు – అనుకున్నాడు రాజగోపాల్.

కాని, ఆ సాయంత్రం సురేఖలోని కొత్త కోణం చూస్తున్నాడు. నృత్యనికేతనంలో – నాట్యం నేర్చుకున్న ఒక శిష్యురాలి అరంగేట్రం – పన్నెండేళ్ళపిల్ల – చిన్నతనంలో సురేఖ మొదటిఅడుగులు నేర్పినా –

ఈమధ్య గురువుగారే - ఆపిల్లకి బహు శ్రద్ధతో శిక్షణయిస్తున్నారు. ఈవిషయం సురేఖ గమనించలేదు. ఈ నృత్యనికేతనంలో తను గురువు గారికి ప్రథమ శిష్యురాలు - ముఖ్యశిష్యురాలు - తనస్థానం భర్తీచేయగల మరో వ్యక్తి లేదు—అని సురేఖకి అంతరాంతరంలో ఆత్మస్థయిర్యం ఉంది. గురువుగారి ఎదుట చాలా నమ్రతగావున్నా - అంతరాంతరాల్లో - తాను ఎంతో ముఖ్యురాలననే గర్వంకూడా ఉంది.

ఆనాడు అరంగేట్రం. నృత్యనికేతనంలో ఏపిల్ల అరంగేట్రం ఇచ్చినా - నికేతనంలోని స్టాఫూ, మిగతా పిల్లలూ అందరూ మొదటి వరసల్లో కూచుంటారు. వీరికని రెండువరసలు కేటాయిస్తారు. ఇది గురువుగారి నిబంధనల్లో ఒకటి. ఈమధ్య సురేఖ నృత్యం కానపుడు, గురువుగారు - రాజగోపాల్‌కికూడా ఆహ్వానాలు పంపుతున్నారు. ఆరోజు అరంగేట్రానికి సురేఖతోపాటు, రాజగోపాల్‌కూడా వచ్చాడు. సురేఖ కొరనాడచీరవలె వుండే - గళ్ళ పట్టుచీరె కట్టుకుంది. ఆవపొడిరంగు జాకెట్టు వేసుకుని, తలనిండా పువ్వులుపెట్టుకుని, విరిసిన తంగేడుచెట్టులాగా మొదటి వరసలో - ఒక కొసన రాజగోపాల్‌తోపాటు కూచుని వుంది. అతని పక్కన అలా నలుగురి ఎదుటా, బుజాలు రాసుకుని కూచోటం సురేఖకి ఆనందంగా, గౌరవంగా వుంది. ఆ ప్రదర్శనలో, వేదిక ఎక్కి, యీ రాజగోపాల్ నాభర్త అని అందరికీ చాటిచెప్పాలన్నంత వుత్సాహంగా వుంది. ఆ మధ్యాహ్నం వేసుకున్న తాంబూల చర్వణంతాలూకు ఎరుపు రంగు ఆమె పెదిమలమీది చిరునవ్వుతో పోటీపడుతోంది. పౌడరుకూడాలేని ఆమె ముఖం పచ్చగా, స్వచ్ఛంగా వుంది. కళ్ళనిండా కాటుక - నుదుట ఎర్రని గుండ్రటిబొట్టు. రాజగోపాల్ మాటిమాటికి సురేఖవంక చూస్తున్నాడు. ఈ అందాల సురేఖ - పూర్వజన్మ ఫలితంగా తనకి లభించింది. కిక్కిరిసి వున్న హాలులో - ఈమెతో పోటీబడగల సుందరాంగులు ఎవరేనా వున్నారా ? - అని పరకాయించి చూశాడు. ఒక్కరుకూడా కనిపించలేదు.

రకరకాల దుస్తులతో - అతి ఆధునికంగా చాలామంది స్త్రీలు ఆడిటోరియమ్‌లో యిటూ అటూ తిరుగుతూ హడావుడిగా వున్నారు. వాళ్ళ అలంకరణలో నాగరికత వుట్టిపడుతోందిగాని, సహజలావణ్యం కనిపించటం లేదు. హాలంతా పరికించి చూసి, పక్కనున్న సురేఖవంక చూస్తున్నాడు రాజగోపాల్. అతను రెప్ప వాల్చకండా తనని చూస్తుండటం సురేఖ గమనించి 'ఏమిటలా చూస్తున్నారు. కొత్తదాన్ననుకున్నారా?' అంది.

'నువ్వు నిత్యనూతనంగా కనిపిస్తూ వుంటావు. సూర్యోదయం - ఎన్నిసార్లు చూసినా ప్రతిరోజూ కొత్త అందాలు సంతరించుకుని ప్రత్యక్ష మవుతుంది. నువ్వూ అంతే. ఈరోజు ఎలా వున్నావో చెప్పనా?' సన్నగా చెవిదగ్గర నోరుబెట్టి వొంగుని చెప్పబోతున్నాడు రాజగోపాల్.

'ఉహుఁ. పక్కవాళ్ళకి వినిపిస్తుంది. ఇంటికెళ్ళి నా అందాన్ని వర్ణిద్దురుగాని. ఇప్పుడు బుద్ధిగా అరంగేట్రమ్ చూడండి' అంది కొత్త సంబోధన అలవాటుచేసుకుంటున్న సురేఖ.

గురుపూజతో కార్యక్రమం ఆరంభమయింది. నటరాజమూర్తికి ప్రణమిల్లి గురువుగారికి నమస్కరించి, ఆయనకి పట్టువస్త్రాలు సమర్పించి నాట్యం ఆరంభించింది ఆ పన్నెండేళ్ళపిల్ల.

ప్రేక్షకులు ఆపిల్ల నాట్యంలో లీనమై చూస్తున్నారు. అరంగేట్రానికి సహజంగా ప్రేక్షకులు అంత ఆసక్తి కనిపింపజేయరు. ఏదో కబుర్లు చెప్పుకుంటూ పెళ్ళికి వచ్చినట్లు అది వొక శుభకార్యంలాగా లాంఛనంగా చూస్తారు. కాని ఈ సాయంత్రం ప్రేక్షకులు ఆ పిల్ల నాట్యాన్ని మైమరిచిపోయి చూస్తున్నారు. హాల్లో అంతా నిశ్శబ్దం. ఎక్కడా గొంతులు తగ్గించి మాట్లాడుకునే శబ్దాలులేవు. గురువుగారి తాళం - పాటపాడే ఆమె కంఠం, యీ పిల్ల కాలి అందెలు గాలిలో తెరలు తెరలుగా వచ్చి - వీనుల సోకుతున్నాయి. వేదికమీద చిరంజీవి ఆకాశంలోని హరివిల్లుగా వంగి - తన సోయగాన్ని, నాట్యభంగిమని ప్రదర్శిస్తున్నది.

రాజగోపాల్ మైమరచి ప్రదర్శన చూస్తున్నాడు.

సురేఖ అతని జబ్బ పుచ్చుకున్నది.

అతని జబ్బచుట్టూ సురేఖవేళ్ళు ఇనుపకడ్డీలాగా బిగుసుకుంటున్నాయి.

ఆ వేళ్ళ ప్రెషర్‌కి రాజగోపాల్ పక్కకి తిరిగి చూశాడు.

సురేఖ ముఖం ఎర్రగా వుంది. ఆ కళ్ళు వేదికవంక చూడటంలేదు. మైమరచి తాళంవేస్తున్న గురువుగారివంక చూస్తున్నాయి. సురేఖ కళ్ళు తీక్షణంగా వున్నాయి. వేదికమీదనున్న దీపాలు ఆమె కళ్ళలో ప్రతిఫలించి— ఆ కళ్ళు తళతళా మెరుస్తున్నాయి. రాజగోపాల్‌కి భయంవేసింది. సురేఖని ఈ స్థితిలో అతను ఎన్నడూ చూడలేదు.

'సురేఖా — ఏయ్ సురో' అన్నాడు ఆమెని కదుపుతూ.

సురేఖ — సుషుప్తిలోంచి మేల్కొన్నట్లు అతనివంక చూసి 'ఇంటి కెళ్ళిపోదాం - పద — వెళ్ళిపోదాం' అంది బొంగురు కంఠంతో.

'అదేమిటి — డాన్సు చాలా బాగుంది — చివరిదాకా వుండి వెళ్దాం.'

'ఉహూ — వెళ్ళిపోదాం.'

'గురువుగారితో చెప్పక్కర్లేదా ? ఆయనకి కనిపించకుండా వెళ్ళిపోతే కోప్పడతారేమో !'

'ఏం అక్కరలేదు. నువ్వు వస్తావా — రావా? లేకపోతే నేను వెళ్ళిపోతాను' ఒక్క వుదుటున లేచింది సురేఖ. ఆమె లేచిన విసురుకి ఆ వరసలోని కుర్చీలన్నీ కదిలినట్లపించింది రాజగోపాల్‌కి.

తను యింకా వాదిస్తే చుట్టుపక్కలవారు వింటారేమోనని - అయిష్టంగానే లేచి బయట కొచ్చాడు. బయటకొచ్చి టాక్సీలో కూచున్నారు. సురేఖ మాట్లాడలేదు. ఆమె ముఖం గంభీరంగా వుంది.

# 6

'సురో' అన్నాడు రాజగోపాల్ ఆమె వుద్రేకానికి ఆశ్చర్యపోతూ.

'ఎంత మోసం – ఎంత దగా....' కీచుగా వుంది ఆమె కంఠం.

'ఎవరు చేశారు ? నిన్ను ఎవరేం చేశారు ?'

'ఎవరంటావేమిటి ? నా కళ్ళుకప్పి గురువుగారు ఆ పిల్లకి – అంత శ్రద్ధగా నేర్పలేదూ ? నామీద పోటీగా ఆ పిల్లని తయారుచేస్తున్నారు. నేను వొప్పుకోను. ఆ అమ్మాయికి – ఇంకొక్కరోజు నాట్యం నేర్పినా – నేను నికేతనానికి వెళ్ళను. దాన్ని – దాన్ని, రెప్పవెయ్యకుండా పత్తికాయల్లాగా కళ్ళుపెట్టుకుని దానివంక చూస్తున్నారు .... '

రాజగోపాల్ నిర్ఘాంతపోయాడు. ఈ సురేఖ కొత్త వ్యక్తి – తనకి తెలియని మనిషి. ఆ పిల్లమీద అంత జెలసీయా ? తనుతప్ప ఎవరూ గురువుగారికి ప్రధమశిష్యులు కాకూడదా ?

'ఛ – ఛ – నువ్వు అలా ఆలోచించకూడదు. ఆయనకి నువ్వంటే ఎంత వాత్సల్యమో తెలుసా ? '

'ఈ విషయాలు నాకేం తెలియవు' విదిలించినట్లు అంది సురేఖ.

రాజగోపాల్ నిశ్శబ్దంగా వుండిపోయాడు.

'ఈ మధ్య – నన్ను సాయంత్రం నికేతనానికి రావద్దంటే – పెళ్ళి అయింది, అందుకని మనకోసం ఆలోచించారనుకున్నా. ఇంత కుట్ర పన్నుతారా ? నేనులేకుండా ఆ పిల్లచేత బాగా ప్రాక్టీసు చేయించారు. నాకు చెప్పని కొత్త భంగిమలు చెప్పారు .... దాని జుట్టు పీకేస్తాను – కాళ్ళు నరికేస్తాను' అంబ శక్తిలా వుద్రేకపడిపోతున్నది సురేఖ.

సురేఖకి పాతికేళ్ళు వచ్చాయి. పదిహేనుఏళ్ళుగా నృత్యప్రదర్శన లిస్తున్నది. ఏడోఏటనే అరంగేట్రమ్ యిచ్చిందిట. ఈ పిల్లకంటే తక్కువ వయసులో వేదికనెక్కిన సురేఖకి తనకంటే ఒక పుష్కరం చిన్నదయిన అమ్మాయిమీద యింతటి కసా ? ఇంత కోపమా ? నృత్య నికేతనంలో చాలామందిపిల్లలు అరంగేట్రమ్ యిచ్చారు. ఎందరో పిల్లలకి గురువుగారు శిక్షణ యిచ్చారు. ఎవరి విషయంలోనూ ఫీలవని జెలసీ యీ పిల్లవిషయంలో ఎందుకు చూపిస్తున్నది ? నృత్య నికేతనంలో తన స్థానానికి చలనం కలుగుతున్నదని భయమా ? లేక, కళాకారిణిగా - గురువుగారి ముఖంలోని ఆనందాన్ని సురేఖ పసికట్టిందా ?

సురేఖ చీరె మార్చుకోలేదు. అలా సోఫాలో కూచునివుంది - కదలకుండా !

'రేఖా ! లే, కాళ్ళూ చేతులూ కడుక్కో - భోంచేద్దాం'

'ఊహూ. నేను లేవను. గురువుగారిదగ్గరకెళ్ళి తాడో పేడో తేల్చుకోవాలి'

'నీకేం మతిపోయిందా ? '

'పోలేదుగనకనే, ఆయన దేవుడనుకున్నాను. నీమీదకంటే ఆయన మీద భక్తి చూపించాను. ఎన్ని తిట్టినా, ఎన్నిమాటలన్నా .... '

'అయితే ఏవంటావ్ ? '

'ఆ పిల్లకి ఆయన డాన్సు నేర్పడానికి వీల్లేదు'

'నువ్వెవరూ చెప్పడానికి ? ఆయన నీకు గురువు'

'అంతేనా - ఆయనకి నేను ఏమీకానా ?' సురేఖ కళ్ళు నీళ్ళతో నిండిపోతున్నాయి. నిశ్శబ్దంగా ఏడుస్తున్నది.

రాజగోపాల్‌కి ఏం చెయ్యాలో తోచడంలేదు.

'సురో__'

'ఊఁ' అంది ఈ లోకంలో లేనట్టు.

'చూడు, నీకూ గురువుగారికీ – మధ్యవున్న సంబంధం ఏవిటి ? ' అడిగా డతను.

సురేఖ వులిక్కిపడినట్లు – కళ్ళుఎత్తి చూసింది.

'నేను తప్పుగా అడగటంలేదు. ఆయన నీకు గురువు, అవునా ? '

సురేఖ తల వూపింది అవునన్నట్లు.

'ఆయనకి నృత్య నికేతనం వుంది. అనేకమంది శిష్యులు వస్తారు. వాళ్ళకి నాట్యం నేర్పుతారు.'

'అంతేనా – నేను ఏమీకానా ? '

'ఎందుకు కావు ? నువ్వు ప్రత్యేకమైన శిష్యురాలివి కాబట్టి – మూడు నెలలు—నీకు జబ్బుచేసినపుడు అంత శ్రద్ధతీసుకున్నారు. మీ అమ్మ పోయినపుడు....'

'మరి – ఈపిల్లకి – ఎందుకంత శ్రద్ధగా నేర్పారు ?'

'ఇది మరీ బాగుంది. నీ తరువాత ఇంక ఎవరినీ తయారుచేసుకో నక్కరలేదా ?'

సురేఖ వెక్కివెక్కి ఏడుస్తోంది – ఉద్రేకపడి ఏడుస్తోంది. 'అదే, నేను చెప్పేది. ఇప్పటికైనా నీకు అర్థం అవుతోందా ? ఆ అమ్మాయిని నా స్థానంలో కూచోపెడతారు. నేనుచేసే 'సోలో' తనచేత చేయిస్తారు.' ప్రళయం వచ్చినట్లు ఏడుస్తోంది.

'అరే, దీనికింత ఖంగారా ?'

'ఖంగారు కాదా ? గురువుగారి దృష్టిలో నాకెంత విలువవుందో అర్థం అయిందా ? ఆ నికేతనంకోసం ఎంతో చేశాను. ఆఖరికి తిండి విషయంలో కూడా రూల్సు పెడితే – అలా తిన్నాను. ఇప్పుడు—ఇప్పుడు నాకళ్ళముందే యింకోపిల్లని తయారుచేస్తున్నారు—ఎంత అన్యాయం....'

'అయితే, ఎల్లకాలం నిన్నేపట్టుకుని వేళ్ళాడమంటావ్. రేపు నేను డాన్సు చెయ్యద్దు అంటే మానెయ్యవా?'

'అది వేరు——నేను వద్దు అని తప్పుకుంటే వేరు. అంతేగాని, నన్ను కాదని - నన్ను పక్కకి తప్పించాలని కుట్రపన్నటం నేను భరించలేను.'

'ఇది కుట్రా....?'

'కాక ?'

రాజగోపాల్‌కి ఎలా చెప్పాలో అర్థంకావటంలేదు. టైము తొమ్మిది అయింది. సురేఖ సోఫాలోంచి లేచేటట్లులేదు. ఇంకా ఏడుస్తూనేఉంది. ఆ పెంకితనం, పట్టుదలా కొత్తగా ఉన్నాయి.

'రేపు పొద్దుట ఆలోచించుకుందాం - రేపు అడుగుదువుగాని లే_'

'ఉహుఁ. ఈరాత్రి అటో యిటో తేలిపోవాలి' అంది సురేఖ సోఫాలోంచి కదలకుండా.

'ఇదిగో _ యిందాకటినుంచీ చూస్తున్నాను. ఏవిటా పెంకితనం. పాతికేళ్ళు వచ్చాయి. ఇంకా పాపాయిలాగా డాన్సు చేద్దామనుకుంటున్నావా? ఆ పిల్లకి పన్నెండేళ్ళు, నీకు పాతిక. వయసు వ్యత్యాసం మర్చిపోతున్నావు. మీ ఆడవాళ్ళు అంతా ఇంతే. వస్తున్న ఏళ్ళని మర్చిపోతూంటారు.' తీవ్రంగా అన్నాడు రాజగోపాల్.

'నువ్వూ అలాగే మాట్లాడుతున్నావు. నేను అప్పుడే ముసలిదాన్ని అయానా? రెండున్నరగంటలు చేసేదాన్ని _ నాలుగు అయిటమ్సుకంటేవద్దు అంటుంటే, ప్రేక్షకులు వెరైటీ కావాలంటున్నారు అంటుంటే, నిజమే అనుకున్నాను. నేను ముసలితొక్కునయానని మీ వుద్దేశం కాబోలు' గట్టిగా ఏడుస్తోంది సురేఖ. ఇక లాభంలేదని డాక్టరుకి ఫోన్ చేశాడు రాజగోపాల్.

డాక్టరుగారికి చూపించుకోనంది సురేఖ. ఆయన చేతిని విసిరికొట్టింది. ఇందుమించు పట్టబలవంతాన ఆయన పల్సు చూశారు. బి. పి. చూశారు.

చాలా 'హై'గా వుంది. ఇలా వుద్రేకపడటం మంచిదికాదని మందలించారు. ఇంజక్షను యివ్వబోతే - సురేఖ పుచ్చుకోలేదు. పక్కకి పిలిచి - రెండు కాంపోజ్ మాత్రలు పాలల్లో వేసి బలవంతాన తాగించమని సలహా ఇచ్చారు. అరగంటసేపు బతిమిలాడి, బుజ్జగించి, పాలు తాగించాడు రాజగోపాల్. ఓ పావుగంటకి సురేఖ నిద్రపోయింది.

ఆరాత్రి పదకొండుగంటలకి గురువుగారు ఫోన్ చేశారు.

'ఎలావుంది - గొడవచేసిందా?' అడిగారు అవతలనుంచి.

'మీ రెలా వూహించగలిగారు?' ఆశ్చర్యంగా అడిగాడు రాజగోపాల్.

'మీకు సురేఖ ఒక ఫేజే తెలుసు. నిజమైన ఆర్టిస్టులంతా యింతే. సురేఖ హడావుడి చేస్తుందని అనుకుంటూనే వున్నాను.'

'రేపొచ్చి మీతో తగాదా పెట్టుకుంటుందనుకుంటా.'

ఆయన నవ్వినట్లు శబ్దమయింది ఫోన్ అవతలనుంచి. 'నిద్ర పోయిందా?' అడిగారు ఆయనే।

'డాక్టరుగారిని పిల్చాను. కాంపోజ్ పాలల్లో వేసి యిమ్మన్నారు.'

'టూర్స్‌లో యిలాంటివి నాకు బాగా అలవాటే. ఈ పిల్లలంతా - నువ్వెక్కువంటే, నువ్వు ఎక్కువని లడాయి వేసుకుంటూ వుంటారు. మొగవాళ్ళూ ఇంతే. ఒకసారి గజ్జగట్టి వేదిక ఎక్కితే ప్రపంచం తమ పాదాలముందు వుందనుకుంటారు.'

'ఇంట్లో ఎప్పుడూ అలా 'బిహేవ్' చెయ్యదు.'

'నృత్యం అన్నది అన్నిటికంటే, మా ప్రాణంకంటే ఎక్కువయింది. అలా అనిపించనినాడు, నేను స్కూలుపెట్టి యింతమందిని తయారు చెయ్యలేకపోయేవాడిని.'

'సురేఖ, మీరేదో తనని, నెగ్లెక్ట్ చేశారనుకుంటున్నది.'

'తను అన్ని విషయాల్లో నామాట విన్నదా? ఈ నృత్యమే జీవితం అనుకున్నదా?'

రాజగోపాల్ మాట్లాడలేదు. గురువుగారు తనమీద దెబ్బతీస్తున్నారు.

'పర్సనల్‌గా తీసుకోకండి. మీ 'ఇన్‌ఫ్లుయెన్స్' ఒకరంగా మంచిదే అయింది. లేకపోతే చాలా 'హిస్టీరికల్'గా తయారయి వుండేది. ఎంత చెప్పినా పాతికేళ్ళతరువాత లావణ్యం తగ్గుముఖం పడుతుంది' అన్నారాయన, ఈ విషయం రాజగోపాల్ అర్థం చేసుకోవాలన్నట్లు.

'ఐ అండర్‌స్టాండ్....ఇప్పుడు ఏంచెయ్యాలి?'

'ఏమీ చెయ్యొద్దు .... తెల్లవారి మామూలుగా వూరుకోండి – తనే వస్తుంది, మిగతావి నేను చూసుకుంటాను' అన్నారాయన.

సురేఖలోని కొత్త 'ఫేజ్' అర్థం అయినట్లే ఈ గురువుగారిలోని మరోవ్యక్తి అర్థం అవుతున్నాడు రాజగోపాల్‌కి. కరకరమనే కంఠంతో, కఠినంగా మాట్లాడే ఈ గురువుగారు, నాట్యాచార్యుడేకాదు – మానవ స్వభావాన్ని కాచి వడపోసిన వ్యక్తి. సైకాలజిస్టులని మించిపోయాడు.

సురేఖ నిద్రపోతున్నది. ఆమె ముఖం ఎర్రగా కమిలినట్లుంది. బుగ్గలమీద కన్నీటిచారలు యింకా అలానే వున్నాయి. ముఖం కాస్త వుబ్బినట్లుంది. సురేఖని చూస్తుంటే గురువుగా రన్నమాటలు జ్ఞాపకానికి వస్తున్నాయి రాజగోపాల్‌కి. అంతరాంతరంలో ఆయనకి తనమీద జలసీయా? ఆర్టిస్టులకి ఆర్టుతప్ప ఏవిధమైన లాలస వుండకూడదని అర్థంకాబోలు. కాని గురువుగారు పెళ్ళిచేసుకున్నారు! ఆయనకి యిద్దరు పిల్లలు. ఈ నృత్య నికేతనంలో యింతమంది ఆడపిల్లలకు ట్రయినింగ్ యిస్తున్నారు. ఎవ్వరి పట్లా ఆయన మనోవికారానికి లోనుకాలేదా ? ఒక్క అమ్మాయిమీదా ఆయన మనసు లగ్నం కాలేదా ? సురేఖని ఆయన ఎటువంటి దృష్టితో చూసివుంటారు ? కేవలం శిష్యురాలిగానే చూశారా ? లేక, అంతకిమించిన

భావం ఆయనలో అంతర్గతమై వుండివుంటుందా ? ఒక్కక్షణం - అతని గుండెలు ఎర్రగా కాల్చిన యినుపకడ్డీలా, మండినాయి. కాని వెంటనే తనలో తాను నవ్వుకున్నాడు. ఇప్పటికి ఎన్ని లక్షలమంది ప్రేక్షకులు సురేఖ దేహలావణ్యాన్ని - నాట్యవిన్యాసాన్ని చూసి వుంటారు ? ఆ చూసిన క్షణంలో వారి మనసుల్లో ఎటువంటిభావాలు కదలాడి వుంటాయి ? కొందరు కళామూర్తిగా ఆమెని చూస్తే - కొందరు కాంక్షతో ఆమె దేహ లావణ్యాన్ని పరికించి చూసివుంటారు. వారి అందరిమీదా - తాను అసూయ పడి ప్రయోజనం ? అటువంటి జెలసీ తనలో వున్నపుడు - సురేఖ నాట్యప్రదర్శనలు యివ్వలేదు. ఆమె కళాకారిణి. జన్మాంతర సుకృతం వల్ల తనకి లభించిన కళామూర్తి - లావణ్యరాసి. బహుశా గురువుగారు కూడా ఆమె ప్రతిభపట్ల కాంక్ష ప్రదర్శించి వుంటారుగాని - ఆమె స్త్రీత్వం పట్ల అయివుండదు. తన సాంగత్యంతో సురేఖలోని కళాతపస్సు - మరుగు పడిపోతుందని భయపడ్డారా? లేక సురేఖ జీవితంమీద తా నొక్కడికే అధికారము వుండాలని కోరుకున్నారా ? ఏమైనా ఈ గురుశిష్యులమధ్య ఏర్పడిన యీ తగాదాలో తాను తిలదూర్చకూడదు ; వాళ్ళు ఇద్దరూ తేల్చుకుంటారు - అనుకున్నాడు రాజగోపాల్.

రాజగోపాల్ కళ్ళు తెరిచేసరికి పక్కన సురేఖలేదు. ఒక్కసారి అతను భయపడిపోయాడు, ఎక్కడికి వెళ్ళివుంటుంది అని ! కిటికీలోంచి సూర్యకిరణాలు కర్టెనుని చీల్చుకుని మంచంమీద పడుతున్నాయి. తెల్లవారి పోయింది. రాజగోపాల్‌కి బాత్‌రూమ్‌లోంచి పంపుదిప్పిన శబ్దం వినిపిస్తోంది. అతను గబుక్కునలేచి - గాసు వెలిగించి టీకి నీళ్ళు పడేశాడు. ఈమధ్య వుదయంవేళ టీ సురేఖగాని, పనిమనిషిగాని పెడుతున్నారు. పూర్వం ఆ డ్యూటీ రాజగోపాల్‌ది. అతను వుద్యోగంలో చేరాక సురేఖ పట్టుబట్టి మాన్పించింది. కాని ఈనాటికీ - వేడి వేడి బ్లాక్‌టీ స్వంతంగా తయారు చేసుకుని తాగటం అతనికి చాలా యిష్టం. ఉదయంవేళ, చల్లగా

ప్రశాంతంగావున్న ఆ ప్రొద్దుటివేళ పొగలుగక్కే వేడి టీ సిప్ చేస్తూ వుంటే అతనికి బాగుంటుంది. పనిమనిషి చేసినా, సురేఖ చేసినా అంత వేడిగా చెయ్యరు. సురేఖ పొగలుగక్కే టీ తాగదు. అంత వేడి ఆమె భరించలేదు. శరీరచ్ఛాయకు అంత వేడీ పొగలూగక్కే డ్రింక్సు మంచివి కాదని ఎవరో చెప్పారుట.

'స్టవ్' మీద నీళ్ళు పొంగుతున్నాయి. రాజగోపాల్ - టీపొడి వేసి, ఒక కప్పులో రెండు టీస్పూన్స్ తేనె, నిమ్మకాయరసం పిండాడు. మరో కప్పులో పంచదార నిమ్మరసం పిండి, రెండుకప్పుల్లో 'టీ' డికాక్షను వడకట్టి, ఆ రెండుకప్పులూ ట్రేలో పెట్టుకుని, బెడ్‌రూమ్‌లోకి వచ్చాడు. ట్రే బెడ్‌సైడ్ టేబుల్‌మీద వుంచి, పక్కనేవున్న పేపరు చేతిలోకి తీసుకున్నాడు. బాత్‌రూమ్‌తలుపు తెరుచుకుంది. రాజగోపాల్ సురేఖ ముఖంవంక ఆదుర్దాగా చూశాడు. ఆమె రాత్రంత వుద్రేకంగా లేదు, కోపం గానూ లేదు. కాని రాత్రితాలూకు కన్నీళ్ళు - మానసిక ఘర్షణ వడిలిన ఆమె ముఖంలో కనిపిస్తూనే వున్నాయి.

'అరే! నువ్వెందుకు లేచావ్....మంచం కదలకుండా జాగ్రత్తగా లేచానే. మెలకువ వచ్చేసిందా?'

'నిద్దర్లోకూడా నువ్వు పక్కన లేకపోతే వుండలేనన్న మాట-'

'కలలోన - నా ఎంకి' కూనిరాగం తీస్తున్నాడు రాజగోపాల్.

'సంతోషించాలే - కవిత్వం వెలిగిస్తున్నావే. నువ్వు తాగెయ్యి. ఆ మరిగే టీ నేను తాగలేను బాబూ' అంది సురేఖ గారాలుపోతూ.

రాజగోపాల్ కప్పులోని టీ సాసర్‌లోకి వంచి 'నువ్వు పూర్వ జన్మలో పిల్లివి. అందుకని నీకు కప్పులోంచి తాగటం చేతకాదు' అన్నాడు నవ్వుతూ.

'సాసర్లోంచి పిల్లులుతప్ప మనుషులు తాగరా ? కుక్కలు కూడా తాగుతాయి. గోపీ మనమో కుక్కని పెంచుకుంటే'

'ఒద్దు' అన్నాడతను గభాలున.

'ఏం ? '

'కుక్కని పెంచుకుంటే – ముఖ్యంగా నీలాంటి ఆడవాళ్ళు – బొచ్చు కుక్కని 'లావ్ డాగ్'ని పెంచుకుంటే .... '

'ఊఁ .... '

'దాన్ని వొళ్ళో కూచోపెట్టుకుని ముద్దులాడలాడి గారంచేసి – నా సంగతి మర్చిపోతావు.'

'నువ్వు – కుక్కా సమానమా?'

'ప్రేమ ఎవరిమీద చూపిస్తున్నావనికాదు, నీ ప్రేమ యింక దేనిమీద చూపించకూడదని. ఇక్కడ కుక్కా, మనిషీ అన్న సామ్యంవిషయంకాదు నేను చెప్పేది' అన్నాడతను.

ఆరోజు ఆదివారం. రాజగోపాల్ యింట్లోనే వుంటాడు. సాధారణంగా ఆదివారాలయితే – సురేఖకి డాన్సుప్రోగ్రామ్సు, టూర్సు లేకపోతే – సినిమాకు వెళ్తూంటారు. గుళ్ళోకి వెళ్ళినపుడు సురేఖ దేముని సమక్షంలో కంటే విమానంచూస్తూ ఎక్కువ సమయం గడుపుతుంది. ఆలయంలోవున్న శిల్పాలని, గాలిగోపురంమీదనున్న శిల్పాల్ని చూస్తూంటుంది. అటువంటపుడు ఆమె ఆ శిల్పాలలోని నాట్యభంగిమలు పరిశీలిస్తూ వుంటుందని రాజ గోపాల్‌కి తెలుసు. అతనూ పక్కన నుల్చుని చూస్తూంటాడు. ఈరోజు సురేఖ 'ఎక్కడి కెడదామంటుందా ? రాత్రి సంఘటన యింకా సాగ దీస్తుందా ? ' అని ఆలోచిస్తున్నాడు రాజగోపాల్.

'గోపీ, ఇవ్వాళ హోటల్లో భోంచేసి మాటినీ సినిమాకి వెళ్ళిపోదాం. ఇంట్లో వంటలేదు' అంది సురేఖ.

'ఏం ? '

'పనిమనిషి రానంది. దాని మొగుడికి వంట్లో బాగోలేదట'

'ఓ.కె. మరి యిల్లు - క్లీనింగూ వగైరా' అడిగాడు రాజగోపాల్.

'దాని చెల్లెల్ని పంపుతానంది. చిన్నపనులు చేసి వెళ్ళిపోతుంది.'

'నే నెప్పుడూ సండే అవుటింగ్‌కి రెడీ' వుత్సాహంగా లేచాడు రాజగోపాల్ ట్రే వంటయింటోకి తీసుకెళ్ళటానికి.

సురేఖ నికేతనంమాట ఎత్తలేదు. అతను అడగలేదు. స్నానాదులు అయాక, ఒకగంటసేపు నికేతనానికి వెళ్ళివస్తానని బయలుదేరింది. రాజగోపాల్‌కి 'బస్ మెన్స్ - హాలీడే' జ్ఞాపకంవచ్చి నవ్వుకున్నాడు. బస్ డ్రైవర్లూ - కండక్టర్లూ 'హాలీడే' కావాలని సమ్మెలూ, పోరాటాలూ జరిపి, తీరా ఆ శలవురోజున బస్‌రోజున బస్ డిపోకెళ్ళి కబుర్లు చెప్పుకుని, బస్‌లో ఫ్రీగా ఒకసారి తిరిగొస్తారట. రోజూ యీ బస్సులో తిరిగి - విసుగ్గా వుంది. ఒక్కరోజు శలవుగావాలి' అని ఆందోళన చేసిన ఈ మనుషులు తీరా, ఆ ఒక్కరోజు యింట్లో కూచోలేరట. మనిషి అలవాటుకి బానిస. సురేఖ ఈ నృత్య నికేతనానికి వెళ్ళకుండా వుండలేదు. వెళ్ళి గురువుగారితో దెబ్బలాడుతుందా ? రాత్రి పరిస్థితిలో సురేఖ ఆయనతో తగాదాలు ఆడుతుంది ; నికేతనంతో తెగతెంపులు చేసుకుంటుంది అని భయపడ్డాడు. కాని ఈ వుదయం అటువంటి భయం కలగడం లేదు. సురేఖ గొడవచేయదని అనిపించింది అతనికి.

పదకొండింటివేళ సురేఖ నికేతనాన్నించి వచ్చింది. ఆమె ముఖం మామూలుగా ప్రశాంతంగా వుంది. 'హమ్మయ్యా' అనుకున్నాడు రాజగోపాల్.

కాని సురేఖలో ఒకరకమైన అశాంతి - చికాకు పెరిగిపోతున్నాయి. మనసులో ఏదో ఒక వెలితి - ఆమె మాటల్లో కనిపిస్తున్నది. ఇంతవరకూ లేని అసంతృప్తి ఆమెలో చోటుచేసుకుంటున్నది.

ఆమె మామూలుగా ప్రదర్శనలకి వెళ్తోంది. ప్రదర్శనలనుంచి వచ్చాక పూర్వపు విశ్వాసం, సంతోషం కనిపించడంలేదు రాజగోపాల్‌కి. ఒక్కొక్కసారి విపరీతమైన కోపంతో ఝంఝామారుతంలాగా ఇంటికి వచ్చేస్తూండేది'

'ఏం జరిగింది ? - ఎందుకింత 'అన్‌హేపీ'గా అవుతున్నావు ! పోనీ ఆ నాట్యం మానెయ్యరాదా?' అడిగాడు ఒకరోజున రాజగోపాల్.

సురేఖ తాటిప్రమాణాన లేచింది.

'నువ్వెవరు చెప్పటానికి? నేను ఎవరు చెప్పినా వినను. నా యిష్టం - గురువుగారు చెప్పినా వినను. ఆరోజులు పోయాయి.'

రాజగోపాల్ మాట్లాడలేదు. ఈమాట యింకోరు అనివుంటే - అతనికి విపరీతమైన కోపం వచ్చి వుండేది. సురేఖ ఏమాట అన్నా, ఏం అడిగినా అతనికి కోపంరాదు. ఇది బలహీనత కావచ్చు. మానసికశక్తి కావచ్చు.

'నాతో సమంగా దానికీ మూడు అయిటమ్స్ యిస్తారా - నేను, అదీ సమానమేనా?' అడుగుతోంది.

గురువుగారి కొత్త శిష్యురాలు - అంటే ఆయన అభిమానాన్ని యిప్పుడిప్పుడే పొందటంచేత ఆ అమ్మాయిని కొత్తశిష్యురాలు అంటూంటారు అందరూ. ఆ కొత్తశిష్యురాల్ని సురేఖ పేరుపెట్టి పిలవదు. 'అదీ - యిదీ' అని ఏకవచనప్రయోగం చేస్తుంది. మిగతా అందరిపట్లా ఎంతో నాగరికంగా ప్రవర్తించే సురేఖ ఆ పిల్లపట్ల చాలా తేలిగ్గా అప్పుడప్పుడు క్రూరంగాకూడా వుంటూంటుంది. ఈ విషయం రాజగోపాల్‌కి తెలుసు.

ఒకసారి ఈ యిద్దరినీ - శకుంతలా దుష్యంతులుగా ఒక అయిటమ్ తయారుచేసి - ప్రదర్శింపచేశారు గురువుగారు. ఆరోజు సురేఖ దుష్యంతుడు,

ఆ కొత్తపిల్ల శకుంతల. రిహార్సల్సులో బరువుగా - కొస్త నెమ్మదిగా స్టెప్స్‌వేసిన సురేఖ - వేదికమీద విపరీతమైన వేగంతో అడుగులువేసింది. ఆమె అభినయం, ఆ పదముల వేగం వీటికి ఆ చిన్నపిల్ల అందుకోలేక పోయింది. ఆరోజు ప్రేక్షకుల కరతాళధ్వనులన్నీ - సురేఖ వొడిలో వేసుకుని విజయగర్వంతో యింటి కొచ్చింది. మరునాడు గురువుగారు బాగా చివాట్లు వేశారుట. 'చిన్నపిల్లని - అలా చెయ్యొచ్చా?' అని. ఇటువంటి సంఘటనలు నిత్యకృత్యం అయిపోయాయి రాజగోపాల్‌కి. అతను వింటూ వూరుకున్నాడు.

'అదీ - నేను ఒక ప్రదర్శనలో వుండటానికి వీల్లేదని చెప్పేస్తాను- కావాలంటే, దాని ప్రోగ్రామ్ విడిగాపెట్టుకోమంటాను. కావాలని డయాస్ మీద మా యిద్దరినీ ఎక్కించి, అది చిన్నది - నేను ముసలిదాన్ని అని చూపించాలని - కావాలని చేస్తున్నారు' కీచుగా అరుస్తోంది సురేఖ.

రాజగోపాల్‌కి యీ కొత్త సురేఖ ఒక సమస్యగా తయారయింది. ఈ సురేఖ ఏరోజు కోపంగా వుంటుందో, ఏనాడు ప్రసన్నంగా వుంటుందో తెలియటం లేదు. 'వెదర్ రిపోర్టు' లాగా - కోపంగా వస్తుంది అనుకున్న రోజు సంతోషంగా యింటికొచ్చేది. అంతా మామూలుగా వుంది, పరవాలేదు అనుకుంటే విపరీతమైన కోపంతోనో, వెక్కి-వెక్కి- ఏడుస్తూనో కూచుని వుండేది.

సురేఖ మనసుని - నాట్యంవైపునుంచి మరోవైపుకి తిప్పాలి. జీవితం అంటే - తనూ, నాట్యమూ - ఈ రెండే అనుకుంటున్నది. ఇంతకంటే విస్తృతమైన జీవితం వుంది అని చెప్పాలి - అనుకుంటూ వుండేవాడు రాజగోపాల్. అతనికి ఆఫీసులో పని వత్తిడి ఎక్కువ అవుతూ వుంది. తెలివిగలవాడూ, సమర్థుడూ మాటకారీ అని పేరుబడటంతో, రెండేళ్ళలోనే ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ అయ్యాడు. కంపెనీవాళ్ళు కారు ఇచ్చారు. సురేఖ కలలుకన్నటువంటి కారూ, తలుపుతీసి పట్టుకునే డ్రైవరు

లభించాయి. ఇల్లుకూడా కంపెనీవాళ్ళు యిచ్చారు. విశాలంగా – ఆధునికంగా వున్న ఎపార్ట్‌మెంట్ ఎలాట్ చేశారు. అతనికి జీతం రెండున్నర వేలు వస్తున్నది. కాని, సురేఖలోని ఈ అశాంతికి, అలజడికి అతను మందు కనుక్కోలేకుండా వున్నాడు.

రాజగోపాల్ పెద్ద వుద్యోగంలో వున్నాడని తల్లిదండ్రులకి తెలుసు. భార్యకీ తెలుసు. అతను ఎగ్జిక్యూటివ్ పోస్టులోకి వచ్చాక – సురేఖే అంది. కృష్ణవేణికి – నెలనెలా కొంతడబ్బు పంపితే బాగుంటుందని!

రాజగోపాల్‌కి తన వాళ్ళగురించి ఆలోచనలు వచ్చేవికావు. అది యింకో జన్మలో జరిగిన అనుభవంలాగానూ, క్రిందటి జన్మలోని బాంధవ్యాలు గానూ, అనిపించేవి. వారి జ్ఞాపకాలుగాని, ఆలోచనలుగాని వచ్చేవి కావు. అతని హృదయమంతా సురేఖతోనే నిండివుంది. అందులో ఎవ్వరికీ చోటు లేదు.

'మనకి బాగానే డబ్బొస్తున్నది. అక్కగారికి నెలనెలా పంపుదాం' అంది సురేఖ ఒకరోజున. రాజగోపాల్‌కి యీ వరసలూ అవీ తమాషాగా వున్నాయి. అతని దృష్టిలో కృష్ణవేణి కృష్ణవేణే – సురేఖ సురేఖే. ఇద్దరికీ ఎటువంటి సంబంధమూ లేదు.

'వాళ్ళకి డబ్బు అవసరంలేదు. అడక్కుండా ఎవరికీ సాయం చేయ కూడదు' అన్నాడు రాజగోపాల్.

'ఇది సాయంకాదు. మీ బాధ్యత'

'నాకు ఎవరిపట్లా బాధ్యతలేదు. ఒక్క నువ్వుతప్ప – ఎవరి రెస్పాన్సిబిలిటీ నాకు లేదు'

'సీతపట్లకూడా ? '

'ఉహూ – 'లేదు' అన్నాడతను.

ఆ కంఠంలో తడబాటు లేదు. చాలా దృఢంగావుంది కంఠం.

'మీకు మోరల్‌గా - రెస్పాన్సిబిలిటీ వుంది.'

'నేను మోరలిస్టుని కాదు - ఇమ్మోరల్‌గా బతికేవాడిని'

'ఎవరికీ కాదుగాని - అక్కగారికి నెలకి రెండువందలు పంపండి'

'ఇందులో నా ప్రమేయం ఏమీలేదు - ముందే చెప్పేస్తున్నాను. నువ్వు పంపు అంటే, పంపుతాను. వ్యక్తిగతంగా నాకు ఎటువంటి 'ఎటాచిమెంటూ' లేదు - అది నువ్వు క్లియర్‌గా తెలుసుకో'

'ఎందుకు చెపుతున్నావు, గోపీ ! నీ సంగతి నాకు తెలియదా ? ' అడిగింది సురేఖ పల్చబడిపోతున్న అతని తల వెంట్రుకలు సవరిస్తూ.

'నా గురించి నీకు తెలుసు. కాని నీ గురించి, నాకు తెలియదు'

'అదేమిటమ్మా - అలా అంటున్నావు'

'నిజంగానే. నీకింత జెలసీ అనీ, వేదిక ఎక్కాక తోటి డాన్సరుని ఏడిపిస్తావనీ నాకు తెలియదు'

'నువ్వా అలాగే అంటున్నావా ? నాకు జెలసీయా ? దాన్నెవర్నో చూసి నాకు జెలసీయా ? ' సురేఖ తన్నెవరో తిట్టినట్లు - తవ్వుకు తవ్వుకు ఏడవడం మొదలుపెట్టింది.

నేను పొరబాటు చేశాను. ఆ విషయం ఎత్తకుండా వుండాల్సింది. అనుకున్నాడు రాజగోపాల్.

ఆమెను వూరుకోబెట్టడానికి 'నీకు - ఆ బందరువాళ్ళమీద - సానుభూతి వుందిగాని - వాళ్ళు నిన్ను తిట్టుకోరా ? ' అడిగాడు ఆమె ఆలోచనలు మరోవిషయంమీదకి తిప్పటానికి.

'వాళ్ళు తిట్టుకోడం సహజంకదా ! చూడు, నీవైపు మరోఆడది కళ్ళెత్తి చూసిందనుకో - దాని కళ్ళు పీకేస్తాను - పీక నులిమేస్తాను' శివతాండవంలోని భీకరమూర్తిలాగా - డమరుకం తిప్పుతున్నట్లు చేతులు ఆడిస్తూ చెప్పింది.

ఫక్కున నవ్వాడు రాజగోపాల్. వాతావరణం మళ్ళీ మామూలు కొచ్చింది.

'నెలకో రెండువందలు పంపు'

'నేను పంపను. నువ్వే పంపు' అన్నాడు రాజగోపాల్.

'నేను పంపితే – తిప్పికొడతారేమోనని' సంశయంతో ఆగిపోయింది. 'అయిదునిముషాల ముందు ఆదిశక్తి. మరుక్షణంలో పిరికిమనిషి' అనుకున్నాడు రాజగోపాల్.

'అయితే పి. ఎ. కి చెపుతాను. అతను పంపేస్తాడు – మళ్ళీ చెపుతున్నాను. నువ్వు పంపమన్నావని పంపుతున్నాను. ఇందులో నా ప్రమేయం ఏమీలేదు.'

'కాయితం రాసివ్వమన్నావా?'

'అదీ మంచిదే అనుకుంటా. ఎందుకంటే ఏదో ఒకరోజు నీకు కోపంవచ్చి, ఎదురుగుండా ఎవరూ లేకపోతే నా పీక నులుముతావని భయంగా వుంది' అన్నాడు అతను.

'నిజమే గోపీ, నాకెందుకో యీమధ్య కోపం ఎక్కువయిపోతున్నది. ఏదో అశాంతి. పూర్వం యిలా వుండేదికాదు.'

'ఎందుకో చెప్పనా?'

'చెప్పు.'

'నాలుగుపేళ్ళు లోపలికి పోతున్నాయి. ఇదివరకయితే నా చదువు అంటూ నీకు ఒక ఆశయం వుండేది – దానికోసం ప్రయత్నం వుండేది. ఇప్పుడు అవేంలేవుగా !'

'అయివుండచ్చు. అదొక్కటే కాదనుకుంటా. మా గురువుగారు చేసిన అన్యాయం – నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నది. ఎట్లాగైనా నా గొప్పతనం నిరూపించుకోవాలి.'

'నువ్విప్పుడు గొప్పదానివికాదా? ఎన్నిదేశాలో తిరిగి ప్రదర్శన లిచ్చావు. తెలుగువారిలో డాన్సరు అంటే నిన్ను ముందు చెప్పుకుంటారు. సన్మానాలూ, సభలూ, బిరుదులూ అన్నీ సంపాయించావు.'

'అవుననుకో. ఇవన్నీ గురువుగారు తనవల్ల వచ్చాయను కుంటున్నారు. ఏ పిల్లని తీసుకొచ్చి యీమాత్రం శిక్షణ యిచ్చినా, గొప్ప డాన్సరు కాగలదు అంటారు. కోతినికూడా మాకంటే అందంగా ఆడించగలరట.'

'అది మీమీద కోపంవల్ల అనటంకాదు. మీరూ బాగా చెయ్యాలనీ - యింకా మీ విద్యకు పదును పెట్టాలనీ అంటూంటారు. ఇన్నేళ్ళయినా ఆయన నీకు అర్థం కాలేదా?'

'ఆ విషయం కాదనను. కాని మేము వుత్త మట్టిబొమ్మలం అని అంటున్నపుడు మాకూ వ్యక్తిత్వం వుందని - నిరూపించుకోవాలనిపిస్తుంది.'

'ఏం నన్నింతవాడిని చేసి నీ ప్రత్యేకత నిలబెట్టుకోలేదా?'

'నువ్వు చాలా తెలివయినవాడివిట. డబ్బుకేముంది, ఎవరైనా సంపాయించవచ్చు. తెలివితేటలూ, స్వతస్సిద్ధమైన కళాభినివేశం ఇవి పుట్టుకతో రావాలిట.'

'నాగురించి నీతో మాట్లాడుతుంటారా?'

'మొదట్లో చాలా సైలెంటుగా వుండేవారు. ఇంట్లో నేనుగాక మరో మనిషి వున్నట్లుకూడా గుర్తించనట్లు మాట్లాడేవారు. కాని ఈమధ్య నీగురించి చాలా పొగుడ్తూ వుంటారు.'

'బాగా సంపాయిస్తున్నాననా?'

'ఛీ - ఛీ అదికాదు. నీలో ఏదో ప్రత్యేక లక్షణా లున్నాయిట.'

'అంటే ?'

'అందరూ నీమాదిరి మనసుకి నచ్చినవి చెయ్యలేరుట. నీలాంటి తెగువ అందరికీ వుండదుట.'

'అయితే నీకు యింకా ఏంకావాలి_ఏంచేస్తే నీ అశాంతి పోతుంది?'

'నాకే తెలియటంలేదు. గోపీ, ఒకవిషయం అడుగుతాను, నవ్వవు కదా?'

రాజగోపాల్ క్షణం కంగారుపడ్డాడు. ఏమడుగుతుంది? కొంపతీసి పిల్లల్ని కంటానంటుందా? ఉన్న సమస్యలుకాక కొత్తవి సృష్టించుకున్నట్లు అవుతుంది. గురువుగారికి పోటీగా ఇంకో స్కూలు పెడతానంటుందా?

'ఏమిటి చెప్పు.'

'నేను ప్రయిపేటుగా బి. ఎ. చదువుతాను.'

'దేనికి? ఇప్పుడు డిగ్రీ లెందుకు కావాల్సివచ్చాయి.'

'చెబితే నవ్వకేం! మా గురువుగారికి ఇంగ్లీషు అంత బాగారాదు, ప్రతిదానికీ ఆ మళయాళీ డాన్సరుమీద ఆధారపడతారు. ఆ అమ్మాయి బి. ఏ పాసయింది....'

'అంటే ఆవిధంగా ఆయన నీమీద ఆధారపడాలంటావ్?'

'అదికాదు. నాకు కాలక్షేపంగా వుంటుంది. ఇక ప్రోగ్రామ్సు తగ్గించుకోవాలనుకుంటున్నాను.' అంది సురేఖ.

'ఎంచేత?'

'నా ప్రత్యేకత లేనపుడు – గురువుగారి ట్రూప్‌లో నేను ఒకదాన్ని అనిపించుకోడం ఇష్టంలేదు.'

'సురో....నీ ఆలోచన సరిగ్గాలేదు. గురువుగారిమీద కోపంతో నీ ప్రోగ్రామ్సు మానుకోడం?'

'ఆమాట ఎవరన్నారు?' కయ్యిన లేచింది సురేఖ.

'నీ యిష్టం. చదువుకుంటానంటే నేను వద్దు అనను. నువ్వు ఏం చేసినా నాకిష్టమే. ఎటొచ్చీ నువ్వు 'హాపీ'గా వుండాలని నా కోరిక.'

'ఇప్పుడు హాపీగా లేనా?'

'ఇంకా ఇంకా ఎంతో సంతోషంగా వుండాలి. నీకు ఎటువంటి కష్టం తోచకూడదు.'

'గోపీ, నాకు ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళాలంటే సిగ్గుగా వుంది.'

'ట్యూషన్ పెడతాను. నువ్వు స్కూల్ ఫైనల్ పాసయ్యావుకదూ?'

'ఎప్పుడో పదేళ్ళయింది. యస్. యల్. సి. బుక్ ఎక్కడుందో వెతకాలి.'

'వెతుకు - పుస్తకాలు తెప్పిస్తాను. ఉదయం నికేతనానికి వెళ్ళు. మధ్యాహ్నం చదువుకో. సాయంత్రం నాతో బయటకి రా. రాత్రి....' ఆగిపోయాడు రాజగోపాల్.

'వెధవ అల్లరీ నువ్వూను. గోపీ నువ్వే ఒకప్పుడు చిన్నపిల్లాడిలా వుంటావు. మరో అప్పుడు నువ్వూ గురువుగారితో కలిసి నన్ను విమర్శిస్తున్నట్లు మాట్లాడుతావ్' అంది సురేఖ సంతోషంగా.

ఈ సంభాషణ అయిన మూడోరోజున రాజగోపాల్ తల్లికి జబ్బుగా వుందని వుత్తరం వచ్చింది. రాజగోపాల్ ఆఫీసులో వుండగానే ఆ జాబు వచ్చింది. వుత్తరం చూసుకుని అతను చాలాసేపు అలా కూచుండిపోయాడు.

తమ యింట్లో నోరూ వాయీ లేని జీవి తన తల్లి. మామ్మ వున్నన్నాళ్ళూ తల్లిని నల్లిలాగా కాలికిందవేసి నలిపింది. ఆ తరువాత బహుశా తన మూడో చెల్లెలు మామ్మ డ్యూటీ పుచ్చుకుని వుంటుంది. దాని నోరు చాలాపెద్దది. గజన్నర నాలిక అనేవారు చిన్నప్పుడే.

ఆరేళ్ళకి రాజగోపాల్‌కి తొలిసారి తనవారిపట్ల కాస్త సానుభూతితో ఆలోచనలు వచ్చాయి. పూర్వమంత కోపమూ, పట్టుదలా తగ్గినాయి. తల్లిని చూడటానికి వెళ్ళాలా, వద్దా అని వూగిసలాడుతున్నాడు. ఆ మూడోరోజున మళ్ళీ ఒక వుత్తరం, వెంటనే టెలిగ్రామూకూడా వచ్చాయి - తల్లికి చాలా సీరియస్‌గా వుందని. ఆరేళ్ళ అనంతరం రాజగోపాల్ గుడివాడకి ప్రయాణం అయాడు.

# 7

సర్కార్ఎక్స్‌ప్రెస్ పరుగు పెడ్తూన్నాననుకుంటూ – పాసింజరులాగా ఆగుతూ ఆగుతూ వెళ్తోంది. రాజగోపాల్ 'లో-కూపె'లో పడుకుని వున్నాడు. రెండో బెర్త్‌లో ఎవ్వరూలేరు. అతను స్లీపర్‌లో వెళ్తానంటే సురేఖ వొప్పుకోక ఫస్ట్‌క్లాస్ టికెట్ తెప్పించింది. ఈ దర్జాలూ–స్టేటస్ సింబల్సూ ఆడవాళ్ళకి ఎక్కువగా వుంటాయా? ఆరేళ్ళక్రితం చిన్న సూటుకేసుతో, రెండు జతల బట్టల్తో మద్రాసు సెంట్రల్‌లో దిగాడు తను. ఆ తరువాత తన బట్టలదగ్గిరనుంచి, చదువుదాకా ఇంచుమించు తన ప్రతి చిన్న అవసరాన్ని గుర్తించి అడగకుండా అన్నీ తనే సమకూర్చేది సురేఖ. ఈనాడు తను బజారుకెళ్ళి బట్టలు కొనుక్కోలేడు. కొనుక్కోటం మర్చిపోయాడు. తనకి ఎటువంటి బట్టలు కావాలో సురేఖ ఎన్నికచేసి తీసుకొస్తుంది. కొట్లో తను పక్కన నుల్చుంటాడు. 'ఇది బాగుందా?' అని అడిగి తనకి నచ్చితే జవాబుకి ఎదురుచూడకండానే కొనేస్తుంది సురేఖ. పర్సు తన జేబులోవున్నా – ఆమె యిష్టాయిష్టాలమీదనే తన బట్టలు సెలక్టు చెయ్యడం అవుతుంది. 'ఆఫ్టర్ షేవ్ లోషన్ రాచుకుంటే బాగుంటుంది – ఓల్డ్ స్పయిన్‌కంటే, యార్డ్లీ పౌడరు బాగుంటుంది. ఈ ఇంపోర్టెడ్ లోషన్ చాలా మంచిదిట' అంటూ టూర్సునుంచి వస్తున్నపుడు తనకోసం ఎన్నో టాయిలెట్ సామాన్లు తీసుకొస్తుంది. ప్రింటెడ్ లుంగీలు బాగుండవు, నువ్వు గళ్ళలుంగీలు కట్టుకో – నైట్‌డ్రస్ బాగోదు. సినిమాలో హీరోలాగా ఆ నైట్‌డ్రస్ ఏమిటి?' అంటూ గళ్ళలుంగీలు కట్టుకోమంటుంది ఇంట్లో వుంటే!

చదువు విషయం ఆమె పరిధికి అందని సంగతి అవటంచేత - పుస్తకాలూ, కాలేజీ ఈ విషయాలకి దూరంగా వుండేది. అయితే తను చదువుకునేగది బెడ్‌రూమ్‌కి పక్కనవున్న చిన్నగది - అది సురేఖ తల్లి పూజగదిగా వాడేదిట - అందులోని దేముడి మందిరాన్ని గూట్లోకి బలవంతాన సర్ది - మిగతా సామానంతా తీసేసి స్టడీగా మార్చింది. కిటికీలో టేబుల్‌ఫాన్ - పక్క టేబుల్ వగైరా అమర్చింది. ఆ గదిలో దుమ్ముపడకుండా - పుస్తకాలు చిందర వందరగా లేకుండా సర్ది వుంచడం - సురేఖ స్వయంగా చేస్తూండేది. ఆపనికి, పనిమనిషిని రానిచ్చేది కాదు.

తను చదువుకున్నంతకాలం - సురేఖ ఎంత పొదుపుగా వుండేదో - తనకీ, భగవంతుడు అనేవాడు వుంటే - వాడికిమటుకే తెలుసు. స్త్రీ సహజమైన అలంకార ప్రియత్వాన్నికూడా వదిలేసింది. వందరూపాయలు యిచ్చి చీరెకొంటే డబ్బు వొక్కసారి యివ్వాల్సివస్తుందని. నెలకి పదేసి రూపాయలు చీటీకట్టి - చీరెలు కొనుక్కునేది. నాట్యప్రదర్శ కెళ్ళినపుడు ఎవరేనా బహుమతిగా యిచ్చిన - పట్టుచీరెలుతప్ప ఆమె ఏనాడు తన డబ్బుతో ఖరీదైన చీరె కొనుక్కోలేదు. తను చదువుకుంటున్న అయిదేళ్ళలో - మరీ అవసరం అయితేతప్ప సురేఖ టాక్సీ ఎక్కేదికాదు. టూర్స్‌కి వెళ్ళినా, ప్రోగ్రామ్స్‌కి వెళ్ళినా గురువుగారి వాన్ వుండేది. స్వంతానికి అన్నపుడు ఎంతసేపయినా బస్సులకి పడిగాపులుపడి నిల్చోవాలే తప్ప - టాక్సీగాని, ఆఖరికి ఆటోగాని ఎక్కడానికి వొప్పుకునేదికాదు. డబ్బు అంతా తనచేతికి వొప్పజెప్పినా - సురేఖ పక్కనగనక వుంటే ఖర్చు చెయ్యటంలో ఆమె 'చాలా ఖచ్చితంగా వుండేది. ఆ క్షణాన సురేఖ పిసినిష్టితనానికి చికాకు కలిగినా - ఎవరికోసం? ఎవరికోసం యింత పొదుపుగా వుంటోంది' అన్న ఆలోచన వచ్చి సర్దుకునేవాడు.

అటువంటి సురేఖ ఈనాడు తను ఫస్ట్‌క్లాస్‌లోగాని వెళ్ళటానికి వీల్లేదని టికెట్ తెప్పించింది ట్రావెల్ ఏజెంటుకు ఫోన్‌చేసి। వెయ్యి రూపాయలు పర్సులో పెట్టింది – ఖర్చులకి కావాల్సివస్తుందని। తనకి ఎలా ప్రయాణం చేసినా ఒకటే. కాని సురేఖకి అలాకాదు. తన్ని ప్రయోజకుడుని చేసి తనవాళ్ళదగ్గిరకి పంపుతున్నది – అటువంటప్పుడు తను దర్జాగా వెళ్ళాలి. రాజగోపాల్‌కి నవ్వుగా వుంది. తను ఏ క్లాసులో వచ్చాడన్నది ఎవరు చూస్తారు? ఇదేం ప్రదర్శనా? స్టేషనుకొచ్చి స్వాగతంయిచ్చే అభిమానుల సంఘమా? తల్లికి జబ్బుగా వుంది. అసలు పరిస్థితి ఎలా వుందో ? అలాంటప్పుడు తను ఎలా ప్రయాణం చేస్తేఏం – కాని సురేఖకి ఇవి చెప్పినా అర్థం అవవు. పైగా కోపం తెచ్చుకుంటుంది. ఆమెకి ఎలా బాగుంటే అలా చెయ్యటంలో సుఖం వుంది.

రైలు మందంగా నడుస్తున్నది. రాజగోపాల్‌కి కళ్ళు మూతపడటం లేదు. పెట్టెలో దీపం డిమ్‌గా వెలుగుతూ వుంది. చదవాలని అనిపించటం లేదు. అందరికీ తల్లి అంటే, ప్రత్యేకమైన ప్రేమ వుంటుందంటారు. మాతృప్రేమకంటే పవిత్రమైనది, ఉన్నతమయినది ఏదీ లేదంటారు. కాని తనకి భావాలు కలగటంలేదేం?

చిన్నప్పటినుంచి – పాలుతాగే వయసులో ఏమోగాని – అతి బాల్యంనుంచీ తనకి మామ్మ వడితప్ప, తల్లివడి జ్ఞాపకంలేదు. మామ్మ గుండు మీదనున్న బట్టలాగేసి, ఆమె బోడితలతో ఆడుకునేవాడు చిన్నపుడు. ఒకరోజు చలిమిడిముద్దలాగానూ, ఆ తరువాత కరకరమనే వుండలాగానూ, ఆపైన ముళ్ళబంతిలానూ వివిధావస్థల్లో వుండేది మామ్మతల. బాల్యంలో ఏడెనిమిదేళ్ళు వచ్చేదాకా తను, దినం దినం మారే మామ్మ తలతో ఆడుకునేవాడు. ఇంట్లో ఎవరన్నా వుంటే తను బుర్రమీద చెంగు తీసేస్తే – మామ్మ కోప్పడేది.

'ఏఎటా పెధవ ఆటలూ నువ్వూను. తప్పమ్మా' అంటూ తలమీద చెయ్యి లాగేసి ముసుగు సవరించుకునేది. బయటవాళ్ళు ఎవరూ లేకపోతే తను మామ్మ వీపుమీద ఎక్కి ఆమె తల వంచేసి – గంటలు గంటలు ఆడుకునేవాడు. మధ్యాహ్నంపూట తలకింద దిండుపెట్టుకుని మామ్మ పడుకునేది – అన్నాలు తిన్నాక! అలాంటపుడు, ఆమె పొట్టకు కరుచుకు పడుకుని, కథలు చెప్పమనేవాడు. మామ్మ పెళ్ళికి తనుకూడా పల్లకిలో కూచున్నానని – ఆరోజుకూడా తను గుండుతో ఆడుకునేవాడిననీ చెప్పేవాడు. 'అప్పటికి నువ్వు పుట్టలేదురా' అంటే పెద్దపెట్టున ఏడ్చేవాడు. అందుకని మామ్మ తన పెళ్ళిలో యీ ముద్దుల మనుమడు పల్లకిలో కూచుని తన గుండుతో ఆడుకుంటూ పూరేగాడని ఒప్పుకునేది. అప్పుడుగాని ఏడుపు ఆగేదికాదు,

రాజగోపాల్ తనలో తాను నవ్వుకున్నాడు. బాల్యం ఎంత విచిత్ర మైంది? తన వూహలు ఎంత అసందర్భంగా వుండేవి. చాలారోజులు పెద్దయాక, యీ మామ్మనే పెళ్ళి చేసుకోవాలి – అనుకునేవాడు. తన బాల్యంలో మామ్మకి అటువంటి ముఖ్యమైన స్థానం వుండేది. అంతటి ప్రేమాస్పదురాలైన మామ్మ తన జీవితాన్ని మూడేళ్ళపాటు నరకప్రాయం చేసింది. ఆఖరిరోజుల్లో – మామ్మ చివరిరోజుల్లో తనకి ఆ ముసలిదానిమీద ప్రేమకాదుగదా – సానుభూతికూడా వుండేదికాదు. ఒకరకమైన వుదాసీనత కలిగింది. బహుశా తన వుదాసీతనవల్లనే ఆవిడ త్వరగా చచ్చిపోయిందా? ఉహూం. ఆమెలో అంతటి 'సెన్సిటివ్‌నెస్' వుంటే తన మెడలువంచి – పట్టబలవంతాన పెళ్ళిచేసి వుండేదికాదు. మనుమరాలు కలిగింది – అన్న తృప్తితోనే కళ్ళుమూసింది.

రాజగోపాల్ ఆలోచనలు తల్లివైపు తిరిగినాయి. తమ యింట్లో తన తల్లికి ఏనాడూ పెద్దవిలువ వుండేదికాదు. తన బాల్యం, చదువు యివన్నీ మామ్మ చూసుకునేది. ఆఖరికి 'పెన్సిల్, రబ్బర్' నుంచి, కాలేజీ ఫీజుదాకా

మామ్మ నడిగేవాడు - మామ్మ యిచ్చేది. అమ్మని ఏమీ అడగాల్సిన అవసరం వుండేదికాదు. 'అమ్మా - నాకు ఇది కావాలి' అని అడిగే సందర్భం తనకి ఒక్కసారికూడా రాలేదు. ఆఖరికి తన బలవంతపు పెళ్ళిలో కూడా - 'అమ్మా - నాకీ పెళ్ళి యిష్టంలేదు' అని తను తల్లితో చెప్పలేదు. తల్లిని తనవైపుకి తిప్పుకోవాలని ప్రయత్నించనూలేదు. బహుశా తల్లి మాటకు తాను పెద్ద విలువ యిచ్చి వుండలేదేమో. ఇంట్లో అందరితోపాటు తనూ - తన తల్లిని ఉపేక్షచేశాడా? ఆమె తన యీ ఉపేక్షకి బాధపడి వుంటుందా? లేక అత్తగారి కోడంటికంలాగానే - ఈ కొడుకూ దూరంగా వుంటం సహజమని సర్దుకుని వూరుకుందా!

తన తల్లి సన్నగా, పీలగా వుంటుంది. ఆరుగురిని కన్నతల్లి - ఎప్పుడూ వంటయింట్లో వండటం, వార్చటం వీటితో సతమతమవటంతప్ప - విశ్రాంతిగా కూచున్న క్షణాలు తాను చూడలేదు. మామ్మ ఎప్పుడూ ముందు హాల్లో తనని వొళ్ళ కూచోపెట్టుకుని కూచునేది. స్కూలునుంచి వచ్చినా, కాలేజీనుంచి వచ్చినా, వూరునుంచి వచ్చినా ముందుహాల్లో కూచునివున్న మామ్మ కనిపించేది - తనని గట్టిగా కావిలించుకునేది. తన తల్లి ఎప్పుడూ ఎదురువచ్చేదికాదు. కాఫీ తీసుకొచ్చి యిచ్చేది నిశ్శబ్దంగా.

నిశ్శబ్దంగా కనబడే తన తల్లి మనసులో ఎటువంటి భావాలుండేవో? ఆమెకి యీ అత్తగారిని ఎదిరించాలని అనిపించేదికాదా? 'వీడు నా కొడుకు, నా గర్భవాసం - ప్రతిదానికీ మీరే వస్తారేం?' అని అత్తగారిని నిలబెట్టి ప్రశ్నించాలన్నంత కోర్కె కలిగేది కాదా? తనకి లేనటువంటి చేరిక, తన చెల్లెళ్ళకి తల్లి దగ్గిర వుండేది. చెల్లెళ్ళు-అందులో పెద్దచెల్లెళ్ళు యిద్దరూ, తల్లి వెనక తిరుగుతూండేవారు.

మామ్మ వాళ్ళిద్దరినీ తిట్టిపోసేది. 'తనమీదా మనుమడిమీద పత్తేదారితనం చేస్తున్నారు. అన్నీ తల్లికి జేరేస్తారు. నేరాలు చెపుతారు' అని! తల్లికి జబ్బుగా వుందిట - ఏంజబ్బు చేసిందో? నాన్న మందు

యిప్పించి వుంటారు. మామ్మ చచ్చిపోయాక తల్లికి స్వతంత్రం వచ్చేవుంటుంది. పదిహేనేళ్ళు ఖైదులోవున్న మనిషికి - అమాంతం స్వేచ్ఛ లభిస్తే - ఆ స్వేచ్ఛని ఏం చేసుకోవాలో తెలీక - వుక్కిరి బిక్కిరి అవుతాడు. అమ్మకూడా అలా అయిందా?

ఆ యింట అతి తక్కువ మాట్లాడే మరోవ్యక్తి జ్ఞాపకం వస్తున్నది రాజగోపాల్‌కి. మూడేళ్ళపాటు ఒక కప్పుకింద బతికి, వయసువల్ల కలిగిన దేహబలహీనత, జాలి, కృతజ్ఞత అన్ని భావాలూ మిళితమై తనకి - దొహికంగా దగ్గిరకొచ్చిన వ్యక్తి జ్ఞాపకం వచ్చింది. తమ కలయికలో మరోప్రాణి రూపు పోసుకుంది. ఆ ప్రాణిపైన తనకి సహజమైన పితృ వాత్సల్యం ఎందుకు కలగటంలేదు? ఎందుకు కలగలేదు? సీతకి ఎన్నేళ్ళు ఉంటాయి- లెక్కబెట్టుతున్నాడు. ఏడేళ్ళు దాటివుండవచ్చు. ఎలా వుంటుంది? కృష్ణవేణికూడా వస్తుందా? బహుశా రావచ్చు. ఆమె తన ఎదుటబడితే ఏం మాట్లాడాలి? వెంటవస్తానని అంటుందా? లేక దూరంగా తొలగిపోతుందా? రాజగోపాల్‌కి రైలు వెనక్కి వెళ్ళిపోతే బాగుండు ననిపిస్తోంది. ప్రశాంతంగా హాయిగా గడిచిపోతున్న తన జీవితం మళ్ళీ చికాకులకీ, సమస్యలకీ లోనవుతుందేమోనని భయంగా వుంది.

సర్కార్‌ఎక్స్‌ప్రెస్ స్టేషన్‌లో ఆగింది. స్టేషన్‌కి ఎవరూ రాలేదు. ఎలా వస్తారు - తను వస్తున్నట్లు వాళ్ళకి తెలియదుగదా! చిరపరిచితమైన రోడ్లవెంట సైకిల్‌రిక్షాఎక్కి బయలుదేరాడు. ఇంటికి చేరేప్పటికి ఇల్లు నిశ్శబ్దంగా వుంది. గుమ్మంలో ముగ్గులేదు. రాజగోపాల్ మనసు ఒక్కసారి శంకతో గజగజలాడింది.

లోపలి కెళ్ళాడు. అప్పుడే తీసుకువెళ్ళిపోయారుట. చెల్లెళ్ళు ఏడుస్తూ హాలు కడుగుతున్నారు. అతను ఆ రిక్షాలోనే స్మశానంవైపుకి వెళ్ళాడు.

అతను వెళ్ళేప్పటికి మంత్రతంత్రాలన్నీ అయినాయి - ఆఖరి కార్యక్రమంలో వున్నారు. కొడుకు ఎలాగూ వచ్చాడు - చితి అంటించమన్నారు. రాజ గోపాల్ శిరస్సువైపు కొరివి అంటించాడు. జన్మించినరోజునుంచీ యీరోజుదాకా - జన్మనిచ్చిన యీ తల్లికి తను ఎటువంటిసేవా చెయ్య లేదు. ఆమె వొడిలో కూచోలేదు, ఆమెపక్కన జేరి కబుర్లూ చెప్పలేదు. ఈనాడు కొడుకుగా ఆమె చితికి నిప్పుపెట్టాడు. బహుశా ఈలోకంలో నరకం అనుభవించిన యీ మాతృమూర్తి పున్నామనరకం తప్పించుకుని మోక్షం పొందుతుందా? ఆమెకి సద్గతి కలుగుతుందా? దూరాన నుల్చుని - తనకి జన్మ యిచ్చిన ఆ దేహం కాలి నుసి అయిపోతుంటే - చూస్తూన్నాడు రాజగోపాల్. అతనికి స్మశాన వైరాగ్యం కలుగలేదు. అయితే తనకి జన్మ యిచ్చిన యీమె ఎన్నాళ్ళు సుఖపడింది? అసలు సుఖం అంటే అర్థం ఏమిటి? ఈ మాతృమూర్తిలోని ఆలోచనలు - ఆమె ఆశలు, నిరాశలు ఏమయి వుంటాయి? అన్న సందేహాలు వచ్చినాయి.

పన్నెండింటివేళ అందరూ యింటికి వచ్చారు. తల్లి జ్ఞాపకచిహ్నంగా నిల్చిన దీపారాధనకి నమస్కరించాడు రాజగోపాల్. ఆ మధ్యాహ్నం సురేఖకి వుత్తరం రాశాడు - 'అమ్మ పోయింది. రెండుమూడురోజులలో వస్తాను' అని ।

రాజగోపాల్ పదకొండురోజులూ వున్నాడు - కర్మకాండ యధావిధిగా చేశాడు. అయితే ఆ కర్మకాండలో అతనికి నమ్మకం వుండికాదు. బహుశా- చనిపోయిన తల్లికి వీటిల్లో నమ్మకం వుండివుండవచ్చు. బ్రతికినన్నాళ్ళూ ఆమెపట్ల తను వుపేక్షాభావం కనపరిచాడు - ఈ పదిరోజులయినా కొడుకులాగా తన కర్తవ్యం నెరవేర్చుకోవాలి అనుకున్నాడు. అతను యిలా యధావిధిగా కర్మకాండ జరుపుతాడని ఎవరూ అనుకోలేదు. తండ్రికికూడా ఆశ్చర్యంవేసింది. ఎన్ని దానాలు చెయ్యమంటే, అన్ని దానాలూ చేశాడు. ఎన్ని స్నానాలు చెయ్యమంటే, అన్ని స్నానాలూ చేశాడు - ఎన్నిసార్లు

కాలవవద్దకు వెళ్ళమంటే అన్నిసార్లూ వెళ్ళాడు. సురేఖకి రాసి - మరో మూడువేలు అదనంగా తెప్పించుకుని - అన్నీ యధావిధిగా నిర్వర్తించాడు. ఈ పదకొండురోజుల అతని ప్రవర్తనతో యింట్లో అందరికీ రాజగోపాల్ మీద కోపం పోయింది. అతను తిరిగి తమ కుటుంబంలో ఒకమనిషి అయి - కొడుకుగా యింటి బాధ్యత వహిస్తాడని అనుకున్నారు. తండ్రికూడా అలానే అనుకున్నాడు.

పదమూడోరోజున అతను పెట్టె సర్దుకుంటుంటే - తండ్రి ఆనంద రావు నోట్లో పంచెకుక్కుని - ఆడదానిలా ఏడవడం మొదలుపెట్టాడు.

'నాయనా వెళ్ళిపోతావా?' అడిగాడు తండ్రి.

రాజగోపాల్ అవునన్నట్లు తలపూపాడు.

'ఈ ఆడపిల్లల్ని ఇద్దరినీ పెట్టుకు ఒక్కడినీ వుండలేనురా.'

'మీకు ఎంత కావాలో చెప్పండి - డబ్బు పంపుతాను.'

'డబ్బొక్కటేనా? ప్రేమాభిమానాలకి నీ దృష్టిలో విలువలేదా? మేము నీకు ఏమీ కామా?' అడుగుతున్నాడు ప్రశ్న.

'పదేళ్ళక్రితం మీరు డబ్బే ముఖ్యమనుకున్నారు. మనసుకి విలువ లేదనుకున్నారు. ఆనాడు నేను ప్రేమించాను అంటే, మీరెవరయినా లెక్క పెట్టారా? నావల్ల ఎంత డబ్బు వస్తుందా? అని చూశారు. ఇదే ప్రశ్న నేను అడిగితే - మీరెవరూ నాబాధ అర్థం చేసుకోలేదు - ఇప్పుడు నా జీవితం నాది. మీ జీవితాలు మీవి' రాజగోపాల్ అయిదారేళ్ళక్రితం అయితే విసురుగా యీ మాటలన్నీ పైకి అనివుండేవాడు. మాటలు ఎంత నిరర్థకమైనవో జీవితం అతనికి పాఠాలు నేర్పింది.

'ఏంరా, నీ నిర్ణయం మారదా? మేము ఎవళ్ళం నీకు లేమా ?' అడిగాడు తండ్రి తీవ్రంగా. రాజగోపాల్ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. అతనికి తండ్రితో మాట్లాడాలని అనిపించలేదు. ఇంట్లో చెల్లెళ్ళు, వాళ్ళ

భర్తలూ అందరూ కొత్తవారిలాగా వున్నారు. వాళ్ళతో మాట్లాడేందుకు మాటలే కరువయినాయి అతనికి.

ఈ యింట్లో అందరూ ఏదో ఒక సందర్భంగా అతనితో మాట్లాడారు. ఆఖరికి - మామగారూ, అత్తగారూకూడా కర్మకాండ లప్పుడు- ఇలా చెయ్యి, నాయనా - ఈపూట అన్నం తినకు, ఫలహారం చెయ్యి' అంటూ ఆయా సమయానికి తన కర్తవ్యం చెపుతూ వుంటే, నిశ్శబ్దంగా ఆచరించేవాడు. ఒక్క క్రాఫింగ్ విషయంలోతప్ప - మిగతా అన్నీ శాస్త్రయుక్తంగా, నిష్టగా చేశాడు.

అతనివెంట నిశ్శబ్దంగా - నీడలాగా అన్ని క్రతువుల్లో ధర్మపత్నిగా పాలుపంచుకునేది కృష్ణవేణి. అతనితోపాటు స్నానాలు చేసింది-తడిబట్టలతో అగ్నిహోత్రం తీసుకొచ్చింది - దానాలు యిచ్చే సమయంలో అర్ధాంగిగా నీళ్ళు ఎత్తిపోసింది అతని చేతుల్లో. ఆమె ఒక్కమాట మాట్లాడలేదు - అతను ఆమెవైపు కన్ను ఎత్తి చూడలేదు. నాటకంలోని పాత్రలవలె, తమ తమ పోర్షన్సు యధావిధిగా నిర్వర్తించారు. ఇంట్లో తిరుగుతున్న పిల్లల్లో - తన కూతురు సీతకూడా వుంది. మొదటిరోజున హాల్లో అయిదుగురు మొగపిల్లలూ, ముగ్గురు ఆడపిల్లలూ - సైజులువారీగా హాల్లో ఆడుకుంటూ, గిచ్చుకుంటూ కనిపించారు. వీళ్ళలో ఎవరు తన కూతురో రాజగోపాల్ గుర్తించలేకపోయాడు.

ఎవరో 'సీతా' అంటూ లోపలినుంచి పిలుస్తూ వచ్చారు. ఆమె కృష్ణవేణి. మనిషి అలాగే సన్నగా వుంది. జుట్టు కలనేతచీరెలాగా - తెలుపు నలుపులతో మిళితమయివుంది. హాల్లో అతను కేన్‌కుర్చీలో కూచుని వున్నాడు. ఆనాటి పేపరు అతని చేతిలో వుంది. సీతని పిలుస్తూ వచ్చిన కృష్ణవేణి, కుర్చీలో కూచున్న భర్తని చూసి, అలా నిల్చుండిపోయింది. హాల్లో పిల్లలుతప్ప పెద్దలులేరు. అతన్ని పల్కరించాలా? ఏమని పల్కరించాలి? సీత తల్లిదగ్గిరగా వచ్చి ఆమె వడిని అనుకుని నిల్చునుంది.

'ఇదిగో మీ కూతురు' - అని భర్తకి పరిచయం చెయ్యాలా? అతను పేపరు చేతిలోంచి వదలలేదు. ఆమెవైపు చూడలేదు. కృష్ణవేణి లోపలికి వెళ్ళిపోయింది. ఏడేళ్ళ ఆ పిల్లా తన కూతురన్నమాట. అయితే సీతని చూస్తే - రాజగోపాల్‌కి ప్రత్యేకమైన ప్రేమగాని, వాత్సల్యంగాని కలగలేదు. మిగతా అందరి చిన్నపిల్లలులాగానే - తన చెల్లెళ్ళ పిల్లలు లాగానే అనిపించిందితప్ప, రక్తపాశం - పేగు కదలటం వగైరా - కవులు వర్ణించే స్పందన కలుగలేదు.

ఆ యింట్లో తిరుగాడుతున్న ఎనమండుగురు పిల్లల్లోనూ - తరుచు సీత ఏడుపు అతనికి వినిపిస్తూ వుండేది. కాళ్ళు బద్దలుకొట్టుకోటం, నేలమీద పడి దొర్లటంవంటి ప్రత్యేక విద్యలు ప్రదర్శించేది. సీత తన పిల్ల అయినా- ఎవరిపిల్ల అయినా రణపెంకి అనీ, ఆ పిల్లలో ప్రేమించబడేటువంటి గొప్ప 'క్వాలిటీస్' ఏమీ లేవనీ అనిపించింది రాజగోపాల్‌కి. కాని, ఈ సీత తనంతట తను యీలోకంలోకి రాలేదు. ఈ పిల్లకి జన్మ యివ్వటంలో తన భాగంకూడా వుంది - అటువంటి అప్పుడు యీ సీతపట్ల తన బాధ్యత ఏమిటి? అన్న ప్రశ్న కలుగుతూండేది. వెంటనే సీతకి తల్లి వుంది, అమ్మమ్మా తాతగార్లు వున్నారు. వాళ్ళు చూసుకుంటారు-అని సర్దుకునేవాడు.

ప్రయాణం అవుతున్నారుట. మామగారు అడిగారు - తండ్రి అక్కడి నుంచి వెళ్ళిపోయిన వెంటనే అతనివెనక నుల్చుని. బహుశా తండ్రి చెప్పి వుంటాడు.

'అవును' అన్నాడు రాజగోపాల్ మూడక్షరాల్లో.

'అమ్మాయిని వెంట తీసుకెళ్ళండి' రాజారావుగారు మొదటినుంచి అల్లుడిని మీరు అనే మన్నిస్తూండేవాడు.

'ఊహుఁ'

'సీత మీ పెంపకంలో అయితే బాగుపడుతుంది - అక్కడ చదివిస్తే ....'

'అమ్మ పోయిందని వచ్చాను. అంతేగాని మిగతా ఏ పరిస్థితుల్లోనూ మార్పులు జరుగవు' అన్నాడు రాజగోపాల్ నిదానంగా. అతని కంఠం నిశ్చలంగా వుంది.

'నాన్నా—' అవతలనుంచి పిలుపు. రాజారావుగారు 'వస్తున్నా'నంటూ కదిలారు.

రాజగోపాల్ హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. తండ్రిని యీ సంభాషణనుంచి తప్పించాలని కృష్ణవేణి వెనక్కి పిలిచింది. వీళ్ళందరూ గ్రహించలేని నిజాన్ని ఆమె తన నిశ్శబ్దతలో గ్రహించుకుంది.

రాజగోపాల్ బయలుదేరవలసిన బస్‌కి అరగంట టైముంది. అతను బెజవాడ వెళ్ళి రైలు ఎక్కబోతున్నాడు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. వేదిక మీదనుంచి – తెరవెనకకి వెళ్ళిపోయిన పాత్రధారుల్లాగా అందరూ కంటికి కనపడకుండా లోపల ఎక్కడో వున్నారు. ఉన్నవి నాలుగు గదులే అయినా- ఈ చిరపరిచితమైన ఇంట్లో ఎక్కువకాలం ఈ హాల్లోనే గడుపుతున్నాడు రాజగోపాల్.

అతను యిటు అటూ చూశాడు. హాల్లో ఎవరూలేరు. లోపలగదిలో కృష్ణవేణి పెట్టిమీద కూచునివుంది. ఆమెకి చెరోవైపునా తల్లీతండ్రీ కూచుని వున్నారు. రాజగోపాల్ గుమ్మంలో నుల్చుని వున్నాడు – లోపలికి వెళ్ళనా వద్దా అన్నట్లు – ఆమె తల్లితండ్రు లిద్దరూ – లేచి గదిబయటకి వెళ్ళారు. రాజగోపాల్ గదిలోపలకి వచ్చాడు తటపటాయిస్తూ. ఈమెని చూస్తే కొత్తవ్యక్తిని చూసినట్లుంది – మూడేళ్ళ కాపరంలో తా నెప్పుడూ కృష్ణవేణిపట్ల చనువుగాని, స్వతంత్రంగాని చూపించలేకపోయాడు. ఆమెపట్ల వుదాశీనంగాకూడా ప్రవర్తించాడు. అయినా ప్రతిసారి ఈమె సహిస్తూ వచ్చింది. తనని యిబ్బందికరమైన పరిస్థితుల్లో ఇరికించలేదు. తన హక్కులకోసం పోరాడలేదు. అన్నిటినీ దేనికి భరిస్తోంది?

ఈమెని క్షమించమని అడగాలని వుంది. తనని భర్త అనే బాధ్యతనుంచి, తండ్రి అనే బాధ్యతనుంచి తప్పించమని అడగాలని వుంది. ఎలా అడగటం? ఏమని అడగటం ?

'నేను వెళ్ళొస్తాను.?' అన్నాడు అతను ఇంక ఏమీ అనలేక.

'మళ్ళీ వస్తారా?' అడిగింది కృష్ణవేణి.

'నెల నెలా మాసికాలు వున్నాయిట. వాటికి రావటానికి వీలుపడదు.'

'నేను ఆ విషయంకాదు అడిగింది.'

అతను జవాబు చెప్పలేదు. కొన్నిక్షణాలు నిశ్శబ్దం.

'నువ్వు అవసరంలో రమ్మని రాస్తే, తప్పకుండా వస్తాను. నా అవసరం వున్నరోజున రాయి – డబ్బు యింకా పంపనా?'

'వొద్దు. అదికూడా పుచ్చుకునేదాన్నికాదు. సీతకోసం బాంకులో వేస్తున్నాను.'

'మంచిది – వెళ్తాను' అంటూ బయట కొచ్చేశాడు రాజగోపాల్.

కృష్ణవేణికి వుడుకుమోత్తనంగా వుంది. విజయం సాధించానని గర్వంగాకూడా వుంది – అతను తనంతట తాను వచ్చి, సంజాయిషీ చెప్పుకుని వెళ్ళాడు. అతను చెప్పకండా వెళ్ళిపోతే ఆమెకి చాలా కోపం వచ్చివుండేది. ఆ కోపంలో ఏం చేసేదోకూడా తెలియదు.

రాజగోపాల్ కాఫీ తీసుకుని – బెజవాడ బస్ ఎక్కేశాడు. ఇంట్లో అందరూ తమ తమ అభిప్రాయాలు చెప్పారు – ఒక్క కృష్ణవేణిమటుకు ఏమీ మాట్లాడలేదు. రాజగోపాల్ పెద్దచెల్లెళ్ళు సీతని దగ్గిరకు పిల్చి – ప్రేమ కురిపించి – వోదార్చపోయారు. సీత వాళ్ళని రక్కి దూరంగా పారిపోయింది.

'ఒదినా, నువ్వు అలా మెత్తగా వూరుకుంటే లాభంలేదు. నాలుగూ దులపాల్సింది' అంది పెద్దఆడబడుచు. కృష్ణవేణి ఇది జవాబు చెప్పాల్సిన సంగతి కానట్లు వొదిలేసింది.

రెండో ఆడబడుచు 'నాకు మా ఆయన్ని - ఒక్క_క్షణం విడిచి వుండాలన్నా - బెంగగా వుంటుంది. అర్ధరాత్రయినా ఆయన యింటికొస్తేగాని కంటిమీద కునుకురాదు. నీకు చాలా నిబ్బరం వొదినా, అన్నయ్యాని ఎలా వెళ్ళనిచ్చావో అర్థంకావటంలేదు' అంది.

దీనికి కృష్ణవేణి మౌనమే జవాబు. ఆరాత్రే కృష్ణవేణీవాళ్ళు బందరు వెళ్ళిపోయారు.

'అల్లుడు ఏమన్నారమ్మా?' అడిగారు రాజారావుగారు కూతుర్ని. బస్‌లో అమ్మమ్మకీ మనుమరాలికీ ఒక సీటూ – తండ్రికీ కృష్ణవేణికీ మరో సీటు దొరికాయి. సీత కిటికీవైపు కూచుని అమ్మమ్మని కబుర్లతో వేధిస్తున్నది – ఆవిడ దాని ప్రశ్నలకి వోపిగ్గా జవాబిస్తున్నది.

'కొత్తగా అనటానికి ఏమున్నాయి నాన్నా.'

'అవుననుకో. తీసుకెళ్తాననీ....వస్తాననీ.'

'ఉహూఁ. ఏం చెప్పలేదు.'

'మరి లోపలి కెందుకు వచ్చాడు?'

'వెళ్ళొస్తానని చెప్పడానికి - అంతే' అంది కృష్ణవేణి. 'నువ్వు అవసరంలో వున్నపుడు రాయి, నా అవసరం వున్నపుడు తప్పక వస్తాను' అని అన్న ఆ నాలుగు మాటలు ప్రేమ సందేశంలాగా మనసులో దాచుకుంది. తండ్రికికూడా చెప్పాలనిపించలేదు.

'సీత సంగతే నాకు బెంగగా వుందమ్మా –'

'మనవూళ్ళోనే డాక్టరుకి చూపిద్దాం. మీరనుకున్నట్లు అది సైకలాజికల్ కేసు కాదు నాన్నా, సెంకితనం. మీరేమో తండ్రి దగ్గిరలేదని గారాం చేస్తున్నారు. అది ఆ సాకుతో పంతం నెరవేర్చుకుంటున్నది' అంది నవ్వుతూ.

రాజారావుగారు ఏమీ అనలేక వూరుకున్నాడు. ఆయనకీ, భార్యకీ సీతని చూస్తే పంచప్రాణాలు. అది ఏడుస్తే వీళ్ళు చూడలేరు.

గిలగిల్లాడుతారు. వీరి బలహీనతని ఆ ఏడేళ్ళపిల్లా బాగా కనిపెట్టింది. ఏడ్చి దాని పంతం నెగ్గించుకుంటుంది. ఆ విషయం ఆయనకీ తెలుసు. తను కోప్పడితే భార్య అడ్డొస్తుంది – భార్య కోప్పడితే ఆయన అడ్డొస్తారు. ఇద్దరూ కలిసి ఒకవిధంగా పిల్లని చెడగొడ్తున్నారు. కాని ఎలా? చంటిపిల్లని తండ్రి దగ్గిరలేనిదాన్ని!

'దీన్ని ఏ బోర్డింగ్‌లోనో చేరిపిస్తేగాని బాగుపడదు నాన్నా. చదువు మాట ఎలావున్నా ఆ పెంకితనంఅన్నా తగ్గుతుంది.'

'అలాంటిపని చేశావంటే – మీ అమ్మ బెంగపెట్టుకుని మంచం ఎక్కుతుంది.'

'మీరిద్దరూ కలిసి దాన్ని ముద్దుచేసి పాడుచెయ్యకండి. పైనెలలో దాన్ని బయట స్కూల్లో జేరిపించేస్తాను. మన 'ఆర్ఫనేజ్'లో దానికి ఆడింది ఆటా - పాడింది పాటగా వుంది. ఒక్కఅక్షరం నేర్చుకోదు.'

'నీ యిష్టమమ్మా. అంతేగాని హాస్టల్లోమటుకు పెట్టకు. ఆపైన మీ అమ్మను పట్టుకోటం నావల్లకాదు.'

కృష్ణవేణి నవ్వుతూ తండ్రివంకచూస్తూ అంది 'మీరుండలేరా? అమ్మ వుండలేదా? నాన్నా, ఎవరిమీదా అంత ప్రేమ పెట్టుకోకూడదు. రేపు అది పెళ్ళిచేసుకు వెళ్ళిపోతే–'

'భలేదానివి - దానికి ఎనిమిదేళ్ళులేవు, అప్పుడే పెళ్ళా?'

'ఇప్పుడు పెళ్ళి అనికాదు, రెక్కలువచ్చి ఎగిరిపోతున్నపుడు - ఎగిరేవాళ్ళకి వెనక దిగబడిపోయినవాళ్ళ బాధ అర్థంకాదు, నాన్నా-అందుకు చెబుతున్నాను.'

రాజారావుగారు కూతురు ఎవరిని గురించి చెబుతోందో అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారా? తన స్వానుభవం గురించా? లేక లోకపు తీరు గురించా?

మరో రెండునెలలకి – సీతని వాళ్ళ యింటికి మూడుమైళ్ళ దూరంలోవున్న ఇంగ్లీషుమీడియమ్ స్కూల్లో జేర్పించింది. మధ్యాహ్నం యింటికి రావటానికి వీల్లేదు కాబట్టి – అన్నం డబ్బాలో పెట్టి యిచ్చేది. సీత విషయంలో స్ట్రిక్టుగా వుండమని హెచ్.ఎమ్‌ని హెచ్చరించి మరీ వచ్చింది కృష్ణవేణి.

ఈసారి బందరు తిరిగి వచ్చాక కూతురు కాపరం బాగుపడుతుందన్న ఆశ, కృష్ణవేణి తల్లితండ్రులు యిద్దరూ వొదులుకున్నారు. అల్లుడిమీద వొత్తిడి తేవటానికి – కూతురు వొప్పుకోదు. ఆమెకోసం అతను నెలనెలా రెండువందలు పంపుతున్నాడు. ఆ డబ్బు కృష్ణవేణి ముట్టుకోటంలేదు. సీత పేర రికరింగ్ డిపాజిట్ వోపెన్ చేసింది – అందులో వేస్తున్నది.

కృష్ణవేణి ఆర్ఫనేజ్ నిర్వహణలో తలమునకలుగా వుంది. ఈమధ్యనే ప్రభుత్వం స్వంతభవనానికి గ్రాంటు మంజూరు చేసింది. ఆ ఇల్లు కట్టడం, దానికి ప్లానులు, యింజనీర్లూ యిలా కృష్ణవేణికి క్షణం తీరిక వుండేదికాదు. దూరపు స్కూల్లో జేరాక, సీత కాస్త దారిలోపడింది. వెనకటి పెంకితనం, ఏడుపులూ చాలామటుకు తగ్గినాయి. దానికి తల్లిదగ్గిర కంటే అమ్మమ్మా, తాతయ్యలదగ్గర చనువు. ఒకరకంగా కృష్ణవేణి పెళ్ళి అయి, పిల్లతల్లి అయి ఏకాంతం అనుభవిస్తూ వుంది. ఆ వంటరితనం గురించి ఆమె ఆలోచించడం మానేసింది. చేతినిండా వ్యాపకం వుంది. తనకి తల్లితండ్రులున్నారు – తన పిల్లకి ప్రస్తుతం ఎటువంటి సమస్యాలేదు. ఇక దేన్ని గురించీ ఆలోచించకూడదన్న నిర్వికారమైన స్థితికి వచ్చింది.

మొదట్లో తల్లితండ్రులు కృష్ణవేణి గురించి బాధపడ్డారు. అల్లుడి కఠినత్వం గురించి తిట్టుకున్నారు. రాను రాను ఈ మనుమరాలు వారి

జీవితాల్లో ఒక ముఖ్యమైనవ్యక్తి అయింది. సీతకి మంచి మార్కులొస్తే తల్లికంటే యీ వృద్ధులే ఎక్కువ సంతోషపడేవారు. పండుగలు, పుట్టిన రోజులు అంటూ ప్రతిపండగా ఒక్కటికూడా బిరుపోకుండా యీ చిన్నపిల్ల కోసం పాటించేవారు. అమ్మమ్మ పండుగలూ, వ్రతాలూ హడావుడి చేస్తే, తాతగారు గాంధీజయంతీ, స్వాతంత్ర్యదినోత్సవం, రిపబ్లిక్‌డే అని యిలా జాతీయదినోత్సవాలురోజున - ఆ చిన్నపిల్లని ఒడిలో కూచో పెట్టుకుని, భారతస్వాతంత్ర్య పోరాటం గురించి చెపుతూండేవారు. ప్రకాశం, బాపూజీ గురించి, తిలక్, పటేల్‌ల గురించి వీరగాధలు చెపుతూండేవారు. సీతకి ఈ స్వాతంత్ర్యవీరుల పోరాటంలోని అంతరార్థం తెలిసిందో లేదో_ వా రెందుకు పోరాటం సలిపారో అర్థం అయిందో లేదో _ అన్న విషయం ఆయన పట్టించుకునేవారుకాదు. ప్రతిరాత్రీ నిద్రపోయేదాకా చిన్నసీతని పక్కన పడుకోపెట్టుకుని కబుర్లు చెప్పేవారు. పక్కన కూచుని పాఠాలు చెపుతూండేవారు. దగ్గరకూచుని హోమ్‌వర్క్ చేయిస్తూ వుండేవారు. తల్లీ తండ్రీ ఈ సీత చుట్టూ ప్రేమలతలని అల్లుకుపోతుంటే కృష్ణవేణి అనుకుంటూండేది - నా వివాహం వీళ్ళకి దుఃఖాన్ని కలిగించినా, కనీసం ఈ సీతయినా యీ పెద్దవాళ్ళకి ఆలంబనం అయింది _ అని! ఈ పిల్లా కలగకుండా అతను మద్రాసు పారిపోయివుంటే, ఏమయివుండేది? తమ జీవితాలు _ యీ పెద్దవాళ్ళ జీవితాలు మరీ ఘోరమయి వుండేవి! తన బాల్యంలో తండ్రి యింత శ్రద్ధగా ఏనాడూ పాఠాలు చెప్పలేదు, కథలూ చెప్పలేదు. ఈ మనుమరాలిమీద యీ యిద్దరికీ ఎంత మమకారం _ అని ఆశ్చర్యపోతూండేది. మళ్ళీ అది సహజం _ ఇది వీళ్ళ వంశంలోనే వుంది - తన భర్తని మామ్మగారు యిలానే ప్రేమించింది, అనికూడా అనుకుంటూ వుండేది.



మద్రాసు మెయిల్లోంచి రాజగోపాల్ తల బయటపెట్టి చూస్తున్నాడు. అతనికి సెంట్రల్‌స్టేషను దగ్గిరవుతున్నకొద్దీ వుత్సాహంగా కొత్తవూపిరి పోసుకున్నట్లు, నిర్బంధంనుంచి విముక్తిపొందినట్లూ అనిపిస్తూ వుంది. గుడివాడ, ఆ పరిసరాలు, ఇంట్లో బంధువులూ ఇవన్నీ అతన్ని వూపిరి సలపనట్లు వుక్కిరి బిక్కిరి చేశాయి. ఇరవై రెండేళ్ళపాటు ఆ యింట్లో, ఆ వ్యక్తులమధ్య గడిపాడు. తన బాల్యం, విద్యార్థిదశ, యవ్వనం అన్నీ ఆ యింట్లో ఆ మనుషులమధ్య గడిచాయి. కాని ఈరోజు అవన్నీ కొత్తగా వున్నాయి – వారంతా పరాయివారివలె అనిపించారు. తను ఆ పరిసరాలకి చెందను, ఆ మనుషులకి చెందను – రక్తస్పర్శ అన్నది వుత్త బూటకం : అందులో ఎటువంటిశక్తీ లేదు – అనిపిస్తున్నది రాజగోపాల్‌కి.

రైలు బేసిన్‌బ్రిడ్జ్ దాటింది. దూరాన కార్పరేషన్‌వారి సూయేజ్ వాటర్ ట్రీట్‌మెంటు ప్లాంటులు, ఎత్తుగావున్న కట్టడాలు, అవుటర్ సిగ్నల్ కాబిన్ – ఆ తరువాత సెంట్రల్ ! ప్లాట్‌ఫారమ్ ఎటువైపు వస్తుంది – ఆత్రంగా చూస్తున్నాడు తలుపు నానుకుని - దూరాన, గాలిలో తెల్లని రుమాలు వూగుతోంది. రాజగోపాల్ వొంగి చూశాడు. పసుపుపచ్చని చీరెలో సురేఖ. ఒక్కసారి ఒళ్ళంతా ఆనందంతో పులకించిపోయింది. సురేఖ - తన సురేఖ - తన జీవితానికి అర్థమూ, పరమార్థమూ అయిన సురేఖ, తనకోసం ఎదురుచూస్తూ వుంది.

రైలు నెమ్మదిగా – నెమ్మది నెమ్మదిగా ఆగింది. కూలివాళ్ళని తోసుకుంటూ ప్లాట్‌ఫారమ్‌మీదకి జంప్‌చేశాడు, రైల్లోవున్న సూట్‌కేస్ గురించి పట్టించుకోకుండా. సురేఖ గబగబ అడుగులువేస్తూ వచ్చింది. ఆమెకి ఎదురువెళ్ళి – రెండుచేతుల్లోకి తీసుకుని గట్టిగా గుండెలకి హత్తుకున్నాడు.

'ఏయ్ గోపీ, ఎవరన్నా చూస్తారు – యిది యిల్లుకాదు – వొదులు.'

'చూడనీ, నవ్వితేపోదురుగాక. నాకేటి సిగ్గు. అబ్బ నిన్ను చూసి ఎన్నో యుగాలయినట్లుంది. పెథవర్రైలు ఎంతకీ రాలేదనుకో.'

'ఉండు – సూట్‌కేసు దించనీ. ఏయ్ కూలీ, పెట్టె దించు.'

'డ్రయివర్ వచ్చాడా?'

'ఆ నిన్ననే కంపెనీకి ఫోన్‌చేసి చెప్పాను. రాత్రే వచ్చి పడుకున్నాడు. గోపీ, అయామ్ సారీ ! నీకు ఏం సాయం చెయ్యలేకపోయాను – మదర్ పోయినపుడు వొక్కడివీ....' ఆగిపోయింది.

'నువ్వు స్టేషన్ కొచ్చావ్ - అది చాలు. రాత్రి చాలా 'లోన్లీ'గా అయిపోయాను. నువ్వు ఎలా వున్నావో అని ఒకటే భయం.'

'దేనికి?'

'ఈ పదిరోజులూ అక్కడ గొడవ సరిపోయింది. రైలు ఎక్కానో లేదో — ఎప్పుడు చూస్తాను, సురేని ఎప్పుడు చూస్తాను — అని ఆత్రపడిపోయాను.'

'ఏయ్, సిల్లీ'

'అయివుండచ్చు. నువ్వు దగ్గిరలేకపోతే నాకు ఏం బాగుండదు.'

'కబుర్లు నేర్చుకున్నాడమ్మా యీ అబ్బాయి. ఎక్కడ నేర్చుకున్నావ్– ఎవరు నేర్పారు? ఒక్క పదిరోజులు కనుమరుగయితే యిన్ని కబుర్లా – బుద్ధిగా వున్నావా?'

'ఉన్నాను.'

'నమ్మవచ్చా?' అడిగింది సురేఖ చురుగ్గా.

'మనసా వాచా బుద్ధిగా వున్నాను. కావాలంటే అక్కడ అందరినీ సాక్ష్యం అడుగు.'

'అక్కర్లేదు - నీమాటమీద నమ్మకం వుంది' అంది సురేఖ.

# 8

'ఇదిగో అమ్మాయి - నేను ఆఫీసుకి డుమ్మా కొట్టేస్తున్నాను' అంటూ మంచంమీద మఠం వేసుకుని కూచున్నాడు రాజగోపాల్.

'ఏయ్, పన్నెండురోజులు వూళ్ళోలేవు.'

'అందుకనే. నిన్ను వొదిలిపెట్టి పన్నెండురోజులు దూరంగా వున్నాను. ఆవాల యీరోజు వడ్డీతోసహా వసూలు చేస్తాను.'

'ఛీ - నీకు సిగ్గులేదు. ఎన్నేళ్ళు వచ్చినా, పాడుమాటలూ నువ్వూను. గోపీ, నువ్వు చిక్కిపోయావు - నల్లబడ్డావు' అంది సురేఖ అతనివంక పరిశీలనగా చూస్తూ.

'అదేకదమ్మా చెప్పేది. పొద్దుటే బెడ్ టీ లేదు - ఎండలో వెళ్ళమన్నారు, స్నానాలు చెయ్యమన్నారు .... '

'అక్కడెవరూ నీ సంగతి పట్టించుకోలేదా ? '

'అవకాశం యిస్తే - పట్టించుకునేవారేమో——కాని నువ్వు కాదుగా, ఎగబడి - కేకలేసి నా పనులు చూడటానికి'

'అక్కగారు రాలేదా ? సీతా ? '

'వచ్చారు. అంతా వచ్చారు.'

'ఆవిడ నీ విషయం కనుక్కోలేదా ? ' సురేఖ కళ్ళు తీక్షణంగా చూస్తున్నాయి. అతని గుండెల్లో తన కళ్ళకి అగుపడని రహస్యంవుందేమో, ఆ గుండెలని చీల్చుకు చూడాలన్నట్లు రెప్పవెయ్యకుండా చూస్తున్నది.

'పిచ్చి సురేఖా ! నేను శ్రీరామచంద్రుడిని. ఏకపత్నీవ్రతుడిని. నిన్నుతప్ప ఎవరినీ కలలోకూడా తల్చుకోను'

'యిక కబుర్లు చెప్పకు. ఆవిడ నీతో మాట్లాడాలని ప్రయత్నించ లేదా ? దెబ్బలాడలేదా ? '

'లేదు. నేనా అవకాశం యివ్వలేదు. నా జీవితంలో వారెవరికీ స్థానం లేదన్నది స్పష్టంగా చెప్పాను' అన్నాడు అతను నిదానంగా స్పష్టంగా. ఈ కంఠం సురేఖకి పరిపూర్ణమైన తృప్తినిచ్చింది.

'సీతని యిక్కడికి తీసుకొచ్చి, చదువు చెప్పిస్తే, కాన్వెంటులో చేర్పిస్తే'

'నీ బుఱ్ర చెడిపోతోంది. అలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలు కట్టిపెట్టు. మొన్న బుధవారం ప్రోగ్రామ్ ఎలా జరిగింది. బాగా జరిగిందా?'

'సురేఖ జవాబు చెప్పలేదు. ఆమె ముఖం ఎర్రగా అయింది. ఉదయంనుంచీ ప్రసన్నంగా వున్న ముఖంలోని రంగులు మారిపోతున్నాయి. మళ్ళీ ఏదో గొడవ జరిగివుంటుంది అనుకున్నాడు రాజగోపాల్.

'నేను ప్రోగ్రామ్‌కి వెళ్ళలేదు. చెయ్యలేనన్నాను'

'ఏం ? '

'వంట్లో బాగాలేదు. మనసూ బాగాలేదు'

'అసలు ఏం జరిగిందో చెప్పు ? ' అడిగాడు రాజగోపాల్.

'నువ్వు వూరికెళ్ళినరోజు నిద్ర పట్టలేదు. మరునాడుకూడా ఏవో భయంగావుండి నిద్ర రాలేదు. అక్కడ నువ్వు ఎలావున్నావో నని బెంగ'

'ఊ'

'రెండు కాంపోజ్ వేసుకున్నాను.'

రామ్‌గోపాల్ రెప్పవాల్చకుండా వింటున్నాడు.

'రిహార్సల్సులో నేను స్లోగా చేశానుట. మువ్‌మెంట్సు నిద్ర పోతున్నట్లున్నాయని – బాగా తిట్టారు. అందరి ఎదుటగుంటా అవమానంగా మాట్లాడారు. ఒక్కదాన్నీ వున్నప్పుడు గురువుగారు ఎన్ని అన్నా

సహిస్తాను—నా వయసులో సగంవయసుకూడాలేని పిల్లలమందు అన్ని మాటలంటుంటే .... ' సురేఖకళ్ళు తళతళమంటున్నాయి. మళ్ళీ ఏడుపు మొదలుపెడుతుంది కాబోలు.

'ఆ సాయంత్రం డాక్టరుగారు వచ్చారు'

'ఏం మళ్ళీ బి.పి వచ్చిందా ? ' ఆదుర్దాగా అడిగాడు.

కళ్ళు తిరిగినట్లయింది. బాత్‌రూమ్‌లో పడిపోయేదాన్నే – నెమ్మదిగా గోడపట్టుకుని బెడ్‌రూమ్‌లోకి వచ్చాను'

'ఏమన్నారు ? '

'బి.పి ఎక్కువగా వుంది. మీరు వుద్రేకపడకూడదు. ఎక్సైట్ అవకండి అంటారు. ఉప్పు పూర్తిగా మానెయ్యమన్నారు' అంది సురేఖ.

'ఇంతేగదా. గురువుగారితో దెబ్బలాడావనుకున్నాను'

'అదే జరిగింది. నాకు బి.పి ఎక్కువయి రాసంటే ఆయన నమ్మలేదు. వోర్వలేనితనంచేత రావటంలేదన్నారు. నేను లేకుండా ప్రదర్శన రక్తికట్టించి తీర్తానని ఛాలెంజ్ చేశారు'

'ఏమయింది ? బాగా జరిగిందా ?'

'నన్ను పొగిడినంత ఆ పిల్లని పొగిడివుండరు. ఆ ప్రదర్శన గురించి పత్రికల్లో రివ్యూలేం రాలేదు' అంది సురేఖ విజయగర్వంతో.

రాజగోపాల్‌కి సురేఖ మనస్తత్వం బోధపడకుండా వుంది. ఈ గురువుగారూ – తనూ పిల్లీ ఎలకాలాగా ఎన్నాళ్ళు కీచులాడుకుంటారు ? ఈ కీచులాటలో తాను వోడిపోతుందని సురేఖకి బోధపడటంలేదా ? కాలం అన్నది, వయసు అన్నది ముఖ్యంగా స్త్రీలవిషయం అతి నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తుందని సురేఖకి అర్థంకావటంలేదు. సురేఖ జీవితంలో అతి ముఖ్యమైన ఈ నాట్యం, గురువుగారు – యీ రెండూ ఆమె ఆరోగ్యాన్నీ మనశ్శాంతినీ హరిస్తున్నారు. ఈ మానసికవత్తిడివల్ల సురేఖ ఏమై

పోతుంది. ఆమెని కాపాడుకోవాల్సిన బాధ్యత తనకి వుంది. గురువుగారు పదిమంది పిల్లలకి శిక్షణఇచ్చి వాళ్ళని నాట్యవిశారదలని చెయ్యొచ్చును. తనకేం అభ్యంతరంలేదు. కాని సురేఖ మనశ్శాంతిలో – ఆమె జీవితంలో చెలగాటం ఆడే హక్కు ఆయనకి లేదు. సురేఖని ఈ ఎమోషనల్ యిన్‌వాల్వ్‌మెంటునుంచి బయటికి లాగాలి.

'మీ టీచరు వస్తున్నారా ?'

'వస్తున్నారు. నాకేమిటో చదువు వంటబట్టేట్లులేదు. గోపీ, నాకు చదువు రాదేమోనని భయంగా వుంది.

'ఎవరు చెప్పారు? నీకు రాని విద్య వుందంటే నేను వొప్పుకోను. ఒక విద్యలో మాస్టరైనవాళ్ళు మిగతా అన్నిటినీ మాస్టర్ చెయ్యగలరు. పరీక్షలు రెండునెల లున్నాయిగదూ – నేను దగ్గిర కూచుని పాఠాలు చెపుతాను.'

'నువ్వు ఎటువంటి పాఠాలు చెపుతావో, నాకు తెలియదా?' నవ్వుతోంది సురేఖ.

ఆమె మనసుని మరోవైపుకి తిప్పాను అనుకున్నాడు రాజగోపాల్. ఆఏడు పి. యు. సి. పరీక్షకు వెళ్ళింది సురేఖ. పెద్ద బ్రిలియంట్‌గా రాయకపోయినా – పాసుమార్కు లొస్తాయని చెప్పింది. కాని, ఆమెలో బి. ఎ. చదవాలన్న పట్టుదల, వుత్సాహం కనిపించలేదు. ఒకవిధంగా యీ పరీక్షకు మొక్కుబడిగా చదివింది.

'సక్సెస్ బ్రీడ్స్ సక్సెస్' అన్నట్లు రాజగోపాల్ జీవితంలో వెనక్కి తిరిగి చూడటమనే ప్రసక్తి రావటంలేదు. అతను ముందుకే – పైమెట్టు వైపే పయనిస్తున్నాడు. కంపెనీలో అతని మాటకి ఎదురులేదు. బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్ కోరుకుంటున్న లాభాలు కూర్చిపెడుతున్నాడు – ఎగ్జిక్యూటివ్‌గా

అతని స్థానం పటిష్టమయింది. ఎపార్ట్‌మెంటునించి అడయార్‌లో కొత్తగా కట్టిన యిల్లు అతనికి ఎలాట్ చేశారు. ఆధునికంగా కట్టిన పాష్‌హౌసెస్- కంపెనీ లీజుకి తీసుకుని ఎగ్జిక్యూటివ్స్‌కి - ఫర్నిచర్‌తోపాటు యిస్తుంది. మూడు బెడ్‌రూమ్స్, ఎటాచడ్ బాత్‌రూమ్సూ, విశాలంగా వుండే డైనింగ్ కమ్ డ్రాయింగ్‌రూమ్ - చుట్టూ కాంపౌండూ, ముందు పచ్చని లాన్ గల యింట్లోకి మారారు.

ఆ హాలుకి-సురేఖ ప్రత్యేకమైన అలంకారం చేసింది. ఓరియంటల్ డిజైన్సులో మందపాటి కర్టెన్సు, గుమ్మాలకి చిరుగంటలు, డ్రాయింగ్ రూమ్‌లో ఒకమూల 'బ్రాంజ్'లో ఖరీదైన నటరాజ విగ్రహం, ఉదయం సాయంత్రం వెలిగించే మంచిగంధపు అగరొత్తులు, గోడలకి అయిల్ కలర్సులో పెద్ద పెయింటింగ్స్, రెండుగోడలకి కొట్టవచ్చేట్లు బ్రిలియంట్ అయిల్సులో సూర్యాస్తమయాల్లో హిమాలయాలు. ఆ డ్రాయింగ్‌రూమ్‌లోనే మరోపక్క - గదికి మరోమూల గురువుగారి ఫోటో - మెడనిండా పూల మాలలతో నవ్వుతున్న ఫోటో. గోడకివున్న అద్దాలకబోర్డులో పుస్తకాలు: ఎక్కడా పిసరంత దుమ్ముకూడా లేకుండా, పనివాడిచేత దులిపించి వుంచేది సురేఖ. గాలికి అల్లల్లాడుతూ మువ్వలుచేసే శబ్దంతో, మంచిగంధపు సువాసన తెరలు తెరలుగా ప్రయాణిస్తూ వుండేది ఆ హాల్లో. ఇంటికి ఎవరు వచ్చినా- ఆ డ్రాయింగ్‌రూమ్‌లోని చల్లదనాన్ని, సౌరభాన్ని, చిరుగంటల దరహాసాన్ని మెచ్చుకునేవారు. వెనువెంటనే లోపలినుంచి వచ్చిన ఆ గృహిణిని, లావణ్యమూర్తిలా అందంగా అడుగులు వేసుకుంటూ వచ్చే సురేఖని రెప్పవాల్చకుండా చూసేవారు. తొలిసారి యీ యింటినీ, యీ గృహిణినీ చూసిన ప్రతివ్యక్తీ - రాజగోపాల్‌కి లభించిన యీ అదృష్టానికి కాస్త అసూయ పొందకుండా వుండలేకపోయేవారు. చాలామందికి సురేఖ దాస్పరుగా తెలియదు. అతను తిరిగే బిజినెస్ సర్కిల్స్‌లో కళారాధనకి వ్యవధిలేదు. 'బెనిఫిట్ షో'కి టికట్సు కొంటంతో - అగిపోయేవాళ్ళ

బాలాముంది. నేతచీరెలు కట్టుకుని, కళ్ళనిండా కాటుకతో హంసలా నడుచుకుంటూ వచ్చే యీ సురేఖ పదవిన్యాసం వెనక ఏళ్ళతరబడి పొందిన శిక్షణ వుందని బాలాముంది పరిశ్రపోయేవారు. ఇంత అందంగా ఒక స్త్రీ నడవగలదా? అన్నట్లు చూసేవారు.

ఈ కొత్తయింటి అలంకరణ, గృహిణిగా తన ప్రత్యేకత యీ మార్పులు సురేఖకి కొంత మనశ్శాంతిని యిస్తున్నాయి. ఆమె బి.పి.ని కంట్రోల్ చెయ్యగలిగాడు డాక్టర్. గురువుగారుకూడా తరుచు కేకవెయ్యడం లేదు. సురేఖకి ఎక్కువభాగం నృత్యనికేతనం నిర్వహణ బాధ్యత వొడులుతున్నారు. రోజూ మూప్పైమంది పిల్లలకి స్టేజీలవారిగా విభజించి ఆ తరగతుల్లోని పిల్లలని గ్రూప్‌లుగా విభజించి వారికి శిక్షణ గరిపే బాధ్యత సురేఖకి వొప్పజెప్పారు. ఆ చిన్నపిల్లలకి, ఏ పెద్దపిల్లలు నేర్పాలి ? ఏ గ్రూప్‌కి ఎవరు నేర్పాలి ? ఇలాంటివన్నీ సురేఖకి వదిలేశారు. పబ్లిక్ పెర్‌ఫామెన్స్ విషయంలో అప్పుడప్పుడు ఇంకా కోపతాపాలు చికాకులూ వస్తూవున్నా – నిత్యకృత్యంలో సురేఖ అందమైన గృహిణిగా, నికేతనంలో గురువుగారి తరువాత అధికారిణిగా స్థానం సంపాయించుకుంది. ఇది వొక విధంగా ఆమెలోని అశాంతిని తగ్గిస్తూ వుంది.

ఆ సంవత్సరం రాజగోపాల్‌ని కంపెనీవారు యూరప్–అమెరికాలకు టూర్‌కి పంపారు. రాజగోపాల్ తనతోపాటు సురేఖనికూడా తీసుకెళ్ళాడు. అప్పటికి ఆ దేశాలు సురేఖ అయిదారుసార్లు చూసి వచ్చింది. ఇటు సిలోన్, మిడిల్ యీస్టుదేశాలుకూడా చూసింది. ప్రదర్శనలకోసం యించుమించు ప్రపంచమంతా చూసింది.

అయితే ఆ చూడటంలో – రాజగోపాల్‌తో వెళ్ళటంలో – చాలా తేడా వుంది. రాజగోపాల్ సురేఖ తనకి గైడ్‌గా వుంటుందనుకున్నాడు. కాని అది తల్లకిందులయింది. ప్రతి దేశంలో సురేఖకి – ఏ ప్రదేశాలు

చూడాలి, ఏ చారిత్రాత్మకస్థలాలు చూడాలి అన్నది అతను – వాటి తాలూకు చరిత్ర విశదీకరించి చెప్పి తీసుకెళ్ళేవాడు.

'ఇవన్నీ, నువ్వు చూసేవుంటావు' అన్నాడు రాజగోపాల్ పారిస్‌లో యూఫిల్‌టవర్ ఎక్కబోతుంటే. లిఫ్ట్‌దగ్గిర నుల్చున్న సురేఖ నవ్వింది.

'దేనికి నవ్వుతున్నావ్?'

'సర్కస్‌లో జంతువులని ప్రదర్శిస్తారుగాని, వాటికి దేశాలు చూపించటానికి తీసుకెళ్ళరు.'

'ఛీ, మరీ అన్యాయంగా వుంది నీ కంపారిజన్.'

'నిజం గోపీ. నేను ప్రపంచంలో చాలాదేశాలు తిరిగాను. ఒకటి : నేను చదువుకోలేదు. రెండు : గురువుగారు మమ్మల్ని స్కూలుపిల్లల కంటే హీనంగా కట్టడుల్లో పెట్టేవారు. ఈ దేశాలకి వచ్చినప్పటినుంచీ మేము తిండికి – మన తెలుగుతిండికి కరువువాచి వుండేవాళ్ళం. ఎవరు కడుపునిండా తిండి పెడతారా అని చూసేవాళ్ళంతప్ప, ఏం చూడాలి అన్న ధ్యాస వుండేదికాదు.'

'అంత దారుణమా?'

'చెపితే చాలామంది నమ్మరు. ప్రోగ్రామ్స్ అయిపోయాక ఒక్క రోజు షాపింగ్ అనేవాళ్ళు....'

'నువ్వు ఏమీ కొనుక్కునేదానివికాదు. బయట కెడితే ఖర్చు అవుతుందని....కదిలేదానివి కావు – అవునా?' అతని కంఠంలో జాలి. ఈ సురేఖ తన చదువుకోసం ఎంత పొదుపుగా వున్నదీ అతను మర్చిపోలేదు. పాపం అయిదేళ్ళపాటు ఎంత కష్టబడింది!

'అప్పుడు అంత జాగ్రత్తగా వున్నాను కాబట్టి – ఈరోజు దర్జాగా నీతో తిరుగుతున్నాను. నీ విషయంలో గురువుగారిని వోడించాను.'

'ఇక్కడకూడా ఆయన గొడవేనా?'

'నిన్నూ ఆయన్నీ తల్చుకోకపోతే నాకు జీవితం ఏమిటి? మొదట్లో ఏమనేవారో తెలుసా?'

'నిన్ను మోసంచేసి పారిపోతానని అనేవారనుకుంటా, అంతేనా?'

'సరిగ్గా యీమాటనే అనేవారు — నీకెలా తెలుసు?'

'ఊహించాను. మా మగవాళ్ళమంతా ఇలాగే ఆలోచిస్తాం. ఆడది ఆడదాన్ని నమ్మదు. అలానే మొగవాడు మరోమొగవాడిని నమ్మడు. ఇది మానవ స్వభావం' అన్నాడు రాజగోపాల్.

సురేఖకి ఒక విషయంలో ఆశ్చర్యంగా వుంటుంది. తన జీవితంలో అతి ముఖ్యమైన వ్యక్తులు గురువుగారూ, రాజగోపాల్. ఆయన మొరటుగా మాట్లాడుతారు — ఎదుటివ్యక్తిని న్యూనత పరిచితేగాని ఆయన ఊరుకోడు. రాజగోపాల్ మాటల్లో అల్లరీ, చిలిపితనం వుంటుంది. మాటల్లో సంస్కారం — ప్రతిదీ విశదీకరించి చూడగల హృదయవైశాల్యం వుంది. కాని ఈ యిద్దరి మాటల్లోనూ భావాల్లోనూ చాలా పోలికలు కనిపిస్తాయి. ఈ యిద్దరికీ తనమీద వాత్సల్యం, తనమీద అధికారం రెండూ వున్నాయి.

ఆ మూడునెలల విదేశయానంలో సురేఖ చాలా సంతోషంగా వుంది. ఒక్కసారికూడా కోపం రాలేదు. ఆమె బి. పి. నార్మల్‌గా వుంది. రోజూ ఆమె బి. పి. చూడటం రాజగోపాల్ దినచర్యలో భాగమయింది. ఆమె బ్లడ్‌ప్రెషర్ చూసే సామగ్రి కొనుక్కుని, అది ఎలా చూడాలో నేర్చుకున్నాడు రాజగోపాల్.

ఇండియాకి తిరిగివచ్చాక మళ్ళీ రొటీన్‌లో పడిపోయాడు రాజగోపాల్. అతనికి ఆఫీసు, యిల్లు, సురేఖ, ఇవి పరిపూర్ణమైన శాంతిని, ఆత్మస్థయిర్యాన్ని యిస్తున్నాయి. అందరూ అనుకున్నట్లు ఈ సురేఖని చేపట్టి తాను చెడిపోలేదు. నాశనం అయిపోలేదు. తన వున్నతికి తానింత పెద్దవాడవటానికి ఆమె కారణమయింది.

ఇదే హైద్రాబాద్‌లోవుంటే ఈపాటికి పెయ్యో-పన్నెండువందలో జీతం వొచ్చును. కుడితిలోపడ్డ ఎలకలాగా తాను గుడివాడకీ-హైద్రాబాద్‌కీ మధ్య తిరుగుతుండేవాడు. చెల్లెళ్లూ - వాళ్ళ పిల్లలూ, మళ్ళీ వాళ్ళ పెళ్ళిళ్లూ ఇలా రంగులరాట్నంలాగా గుండ్రంగా తిరుగుతుండేవాడు. తన మనసుని చంపుకుని ఆ పరిసరాల్లో కూరుకుపోక, తెగించి ఇక్కడ వుండిపోవడం రాజగోపాల్ తను జీవితంలో చేసిన మహత్తరమైన నిర్ణయమని అనుకుంటూ వున్నాడు. అతనికి అశాంతిలేదు - అసంతృప్తికూడా లేదు. తాను అనుకున్నవి పొందగలిగాడు. ఇంతకిమించి తనకి ఏమీ అక్కర్లేదు. సురేఖ, తనూ కలిసి నిర్మించుకున్న ఈ జీవితం సౌరభమయమయింది, కళాత్మక మయింది - అన్న గర్వంకూడా వుంది అతనిలో.

వేలాది ప్రేక్షకుల ప్రశంసలు, రంగురంగు దీపాల తళతళలు, కరతాళధ్వనులు అభిమానుల స్వాగతాలు రుచిచూసిన సురేఖకి ప్రశాంతమైన జీవితం తృప్తినివ్వలేకుండా వుంది. ఏదో కావాలి, ఇంకా ఏదో కావాలి. డబ్బుకి కొరతలేదు. భర్త ప్రేమకీ కొరతలేదు. నృత్యనికేతనంలో తన ప్రత్యేకస్థానం బలపడింది. అయినా యివ్వేవీ ఆమెకి శాంతిని యివ్వలేకుండా వున్నాయి. ఒక క్షణంలో తనకి అన్నీ వున్నాయి అని పిస్తుంది. మరుక్షణంలో తన జీవితంలో పరిపూర్ణత లోపించింది - ఇంకా ఏదో కావాలన్న ఆరాటం.

ఈమధ్య - సురేఖ రోజూ పూజ చేయటం ఆరంభించింది. లోగడ ఆమె వేదికమీద నటరాజమూర్తికి - గురువుగారికి పూజ చేసేది. వేదికమీదనున్న ఆ లోహవిగ్రహానికి, రక్తమాంసాలతో నిండిన ఈ మానవమూర్తికిమటుకు ప్రణమిల్లేది. అంతకిమించి పూజలు పునస్కారాలు వుండేవికావు. ఇప్పుడు స్టోర్‌రూమ్‌పక్కనున్న చిన్నగదిలో ఒకమూలగా దేవుడిపటాలూ, దీపారాధనా, అగరువత్తులూ యిత్యాది కార్యక్రమం

వెలిసింది. రోజూ స్నానంచేసి దీపం వెలిగించిగాని ఆమె టీ తీసుకోవటం లేదు. ఈ కొత్తపద్ధతి ఎందుకు వచ్చిందో, ఈ కార్యక్రమం ఏ ఉపద్రవానికి దారితీస్తుందోనని లోలోన భయపడుతున్నాడు రాజగోపాల్.

'గోపీ నాకేం తోచటంలేదు' అంది సురేఖ ఒకరోజున.

'ఆఫీసుమానేసి నీ ఎదురుగుండా కూచోనా ? ' తన సహజ అల్లరి ధోరణిలో అడిగాడు.

'నువ్వు కూచోవద్దు. నీ పాపాయి నా వొళ్ళో కూచోవాలి' అంది సురేఖ సిగ్గుపడుతూ. వేదికమీదకూడా యింత మధురదరహాసం ఆమె చెక్కిళ్ళలో ప్రతిఫలించలేదు ఏనాడూ.

రాజగోపాల్ క్షణంసేపు ఆగాడు. ఈ మధ్యన సురేఖ పిల్లలకోసం ఆరాటపడుతున్నదని అతను గ్రహించుకున్నాడు. కొన్నాళ్ళు చదువు కుంటున్నాడనీ, కొన్నాళ్ళు ఆమె లావణ్యం చెడిపోతుందనీ, ఆమె మెడలో మంగళసూత్రం కట్టలేదనీ – పైకి అనకపోయినా – యిద్దరూ పిల్లలు కలుగకుండా జాగ్రత్తపడేవారు. ఈ విషయంలో అతనే ఎక్కువజాగ్రత్తగా వుండేవాడు. ఈమధ్య అటువంటి జాగ్రత్తలకి సురేఖ వొప్పుకోవటంలేదు. అతనికి వ్యవధి నివ్వకుండా ఆవేశంతో ఆమె దగ్గరకొస్తున్నది. ఈ కొత్త సురేఖ అతనిని అద్భుతమైన శృంగారమూర్తిగా సంతోషపెడుతున్నది. ఈ ఆవేశానికీ శృంగారానికి వెనుక మాతృత్వపు వాంఛ అతనికి లీలగా కనబడుతూనే వుంది. కాని సురేఖ ఎప్పుడూ ఇంతసూటిగా అనలేదు.

'మనకి పిల్లలెందుకు – నువ్వూ నేనూ చాలమా ? '

'ఉహుం. నాకో బాబు కావాలి.'

'మొగపిల్లవాడే ఎందుకు?'

'ఆడపిల్లయినా సరే మనకోపిల్ల కావాలి. నేను తల్లిని కావాలి' అంది సురేఖ తలవంచుకుని – జాజిమొగ్గలవలెవున్న తన వేళ్ళవంక చూసుకుంటూ.

అతను విని వూరుకున్నాడు. సురేఖకి పిల్లలు కలిగితే, కొత్త సమస్యలు ప్రారంభం కావా? ఆ పిల్లల భవిష్యత్ ఏమిటి? మొగపిల్లవాడయితే తన తరువాత వాడికి ఈ సంపాదనమీద హక్కు వుంటుందా? ఆడపిల్ల అయితే పెళ్ళి సమస్య అవదా? కృష్ణవేణి ప్రస్తుతం ఎటువంటి పేచీ పెట్టడంలేదు. రేపు పిల్లలు కలిగితే, సీత సంగతేమిటని ప్రశ్నించదా? లీగల్‌గా అన్ని చిక్కులూ తాను ఎదుర్కోగలడు. కాని రేపు యీ పిల్లల తల్లి పుట్టుపూర్వోత్తరాలు అడగరా? ఇదంతా మరో యిరవై ఏళ్ళు దాటిన మాటకదా! అప్పటికి సంఘం మారిపోదా? వ్యక్తుల దృష్టి మారిపోదా? పన్నెండేళ్ళ క్రితానికీ, యీనాటికీ ఎటువంటి మార్పూలేదు. పెళ్ళి అంటే జాతకం, కులం, గోత్రం, సంప్రదాయం, కట్నం ఈ మాటలేతప్ప కొత్త మాటలు వినిపించడంలేదు. కొత్తభావాలు రావటంలేదు. నాచులాగా యీ సమాజాన్నంతా చుట్టుబెట్టుతున్న ఆచారాలు యివి. ఎలా మారుతాయి? మారవు. ఇంకా వందఏళ్ళు గడిచినా ఇంతే. తన పిల్లలు - సురేఖకి కలుగబోయే పిల్లలూ అన్నపుడు తనకి యిన్ని ఆలోచనలు, సంశయాలూ వస్తున్నాయే - సీత గురించి ఏనాడూ, ఒక్క తలంపుకూడా ఎందుకు రాలేదు? రాజగోపాల్ ఆ భావాన్ని వెనక్కి నెట్టేశాడు. అటువైపు ఆలోచించదలచుకోలేదు.

'మనం డాక్టరుదగ్గిర కెళదాం - నన్ను లేడీడాక్టరుదగ్గిరకు తీసుకెళ్ళండి' ఇవి రోజూ ఏదో ఒక టైములో అనటం మొదలుపెట్టింది సురేఖ. ఒక్కోసారి ఇది సాధింపులోకికూడా దారితీస్తూవుంది. ఇవ్వాళా రేపు అంటూ జాప్యం చేస్తున్నాడు రాజగోపాల్.

ఆరోజు శనివారం. అతనికి ఆఫీసు లేదు. ఇంట్లో కూచునే పి. ఎ. కి అర్జంటు లెటర్సు డిక్టేట్ చేస్తున్నాడు. గుమ్మంలో తమ కారు. డ్రయివర్ తలుపు తెరిచి పట్టుకున్నాడు. సురేఖ ఇంత త్వరగా ఎలా వచ్చేసింది.

ఆశ్చర్యంగా తలఎత్తి చూశాడు రాజగోపాల్. కారులోంచి గురువుగారు దిగుతున్నారు.

రాజగోపాల్ 'రండి - రండి' అంటూ లేచి నిల్చున్నాడు.

లాన్‌లో కుర్చీలు వేసుకుని అతను పి. ఎ. కి డిక్టేట్ చేస్తున్నాడు. పక్క బంగళాకీ - తనకీ మధ్యగల గోడలావున్న అశోకచెట్ల నీడ ఇంచు మించు పదకొండుగంటలదాకా యీ లాన్‌మీద పడుతూంటుంది. అంచేత ఉదయంవేళ యీ లాన్‌లో కూచుని పని చేసుకుంటూంటాడు అతను.

'మీపని ఆపకండి. నాకు తొందరలేదు' అంటూ పక్కకుర్చీలో కూచుని పేపరు చేతిలో పుచ్చుకున్నారు గురువుగారు. ఆయన పేపరు వెనుకనుంచి రాజగోపాల్‌ని పరికిస్తున్నారు. రాజగోపాల్‌కి కొత్త హొయలు వచ్చింది. నలుపు విరిగి చామనచాయలోకి వచ్చాడు. నెత్తిమీద వెంట్రుకలు చాలా రాలిపోయాయి. బాల్డ్ హెడ్డుచుట్టూ కుచ్చులా నలుపూ తెలుపూ కలిసిన వెంట్రుకలు, కళ్ళజోడు పెట్టుకుని చకచక ఇంగ్లీషులో లెటర్ డిక్టేట్ చేస్తున్నాడు. ఒక్క తృటికాలం ఆయనకి కలుక్కుమంది. తనకి ఇంగ్లీషు ఇంత ధారాళంగా రాదు. ఇంగ్లీషులో తను ఉపన్యాసం యివ్వలేడు, అయితేనేం దేశదేశాలు తిరిగాడు. ఎందరో శిష్యులని తయారుచేశాడు. మళ్ళీ సర్దుకున్నారు గురువుగారు.

ఉత్తరం డిక్టేట్ చెయ్యటం అయిపోయింది. పి.ఎ కాయితాలు సర్దుకుని నిశ్శబ్దంగా అక్కడ్నించి కదిలిలోపలికి వెళ్ళాడు.

'మిమ్మల్ని డిస్టర్బ్ చేశానా ?' అడిగారు గురువుగారు నవ్వుతూ.

'అదేంలేదు. ఈ చెప్పినవి టైపుచెయ్యాలిగా చేసుకొస్తాడు' ఆయనవంకచూస్తూ అన్నాడు రాజగోపాల్. గురువుగారిలో ఏం మార్పు ఆయన పన్నెండేళ్ళక్రితం ఎలావున్నారో యిప్పుడూ అలాగే కడ్డీలా వున్నారు. తలమీద జుట్టు తెల్లగా వెండిలావుంది. అదొక్కటే మార్పు.

'టీ తీసుకోండి' రాజగోపాల్, నాయర్‌ని పిలిచి పాలూ-పంచదారా వో టీ తీసుకురమ్మన్నాడు.

'పాలు పెయ్యొచ్చు పంచదార వద్దు' అన్నారు గురువుగారు.

'డయాబిటీసా ? '

'రాలేదు. ముందుజాగ్రత్త. సురేఖ డిమాన్‌స్ట్రేట్ చేస్తోంది. మీతో మాట్లాడాలని వచ్చాను'

'నాతోనా ? మళ్ళీ సురేఖ పేచీమొదలు పెడుతోందా ? '

'ఒకవిధంగా అవును – కాదు.'

'అదేమిటి ? '

'ఇంకో మూడునెలల్లో మాస్కోకి వెళ్ళబోతున్నాము. 'యూత్ ఫెస్టివల్స్'లో మన ప్రోగ్రామ్ వుంది. సురేఖని తీసుకెళ్ళనా వద్దా అని మిమ్మల్ని అడుగుదామని'

'నన్నెందుకు ? మీ యిష్టం – మీ శిష్యురాలి ఇష్టం'

'ఈమధ్య సురేఖలో వెనకటిశ్రద్ధ తగ్గిపోయింది. ఇంచుమించు తనంత టాలెంటుగలవాళ్ళూ మరోనలుగురుపిల్లలు రడీగా వున్నారు. వాళ్ళని తీసుకెళితే .... '

రాజగోపాల్ రెప్పవెయ్యకుండా వింటున్నాడు.

'అక్కడ గొడవలు జరిగి 'హిస్టీరికల్'గా అవుతుందేమోనని భయంగా వుంది. ఇక్కడ నికేతం చూసుకునే నమ్మకమైన మనిషికావాలి. అంచేత .... '

'ఈ విషయం సురేఖకి చెప్పారా?'

'చెప్పలేదు. అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది. ఈ ఆడపిల్లలకి డాన్సు నేర్పేబదులు ఏ కూలిపని చేసుకున్నా – సుఖంగా, శాంతిగా వుంటుంది అని.'

రాజగోపాల్ నవ్వుతున్నాడు.

'నిజం – ఒక్క సురేఖని మానేజ్ చెయ్యడం ఎంత కష్టమో మీకు స్వానుభవంలో తెలిసివచ్చే వుండాలి. నేను ఇలాంటి సురేఖలని ఎంతమందిని చూడాలో వూహించండి. ప్రతిపిల్లా తనే 'లైమ్‌లైట్'లో వుండా లనుకుంటుంది. ఒకరి పొడ ఇంకొకరికి గిట్టదు. ఇటూ అటూ అయితే జుట్లు పీక్కోని, పీకలు నులుముకుని కొట్లాడేంత స్థితికి వచ్చేస్తారు.'

'మరి ఎందుకు భరిస్తున్నారు?' అడిగాడు నవ్వుతూ.

'ఆ ప్రశ్న నేనూ మిమ్మల్ని అడిగితే....'

'సురేఖ నాప్రాణం కొబట్టి – అని బదులు చెపుతాను.'

'నేను నాట్యకళ నా వూపిరి కొబట్టి అని బదులు చెప్పాల్సివస్తుంది. ఈ కళకి ఆడవాళ్ళు ప్రాణం. ఈ ఆడపిల్లలు లేనిదే, నాకు గడవదు – వాళ్ళ అసూయలూ కోపాలూ భరించనూలేను' అన్నా రాయన. రాజగోపాల్ వింటున్నాడు.

'ఇంత కష్టపడి – నావూపిరి అంతా కూడగట్టి వాళ్ళకి విద్య నేర్పుతాను. సగంమంది సినిమాలవైపుకి పారిపోతారు. కొందరేమో డబ్బుని పెళ్ళి చేసుకుంటారు. మిగిలిన ఒకళ్ళిద్దరూ ఇంకోపిల్ల పైకి రాకూడదు అంటూ నానా గొడవా చేస్తారు. అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది – ఈ నికేతనం ఒక విశ్రాంతిగృహంతప్ప–దీన్ని అంటిపెట్టుకుని ఎవరూ వుండరని.'

'అలా అనకండి. పట్టుకు వేళ్ళాడితే వదిలించుకోడం మీకే కష్టం అవుతుంది' అన్నాడు నవ్వుతూ.'

'అదీ నిజమే. జీవితంలో కొత్త ఛాన్సులు వచ్చేపిల్లలు – నన్ను అంటిపెట్టుకుని వుండరు. ఈ ఆడపిల్లలకి డాన్సు నేర్పక – మొగపిల్లలకే అభినయం నేర్పితే యిన్ని సమస్య లుండవేమోననికూడా అనిపిస్తూ వుంటుంది.' అన్నారాయన.

'మీకోకథ చెప్పనా?' అడిగాడు రాజగోపాల్.

ఆయన కుతూహలంగా చూశారు. 'ఎక్కడో యింగ్లీషు పత్రికలో చదివిన గుర్తు....ఇది సంస్కృతంనుంచి యింగ్లీషులోకి మార్చారుట.'

'అది మనకి అలవాటేగా' అన్నారాయన.

'సృష్టికర్త మొదట పురుషుని సృష్టించాడు. ఆ పురుషుడు తనకో తోడుకావాలి — నేను ఒంటరిగా వుండలేను అని సృష్టికర్తతో మొరపెట్టు కుంటే, ఆయన తేనెలోని తియ్యదనాన్ని, పువ్వులోని రంగులని, మంచులోని ఆర్ద్రతని, చిగురాకులలోని మృదుత్వాన్ని, శిలలలోని కాఠిన్యాన్ని ఇంద్ర ధనస్సులోని వొంపుని, వీటన్నిటినీ కలిపి స్త్రీగా సృష్టించి, ఆమెని పురుషునికి వొప్పజెప్పాడుట – నీకు తోడుగా తీసుకెళ్ళమని! కొన్నాళ్ళకి పురుషుడు సృష్టికర్తదగ్గిరకు ఏడ్చుకుంటూ వచ్చాడు – ఈ స్త్రీ నాకు అక్కరలేదు. నన్ను బతకనివ్వటంలేదు. ఒక క్షణంలో లాలిత్యం, మరో క్షణంలో ప్రళయభూయిష్టం – భరించలేను మీరే తీసుకోండి – అని! భగవంతుడు నవ్వుతూ ఆ స్త్రీని తనే స్వీకరించాడు – కొన్నాళ్ళకి పురుషుడు మళ్ళీ సృష్టికర్తని శరణు జొచ్చాడు. ఆ స్త్రీ పక్కన లేకపోతే, నేను నవ్వటం మర్చిపోయాను. లోకమంతా శూన్యంగా వుంది. నా స్త్రీని నాకు యివ్వండి అని. సృష్టికర్త నవ్వుతూ, అన్నాడుట 'నువ్వు ఆమెతో కలిసి బతకలేవు – ఆమె లేకుండానూ బ్రతకలేవు – ఎలా? ఆమెని ఆమెగా స్వీకరించి బ్రతకడం నేర్చుకో అని.' 'ఎలా వుంది కథ?' అడిగాడు రాజగోపాల్.

'మన జీవితాల్లాగానే వుంది.' అన్నారు గురువుగారు.

'మీ ట్రిప్ ఎన్నాళ్ళు?'

'మూడువారాలు. మాస్కో – లెనిన్‌గ్రాడ్. ఇటు ఏషియన్ రష్యా మొత్తం ఎరు ప్రదర్శనలు. సురేఖ .... '

'తీసుకెళ్ళకండి. తనకి వంట్లోకూడా అంత బాగుంటంలేదు.

'ఏవిటి ? ఏమన్నా అనారోగ్యమా ? '

'కాదు. పిల్లలు కావాలట. లేడీడాక్టరుని చూస్తానని వేధిస్తోంది. ఈ కారణంగా .... నవ్వుతూ అన్నాడు రాజగోపాల్. ఆ నవ్వు అతని కళ్ళలో లేదన్నవిషయం గురువుగారు పసిగట్టారు.

'ఒకరకంగా అదీ మంచిదే. సురేఖ జీవితంలో మీరు ప్రవేశించక పోతే ఇంకోరకంగా వుండేది .... మీరు అన్నారే అలా డాన్సుని పట్టుకు వేళ్ళాడుడూ వుండేది. పెళ్ళి–పిల్లలూ ఏమీవద్దు. సర్వం నా నాట్యమే అనే మొండిఘటం గాకుండా ఈమార్గం ఎన్నుకుంది. పిల్లలు, యిల్లు ఇవి ఆమెలోని అశాంతిని పోగొట్టవచ్చు. ఎంతమంది కొత్తపిల్లలొచ్చినా – సురేఖకివున్న ప్రత్యేకస్థానం ఎవరికీ వుండదు' అన్నారు గురువుగారులేస్తూ. అయన్ని కారుదాకా పెళ్ళి పంపించాడు రాజగోపాల్.

'నేను పెళ్ళి సురేఖని పంపుతాను. కారు కావాలన్నానుగాని, యిక్కడికి అని చెప్పలేదు. చెప్పదలచుకుంటే చెప్పండి, నాకేం యిబ్బంది లేదు' అన్నారాయన కారులో కూచుంటూ ! కారు కదిలింది.

రాజగోపాల్ జీవితంలో నూతన ప్రకరణ ప్రారంభమయింది. అది మందులూ డాక్టర్లూ ప్రకరణ అని చెప్పుకోవాలి. సురేఖని, లేడిడాక్టరు చూసి, డి. యన్. సి. చేస్తే, వెంటనే పిల్లలు పుట్టేస్తారట అంది.

ఆపరేషన్‌కి ముందురోజు రాత్రి వచ్చి నర్సింగ్‌హోమ్‌లో చేరితే చాలు – చాలా చిన్నఆపరేషన్ అన్నారు. రాజగోపాల్ ఖంగారుపడి పోయాడు. పెద్దఆపరేషన్ జరుగుతున్నంత హడావుడిపడిపోయాడు. ఎ. సి. రూమ్ బుక్ చేశాడు. రాత్రంతా తనే దగ్గిరవుండాలని షరతు పెట్టాడు. అరగంటకూడా పట్టని ఆపరేషన్‌కి అతను అంత ఖంగారుపడుతుంటే నర్సులూ, డాక్టర్లూ చాటుగా నవ్వుకున్నారు. 'ఈ ఆపరేషన్‌కే ఇంత గొడవ

పడుతున్నాడు - రేపు పురుడొస్తే పెళ్ళానికి బదులు ఈ మొగుడే నెప్పులు పడ్తాడు కాబోలు' అంది ఆ వార్డ్ యిన్‌చార్జి అయిన నర్స్.

డి. యస్. పి. జరిగింది. మూడునెలలు, నాలుగు, ఆరునెలలు గడిచాయి. మళ్ళీ సురేఖ పోరు ప్రారంభించింది. ఈ డాక్టరుకి బాగా తెలియదు - ఇంకో డాక్టరుదగ్గిర కెళ్ళాలని. ఈసారి సురేఖని స్పెషలిస్టు దగ్గరకు తీసుకెళ్ళాడు. ఆమె ప్రసిద్ధి పొందిన 'గైనకాలజిస్టు'. అన్ని టెస్టులూ చేసింది. రాజగోపాల్ ఒక్కడినీ మరునాడు రమ్మనమంది.

మరునాడు అతను వంటరిగా వెళ్ళాడు ఏం చెబుతుందో అన్న ఆదుర్దాతో.

'మీ మిసెస్‌కి పిల్లలు కలగరు - అది సాధ్యం అనుకోను' అందామె 'ప్రిలిమెనరీ' మాటలు అయాక.

'ఏం?'

'ఆమె డాన్సరుకదూ?'

'అవును. దానికీ పిల్లలకీ సంబంధం ఏమిటి?'

'ఉంది. అందరి విషయంలో ఏమోగాని మీ ఆవిడ విషయంలో డాన్స్‌కీ పిల్లలకీ సంబంధం వుంది.'

'ఇకముందు చెయ్యకూడదా?'

'అదికాదు - ఆమె గర్భసంచీ తిరగబడి మెలికపడింది. రెక్టమ్‌మీద ప్రెస్‌అయి - గట్టిబడిపోయింది. ఆ ట్విస్ట్ అయినచోట హార్డ్‌గా వుంది. అంచేత పిల్లలు కలిగే ఛాన్సు చాలాతక్కువ.'

'ట్రీట్‌మెంటు లేదా?'

'మిల్కు యంజక్షన్సూ - అల్ట్రావైలెట్ రేసూ అంటూ చేస్తాంగాని పెద్ద ఫలితం వుండదు. ఆనక మీ యిష్టం.'

'ఫరవాలేదు. ట్రీట్‌మెంటు మొదలుపెట్టండి.'

'ప్రయోజనంలేని ట్రీట్‌మెంటు దేనికి?'

'ఆమె హాపినెస్‌కోసం.'

'యు ఆర్ ఏ ఫైన్ మాన్. ఐ ఎప్రీషియేట్ యువర్ పాయింట్' అన్నది లేడీడాక్టరు కాస్త ఫీలింగ్‌తో. అప్పటిదాకా - ప్రొఫెషనల్‌గా - కట్టే కొట్టే అన్నట్లు మాట్లాడిన ఆమె కంఠంలో మార్దవం, కళ్ళలో సానుభూతి చోటుచేసుకున్నాయి. రాజగోపాల్ ఫీజు యిచ్చి ఇంటికొచ్చాడు.

మంచిరోజు చూసి సురేఖ సిట్టింగ్స్‌కి వెళ్ళటం మొదలుపెట్టింది. ఈ వైద్యంవల్ల ఎటువంటి ప్రయోజనం లేదన్నవిషయం అతనికి తెలుసు. దీంతో పిల్లలు పుడతారని కొండంత ఆశతో వుంది సురేఖ.

సురేఖ కోరికలన్నీ తాను తీర్చలేడు. తాను అశక్తుడు. ఇది తన చేతిలో లేదు. పరిస్థితులతో రాజీపడటం నేర్చుకున్నాడు రాజగోపాల్.

## 9

ఏడాది గడిచింది. రెండు, మూడు, నాలుగేళ్ళుగడిచాయి. సురేఖకి పిల్లలు కలుగుతారన్న ఆశ నానాటికి అడుగంటి పోతున్నది. ఆమెకు డాక్టర్లమీద నమ్మకం తగ్గుతోంది. పూజలూ, పునస్కారాలు, దేముళ్లూ - వీటిమీద నమ్మకం ఎక్కువయిపోతున్నది. 'తిరుపతి వెళ్దాం' అంది. తీసుకెళ్ళాడు రాజగోపాల్. 'కన్యాకుమారిని చూద్దాం' అంది. కారులో తీసుకెళ్ళాడతను. ఆమె కోర్కెను అతను ఏమీ కాదనటంలేదు. బాబాలని నమ్మింతానంది. తలవూపాడు. కాని, ఆమె ఆశ నెవేరలేదు.

సురేఖకి మళ్ళీ అశాంతి - కోపం ఎక్కువవుతున్నాయి. ఈమధ్య రాజగోపాల్తోకూడా తరుచు దెబ్బలాడుతోంది. నవ్వుతూ-తుళ్ళుతూఉండే ఈ

సురేఖ, ఎందుకు యిలా మారిపోతోంది ?— అతనికి దిగులుగా వుండేది. సురేఖలో యీ పిల్లలపిచ్చి ఎలా వదిలించాలి అని మథనపడుతున్నాడు.

'సురో' అని ఒకరాత్రి కాంక్షతో ఆమెని దగ్గరకు తీసుకోపోయాడు. పూర్వంలాగా సురేఖ అతనికి దగ్గరగా వుంటంలేదు. మీదపడి చిన్నపిల్లలా అల్లరి చెయ్యటంలేదు.

సురేఖ అతనిచేతిని విసిరికొట్టి దూరంగా జరిగింది.

'ఎందుకిల్లా మారిపోతున్నావు. నామీద యిష్టం పోయిందా ? '

'జంతువుల్లాగా - ఎప్పుడూ ఇదితప్ప నీకు మరోధ్యాసలేదా ?' విసురుగా అడిగింది సురేఖ.

అతను నిర్ఘాంతపోయాడు. ఎన్నడూ సురేఖమీద కోపంరాని - రాజగోపాల్‌కి ఆమెపైన ఒకవిధమైన తిరస్కారం కలిగింది. ఇన్నేళ్ళ పరిచయంలో తమ ప్రేమలో యీ బాంధవ్యాన్ని జంతుసంబంధంతో పోల్చిందా ? అతను దూరంగా జరిగాడు.

సురేఖ వెక్కివెక్కి ఏడుస్తోంది. అతనికి జాలివేసింది. పాపం, యీ పిచ్చిదానికి తనుతప్ప ఎవరున్నారు ? తనమీద కోప్పడక ఎవరిమీద విసుక్కుంటుంది ?

'సురో' అన్నాడు అతను మెత్తగా. ఆ కంఠంలో అనిర్వచనీయమైన జాలి.

సురేఖ భుజాలు దుఃఖంతో కదులుతూ వున్నాయి.

'చెప్పు, నీబాధ ఏమిటో చెప్పు ? '

'గోపీ, మనకి పిల్లలు పుట్టరా ? నాకు పిల్లలుపుట్టే యోగం లేదు కదూ ? '

'ఏం చేస్తాం - మనకి ప్రాప్తంలేదు'

'గోపీ - ఒకటి అడుగుతాను. చేస్తానని మాట యిస్తావా ? ' అడిగింది.

'నీకు దూరంకాకుండా వుండేపని ఏదయినా చేస్తాను. నన్ను విసుక్కో- అంతేగాని దూరంగా వెళ్ళిపోకు'

సురేఖ అమాంతం అతన్ని రెండుచేతుల్తో చుట్టేసింది. 'గోపీ-గోపీ నాకు బుద్ధిలేదు. ఎందుకో కోపం వస్తుంది. విసుగేస్తుంది. నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకుండా వున్నాను. ఏం చెయ్యను చెప్పు'

'డాక్టరుని కన్సల్టు చేద్దామా - తీసుకెళ్ళనా?'

'ఒద్దు.'

'మరి?'

'మనం ఒక పిల్లని పెంచుకుందాం - పిల్లయినాసరే - పిల్లాడయినా సరే పెంచుకుందాం.'

'ఓస్. ఇంతేగదా, తప్పకుండా. నీకు సంతోషం కలుగుతుందీ అంటే ఒకరుకాదు, పదిమంది పిల్లలని పెంచుకుందాం. సరేనా?'

ఆ రాత్రి సురేఖ చాలా సంతోషంగా వుంది. చాలారోజులకి ఆమె రాజగోపాల్‌కి దగ్గరగా జరిగింది - ఆతన్ని ముద్దుల్తో ముంచేసింది.

సురేఖ పిల్లవాడిని పెంచుకోవాలని, 'ఎడాప్టనుకు పిల్లలని ఎవ రిస్తారు?' అన్న వేటలో పడింది. పుస్తకాల్లోనూ, సినిమాల్లోనూ అభాగ్యురాళ్ళు అయిన స్త్రీలు పసిగుడ్డులని సంపన్నుల యింటి మెట్లమీద వదిలి వెళ్ళిపోతూంటారు. తన జీవితంలో అలాంటిది సంభవించదేం అని వాపోసాగింది సురేఖ. మిషనరీవాళ్ళు పిల్లల్ని పెంచుకోటానికి యిస్తారుట అని విని కారేసుకుని అయిదారు మిషనరీలని కలుసుకుంది. అనాథ శరణాలయాలని చూసింది. పిల్లలు వున్నారు. తల్లితండ్రుల ప్రేమకై పరితపించే పిల్లలు చాలామంది వున్నారు. వాళ్ళని పెంచుకోవాలంటే కావలసినంత తతంగం. ఇంతకంటే పదినెలలు మోసి ఒక పిల్లని కనటం సులువైనపని అనుకుంది సురేఖ. కాని తనకి అటువంటి అదృష్టంలేదు.

తమకి అన్నీ వున్నాయి - తమమధ్య అనురాగం వుంది. పెద్దయిల్లు వుంది. రెండుకార్లు వున్నాయి. భర్తకి పెద్ద వుద్యోగం వుంది. తనని కళాకారిణిగా, గృహిణిగా గౌరవించే స్నేహితులున్నారు. అన్నీ వున్నాయి.... కాని, యీ యింట్లో చిన్నపిల్లల నవ్వులు లేవు. క్లీన్‌గా ఎక్కడ సామానక్కడ నిశ్చలంగావుండి, నిశ్శబ్దంగావున్న తమ యింటి పరిసరాలు చూసి మొదట్లో సురేఖ గర్వపడేది. తమ గృహం కళాత్మకంగా వుంది అని అతిథులు మెచ్చుకుంటే సంతోషంగా వుండేది. కాని, ఈ మాటలే ప్రస్తుతం వెగటుగా తోస్తున్నాయి. ఈ యింట్లో చిన్నపిల్లల అడుగుల సవ్వడి ప్రతిధ్వనించాలి, గోడలమీద పెన్సలు గీతలుండాలి, డ్రాయింగ్‌రూమ్‌లోని కార్పెట్‌మీద ఆట బొమ్మలు, కాయితంముక్కలు విరజిమ్మి వుండాలి. అప్పుడే యీ యింటికి నిండుతనం - కళ కలుగుతాయి. లేనట్లయితే యిది తాజమహల్‌లాగా చల్లగా, ఘనీభవించిపోయిన హృదయంలా వుంటుంది - అని పిచ్చిపిచ్చిగా ఆలోచించేది. ఒక్కొక్కసారి ఈ పిల్లలు కలుగకపోవటం రాజగోపాల్ లోని లోపం - అని కసిగా అనుకునేది. వెనువెంటనే ఆమెలోని యింగితం నీతవైపు వేలితో చూపించేది. అది తనలోని లోపమే. తను నిర్భాగ్యురాలు. పోనీ పెంచుకునేందుకు పిల్లవాడిని తెచ్చుకోవచ్చుగా! ఆ ప్రయత్నం రాజగోపాల్ మనస్ఫూర్తిగా చెయ్యటంలేదనికూడా అనుమానం కలుగుతోంది సురేఖకి.

ఆమెలోని యీ మానసిక ఆందోళన అర్థం చేసుకుని రాజగోపాల్ చాలా సానుభూతి చూపిస్తున్నాడు. గురువుగారుకూడా సురేఖని డాన్సు ప్రోగ్రాములు యిమ్మని తరుచు అడుగుతున్నారు. ఒక ప్రోగ్రామ్‌లో చాలా వుత్సాహంగా, హృదయపూర్వకంగా నృత్యంచేసి ప్రేక్షకులని మెప్పిస్తే, రెండు ప్రోగ్రాములు యాంత్రికంగా ముగించి యింటి కొచ్చేది. నృత్యం లోని నిమ్నోన్నతాలు ప్రేక్షకులు అర్థం చేసుకునేవారుకాదు. ఒక విమర్శకుడు సురేఖ డాన్సు చూశాక 'ఇక ఈమె నృత్యం చెయ్యటం

విరమించుకుంటే మంచిది' అని ఆఖరివాక్యం రాసి తన విమర్శన ముగించాడు. ఆ క్రిటిసిజమ్ సురేఖ కళ్ళపడకుండా వుండాలని, రాజగోపాల్ చాలా ప్రయత్నం చేశాడు. స్త్రీ సహజమైన అసూయతో మరో నర్తకి పనివేళా ఆ పేపరుని సురేఖ చేతిలో వుంచింది, నృత్యనికేతన్‌కి వెళ్ళినపుడు.

సురేఖ పెనుతుఫానులా యింటికి వచ్చేసింది. సుడిగుండంలాగా ఆమెలోని కోపం సుళ్ళు తిరుగుతూ వుంది.

'నువ్వు కావాలని – నాకు అవమానం జరగాలని నృత్యం చెయ్యమన్నావు. చూడు యిప్పుడు ఏం జరిగిందో! నేను చెయ్యలేను బాబో అంటే నువ్వూ గురువుగారూ యీ బురదలోకి దింపారు' అరుస్తోంది సురేఖ.

నృత్యకళ బురదా? తన వూపిరిగా ఆరాధించి నేర్చుకున్న – యీ పవిత్రమైన కళని బురదతో పోలుస్తున్నదా? ఈ సురేఖకి మతిపోతున్నది. ఈమె ఎందుచేత యిలా స్థిమితంలేకుండా మాట్లాడుతోంది? దేనివల్ల. ఆ క్షణంలో బి.పి. చూస్తే రెండువందలకి దాటుతుందన్నది అనుమానం లేని విషయం. ఇలా వుద్రేకపడటం, దైహికంగానూ, మానసికంగానూ మంచిది కాదు. ఏం చెయ్యాలి; తను వోదార్చడానికి దగ్గరకెడితే విసిరికొడుతుంది – ఇంకా దెబ్బలాడుతుంది.

ఆ సాయంత్రం రాజగోపాల్‌కి పిచ్చిపట్టినట్లయింది. అతనికి క్లబ్‌కెళ్ళే అలవాటులేదు. ఆఫీసుస్టాఫ్‌తప్ప స్నేహితులు లేరు. సురేఖ తప్ప తనకి ఎవరూ అక్కర్లేదనుకున్నాడు. ఈ సురేఖకి తాను అక్కర్లేదా– ఎలా? ఎలా. ఎక్కడికెళ్ళాలి? మనుషులు ఎందుకు తాగుతారో – మొగవాళ్లు క్లబ్‌లో సాయంత్రాలు ఎందుకు గడుపుతారో అవగాహన అవుతోంది. ఇంట్లో శాంతి లేనపుడు మొగవాడు బయటికి పారిపోవాలని చూస్తాడు – పారిపోగలడుకూడా! కాని, తను ఆపని చెయ్యలేడు. సురేఖని

వంటరిగా వదలి ఆమె అశాంతితో బాధపడుతుంటే వదిలి వెళ్ళిపోలేడు. తాను 'అందరి మగవాళ్ళవంటివాడు కాదు. తన జీవితంకూడా అందరి జీవితాలవంటిదీ కాదు.

ఆ ఏడాదిలో రాజగోపాల్ మానసికంగా యమచెర అనుభవించాడు. ఒకవైపు సురేఖమీద జాలి. ఆమె పిల్లలపిచ్చిలోపడి కావాలనే తన సంసారాన్ని నరకభూయిష్టం చేస్తున్నది. అతనికి యిల్లు అంటే భయం కలుగుతూవుంది. అలా అని యింటికి రాకుండా వుండలేడు. సురేఖని చూడకుండా వుండలేడు. ఆమెలోని లావణ్యం, ఆముఖంలోని సౌందర్యం కళ్ళలోని ఆత్మవిశ్వాసం తన కళ్ళముందే శిధిలమైపోతుంటే, రాజగోపాల్ రాత్రిళ్ళు-రాత్రిళ్ళు ఏమయిపోతుంది – మా జీవితాలు ఏమైపోతున్నాయి ? ' అని యోచించి యోచించి నిద్రలోకి జారుకున్నాడు.

రాజగోపాల్ తల్లి మరణించి అప్పటికి ఎనిమిదేళ్ళు దాటింది. ఈలోపల అతని యిద్దరి చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకి డబ్బు పంపాడు. ఆఖరు చెల్లి పెళ్ళి చేసుకోనంది. తండ్రికి అప్పుడప్పుడూ డబ్బు పంపిస్తూనే వున్నాడు. కృష్ణవేణికి నెలనెలా ఆఫీసునుంచి డబ్బు వెళ్తూనే వుంది. బయట చూసేవాళ్ళకి అతని జీవితం మూడు పువ్వులూ ఆరుకాయలుగా దేదీప్యమానమై సుఖసంతోషాలతో వెలిగిపోతున్నట్లు కనిపిస్తూ వుంది. ఏటా అతను విదేశాలకి వెళ్తున్నాడు. వెళ్ళివచ్చినపుడల్లా – సురేఖకి చిత్రవిచిత్రమైన కానుకలు తెస్తున్నాడు. ఆమెకి బీరువానిండా రకరకాల చీరెలు, అడగకుండానే విలువైన నగలు తీసుకొచ్చి యిచ్చే భర్త, ఇన్నిటిమధ్యా అతని వైవాహికజీవితం రోజురోజుకీ మట్టిపెళ్లలు వూడిపడిపోతూన్న శిధిలగృహంలా కృంగిపోతున్నది. తనకి మనోదారుఢ్యాన్ని కలిగించి, పెద్ద చదువులు చదువుకో అని ప్రోత్సహించి, తనని ఒక మనిషిని చేసిన సురేఖ, తన సర్వస్వం అయిన సురేఖ, మొండిగా, చీటికీ మాటికీ ఏడ్చే

కొత్తమనిషిలా తయారవుతోంది. ఈ సురేఖని మామూలు మనిషిని చేసుకోవాలి. ఆమెని ఎలాగన్నా యిదివరకటి అమృతమూర్తిని చేసుకోవాలి అని తపనపడుతున్నాడు రాజగోపాల్.

చాలారోజులకి యుగాల తరువాత అతను జ్ఞాపకాలదొంతర అడుగు నుంచి – పరిచితమైన హాండ్‌రైటింగ్ చూశాడు. కవరుమీద తనపేరు. ఆ దస్తూరి ఎవరిదై వుంటుంది – యోచించాడు రెండునిముషాలు. అది కృష్ణవేణి దస్తూరి. ఎందుకు రాసింది? మామగారికి వంట్లో బాగాలేదా? దేనికి రాసింది – అదుర్దాగానే కవరు విప్పాడు. పూర్వమైతే చాలా నిరాసక్తితో చించి వుండేవాడు – కాని ఈమధ్య అతని హృదయం అందరిపట్లా సానుభూతి కురిపిస్తున్నది. సురేఖ మానసికస్థితివల్ల అతని హృదయం మెత్తబడుతోంది.

"శ్రీవారికి :

ఇలా రాయచ్చోలేదో తెలియదు. 'నా అవసరం వుంటే – రాయి' అని వెనక వచ్చినపుడు అన్నారు. సీత విషయంలో మీకూ కొంత బాధ్యత ఉందన్న దృష్టితో రాస్తున్నాను. దానికి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాము. వరుడు యమ్. యస్సీ. పాసయ్యాడు. మాకు తెలిసిన కుటుంబం. మన కుటుంబపరిస్థితులు వారికి పూర్తిగాతెలుసు. సీతకీ—అబ్బాయికీ ; యిద్దరికీ యిష్టమయింది. మా అందరికీ కూడా అంటే — మా అమ్మానాన్న సమ్మతించారు. ఈవిషయం మీకు రాయాల్సిన నైతికబాధ్యత ఉందికదా ! అందుకు రాశాను. సంబంధం ఖాయం చెయ్యమన్నారా ?

కట్నకానుకలు లేవు. సీతకి పదహారు పెళ్ళి పదిహేడు. దాని వయసు మర్చిపోయారేమోనని జ్ఞాపకంచేస్తున్నాను.

— కృష్ణవేణి"

రాజగోపాల్ వుత్తరం చేతులో పుచ్చుకుని కదలకుండా కూచుండి పోయాడు. ఈ సీత తమ కూతురైతే? ఎంత హడావుడి చేసివుండేవాళ్ళు. సురేఖ ఎంత గొప్పగా పెళ్ళిచేసేదో! సీత తనకి కూతురుకాదా? సవ్వు కున్నాడు. కానీ, తనకీ సురేఖకీ కలిగివుంటే – సురేఖ జీవితం ఇంత శూన్యమైవుండేదికాదు. తనవల్ల ఒక్క సురేఖ జీవితమే శూన్యమయిందా? కృష్ణవేణి మాటో? పద్దెనిమిదేళ్ళయింది తమ పెళ్ళయి. ఒక్కరోజున ఆమె సంతోషంగా వుందా? తనవల్ల ఒక్కనాడన్నా సుఖపడిందా? ఎందుకు జరిగిందిలా? కొన్ని జీవితాలు ఎందుకిలా సుడిగుండాలకి లోనవుతాయి? తన జీవితంలో ప్రవేశించిన యీ యిద్దరి స్త్రీలు – ఏదో ఒకవిధంగా 'అన్‌హేపీ'గానే వున్నారు. అందుకు తనే కారణమా?

రాజగోపాల్ వెంటనే బదులు రాశాడు. 'మీ అందరికీ నచ్చితే – పిల్లలిద్దరికీ యిష్టం అయితే – తప్పకుండా నిశ్చయం చెయ్యండి. నా అవసరం వున్నరోజున తప్పకుండా వస్తానన్న మాట నేను మర్చిపోలేదు. నిలబెట్టుకుంటాను.' ఇది రాజగోపాల్ భార్యకి రాసిన రెండోలేఖ. మొదటి వుత్తరంలో అన్నమాట నిలబెట్టుకోలేకపోయాడు. ఈమాటన్నా నిలబెట్టుకోవాలి. కృష్ణవేణి తనపైన అకారణంగా చూపించిన సానుభూతికి తను ఈవిధంగానన్నా బదులు తీర్చుకోవాలి – అనుకున్నాడు రాజగోపాల్.

సీతకి పెళ్ళి అన్న వార్త అతని బుర్రలో చక్రాలు తిరుగుతున్నది. కృష్ణవేణికి – ఈ పద్దెనిమిదేళ్ళ జీవితానికి ఆలంబనం, అర్థం సీత. కాని సురేఖకి ఈ భాగ్యం లేదు – ఈ తృప్తి లేదు. తను సురేఖని యింత ప్రేమించీ, కృష్ణవేణికి యివ్వగలిగిన సంతానాన్ని – సురేఖకి యివ్వలేకపోయాడు. ఇదేదో తను కావాలని ఆమెపట్ల లోపంచేసినట్లు బాధపడుతున్నాడు. తనకి జీవితాన్ని, ప్రేమనీ, జీవితంలో గెలుపునీ ప్రసాదించిన సురేఖకి, తాను బిడ్డని యివ్వలేడా? దైహికంగా ఆమె తల్లి

కాలేకపోవచ్చు — పెంచుకుంటానంటోంది — ఒక బిడ్డ కావాలంటోంది! తాను కనీసం ఆ పసన్నా చెయ్యాలి. తనూ సురేఖా కలిసి – పిల్లని ఎడాప్ట్ చేసుకోవాలి.

అయితే, ఎవరినడగాలి ? సురేఖ చేసిన ప్రయత్నాలు విఫల మయినాయి. తను చేస్తేనో ?....రాజగోపాల్‌కి ఆకాశంలోని మెరుపులా – సురేఖకి వైద్యంచేసిన 'గైనకాలజిస్టు' – జ్ఞాపకం వచ్చింది. ఆమె తన సమస్యకి ఒక దారి చూపుతుంది అనుకుని, ఆమెతో 'ఎప్పాయింట్‌మెంట్' ఫిక్స్ చేసుకున్నాడు.

కన్సల్టింగ్ రూమ్‌లో ఆడవారూ, గర్భిణీస్త్రీలూ, పసిపిల్లలూ విలవిల లాడుతున్నారు. రాజగోపాల్‌కి మొహమాటంగా ఉంది. కాంపౌండులో చెట్టుకింద కారు ఆపుకుని – పత్రిక చదువుకుంటూ కూచున్నాడు. ఆఖరి పేషంటు వెళ్ళిపోయాక అతనికి పిలుపొచ్చింది.

లేడీడాక్టరు అతన్ని గుర్తించింది.

'ఎలావున్నారు – మీ మిసెస్ ?'

'ఆమెకోసమే వచ్చాను'

'ఎనీ న్యూస్ ?'

'లేదు'

నేను ముందే చెప్పానుగదా – అన్నట్లున్నాయి, ఆమెకళ్ళు.

'మా మిసెస్ డాన్సరు....ఆవిషయం మీకూ తెలుసుననుకుంటా'

'ఆమె డాన్సు నేనూ చూశాను. అప్పటికి నేను హౌస్ సర్జన్సీ చేస్తున్నాను. ఏదో బెనిఫిట్ షోకి – మా 'బాస్' టికట్లు కొన్నాడుట – ఖైసులేక మమ్మల్ని వెళ్ళమన్నారు. తల్చుకుంటే యిప్పటికీ నవ్వుగా ఉంటుంది– '

'దేనికి? – ' నవ్వుతూ అడిగాడు రాజగోపాల్.

'మధ్యాహ్నంనుంచీ - లేబర్ రూమ్‌లో - కేకలు పెడ్తోంది—పురుడు వొస్తుంది - పురుడు వొస్తుంది—అంటూ హడావుడిపడ్డాం. 'డాన్సు చూసి వచ్చేదాకా ఆగవమ్మా' — అని నేనూ, నా ఫ్రెండూ జారుకున్నాము. ఆ యిల్లాలు మాటదక్కించలేదు. ట్విన్సుని కనేసింది' అంటూ పక పక నవ్వింది, తన స్టూడెంటు డేస్ తలుచుకుంటూ. డాక్టర్ నవ్వుతుంటే పదేళ్ళు చిన్నదానిగా కనిపించింది. ముఖంలో సీరియస్‌నెస్ లేకపోతే మనిషి సరదాగా కనిపిస్తుంది, అనుకున్నాడు రాజగోపాల్. ఒక్కసారి ఆ ట్విన్స్ కలిగిన మాతృమూర్తిమీద అసూయ కలిగింది అతనికి.

'వాట్ కెన్ ఐ డు ఫర్ యు ?' అడిగింది లేడీడాక్టరు మామూలు సీరియస్‌ఫేస్‌తో.

'సురేఖ చాలా ఎమోషనల్ టైపు. ప్రతిదీ తీక్షణంగా తీసుకుంటుంది. పిల్లలు లేరని బెంగపెట్టుకుని తన లైఫ్ 'రూయిన్' చేసుకుంటున్నది.'

'మిమ్మల్ని టీజ్ చేస్తోంది - అవునా?'

అవునన్నట్లు తలవూపాడు.

'పోనీ ఎవరినైనా పెంచుకోగూడదా? పిల్లలు పుట్టని దంపతులు చాలామంది ఎడాప్ట్ చేసుకుంటూంటారు. మీకు అభ్యంతరమా? మీ భార్యకు?'

'ఉహూఁ. ఇద్దరికీ ఎటువంటి అభ్యంతరంలేదు. ఎడాప్ట్ చేసుకుందామని ఏడాదినుంచీ ప్రయత్నిస్తున్నాము.'

'దొరకలేదా?'

'ఆ ప్రొసీజర్ చాలా గందరగోళంగా వుంది - వాళ్ళ ప్రశ్నలూ....' భయంగా చూశాడు అతను.

డాక్టర్ తనలో తాను నవ్వుకుంది. 'ఇంత చదువుకున్నవాళ్ళు, ఇంత పెద్ద వుద్యోగస్థుడు 'నార్మల్ ప్రొసీజర్' ఎడాప్షన్ పేపర్సు చూసి భయ పడుతున్నాడా ?

'ఇంతకీ – '

'మీదగ్గరకు చాలామంది పురుళ్ళకి వస్తూంటారు, అందులో....'

'కన్నపిల్లల్ని ఏ తల్లీ అమ్ముకోదు.'

'అట్లా అడగటంలేదు. పెళ్ళి కాకుండా – అన్‌మారీడ్.'

'అలాంటివి – అప్పుడప్పుడు వస్తాయి. పదిరోజులు అయాక పిల్లని యిచ్చేస్తారు. తల్లిపేరు మీకూ, మీపేరు తల్లికీ తెలియకూడదు. ఇష్టం లేకపోతే షాపులో కొన్న గుడ్స్‌లా రిటర్న్ చెయ్యడానికి అవదు.'

'ఛ – ఛ అలా ఎవరు చేస్తారు?'

'లేరనకండి. పిల్లవాడు కావాలంటారు. నల్లగా వుండకూడ దంటారు. మంచి ఆరోగ్యమైన తల్లికి పుట్టి వుండాలి అంటారు. ఒక్కోసారి కులంకూడా....'

'తమకి పుట్టేపిల్ల నల్లగా వుంటే ఏంచేస్తారు? పారేస్తారా?'

'అటువంటి యాటిట్యూడ్ వుంటే ఫరవాలేదు. చాలామంది యీ ఎడాప్షను చేసుకునేప్పుడు సరుకు మంచిది ఎన్నుకున్నట్లు ఈ పిల్లలుకూడా అందంగా పెద్దకళ్ళతో, పొడవాటి వేళ్ళతో, పెద్దచెవుల్తో .... ఇలా వర్ణిస్తారు.'

'మాకు ఆడపిల్లయినా, మొగపిల్లవాడైనా ఫరవాలేదు. అసలు నల్లగావున్న పిల్ల అయితే మా ఆవిడ చాలా యిష్టపడుతుంది. నేను నలుపుకదా – అందుకని నాపోలిక వచ్చివుంటుందని మురిసిపోతుంది' అన్నాడు అతను.

'అయితే నాకు రెండు మూడు నెలలు వ్యవధి యివ్వండి – అన్నీ సిద్ధంచేసి మీకు తెలియబరుస్తాను. ఒక్కరోజుకంటే వ్యవధి యివ్వం.

పదకొండోరోజు వుదయానికి తల్లిపక్కలో పిల్ల వుండదు. మీ వునికి ఛాయామాత్రంగాకూడా ఆ తల్లికి తెలియకూడదు.'

'మీరు ఎలా చెపితే అలా. నా వుద్యోగం, మా ఆదాయం మీకు తెలుసు. ఈ 'ఎడాప్షన్'తో నాకు భార్యా పిల్లలూ యిద్దరూ తిరిగి లభిస్తారు. మా ఆవిడకి ఇది 'రిబర్త్' అవుతుంది. 'వుయ్ విల్ బి గ్రేట్‌ఫుల్ ఫర్ ఎవర్' అన్నాడతను చాలా 'ఎమోషనల్'గా. టేబుల్‌మీద బజ్జర్ మోగింది. డాక్టర్‌కోసం కొత్త పేషంటు కాబోలు - రాజగోపాల్ కుర్చీ లోంచి లేచాడు.

ఇంటికొచ్చాక ఈ వార్త అతను సురేఖకి చెప్పలేదు. ఆమెలో యిప్పటికే చాలాసార్లు లేనిపోని ఆశలు కలిపించి, చివరికి ఆశాభంగం కలిగించాడు. ఈసారి మళ్ళీ నిరాశ అయితే సురేఖ, మళ్ళీ బెంబేలు పడిపోతుంది. అన్నీ రెడీ అయాక డాక్టరుగారినుంచి సిగ్నల్ వచ్చాక చెప్పవచ్చు అని వూరుకున్నాడు. కృష్ణవేణి రాసిన వుత్తరంపటుకు యింటికి తీసుకొచ్చి సురేఖకి యిచ్చాడు.

'గోపీ, నువ్వు తప్పకుండా పెళ్ళాలి. నువ్వులేకుండా యీ పెళ్ళి జరగకూడదు'

'చూద్దాంలే. వాళ్ళే రాస్తారు - ఏం చెయ్యాలో .... '

'సీతకి ఏం చేయించనూ? ఏదన్నా నగ చేయిస్తాను'

'మనకెందుకు లేనిపోనివి. వాళ్లు చేయించుకుంటారు. మనం యిస్తే నచ్చకపోవచ్చు' అన్నాడతను ఈ విషయాల్లో దూరంగా వుంటానికి ప్రయత్నిస్తూ.

'బంగారపు సెట్ కొంటాను. గాజులూ, నెక్లెస్, చెవులకీ, వుంగరం మంచి అందమైన సెట్లు వస్తున్నాయి. బాగా జరీవున్న కంచిచీరె కూడా

సెలక్ట్‌చేసి యిస్తాను. రిసెప్షనుకి కట్టించవచ్చు' తన కూతురి పెళ్ళిలా సంబరపడిపోతోంది సురేఖ.

ఈమెకి జీవితం నిత్యచైతన్యవంతంగా వుండాలి. ఎప్పుడూ ఏదో కదిలికా – హడావుడి వుండాలి. లేకపోతే యీ సురేఖ బతకలేదు అనుకున్నాడు రాజగోపాల్, పూర్వపు అందం కోల్పోయిన సురేఖవైపు పరిశీలనగా చూస్తూ।

'పెళ్ళికి డబ్బుకావాలేమో పంపు. ఎంత కావల్సివస్తుందో – పదివేలు చాల్తాయా ? అడిగింది సురేఖ.

'కట్నం లేదుట. ఉత్తరంలో చూశావుగా. నెలనెలా పంపే డబ్బు సీతపేరన డిపాజిట్ చేస్తున్నానంది. అందుకని మనం డబ్బు పంపక్కర్లేదు'

'గోపీ, నిన్ను చూస్తుంటే ఒక్కొక్కప్పుడు నీఅంత రాతిగుండె వుండదనిపిస్తూవుంటుంది. మరోసారి నీఅంత జాలిగుండె ఎవరికీ ఉండదనిపిస్తుంది.'

'రెండూ నిజమే'

'సీత నీకుపుట్టిన పిల్లకదా। దానిమీద నీకు ప్రేమలేదా ? '

రాజగోపాల్ మాట్లాడలేదు.

'చెప్పు. సీతని చూడాలని అనిపించదా ? '

'ఊహుం. ఎప్పుడూ అనిపించలేదు'

'ఇప్పుడుకూడానా ? '

'ప్రస్తుతం అనిపించటంలేదు. చిన్నప్పుడు నేను ఎప్పుడూ ఎత్తుకోలేదు. ఆ రోజుల్లో నీమీద బెంగతప్ప నాకేమీ కనిపించేదికాదు. అమ్మపోయినప్పుడు చూశాను. ఏడుపూ – రణపెంకితనం తప్ప దగ్గరికి పిలిచి అడుకునే లక్షణాలు కనిపించలేదు'

'అలా అనిపించకపోవటం ప్రకృతివిరుద్ధం కాదా–అన్నాచురల్ కాదా?'

'అది అన్‌నాచురల్ అయినపుడు నిన్ను ప్రేమించడం కూడా - అన్‌నాచురల్ అవుతుంది. ఇదంతా అర్థంలేని వాదం. నీకు నగలు చేయించాలని, చీరెలు కొనాలని వుంటే కొను. అది నీకు సంతోషాన్ని ఇస్తుందంటే తప్పకుండా చెయ్యి. మనకి డబ్బుకి సమస్యలేదు. కాబట్టి నువ్వు సంతోషంగా షాపింగ్ చేస్తుంటే నిన్ను చూస్తూ నేనూ ఆనందపడిపోతాను' అన్నాడు రాజగోపాల్'

'గోపీ! నేనంటే నీ కెందుకింత యిష్టం. నిన్ను వేధిస్తాను - పోట్లాడుతాను-డబ్బు ఖర్చుచేస్తాను. ఇన్నిచేసినా ఎందుకు పూరుకుంటావు?'

'నాచురల్ కాబట్టి' అన్నాడతను సురేఖ బుజాలచుట్టూ చేతులువేసి. సురేఖ ఈరోజు సంతోషంగా వుంది. ముఖంలో కోపం, విసుగు దోబూచులాడటంలేదు. ఆమెకి డాక్టరు చెప్పినవిషయం చెప్పేసి, ఆమె వుత్సాహంలో తానూ పాలుపంచుకుందామన్న కోర్కెను అణచుకోలేకుండా వున్నాడు. కాని అది సానుకూలపడకపోతే సురేఖ మళ్ళీ నిరాశని ఎదుర్కోవలసి వస్తుంది. నాలిక చివరికొచ్చిన ఆ శుభవార్తని పెదవిదాటకుండా కంట్రోల్ చేసుకున్నాడు రాజగోపాల్.

పైకి చెప్పటంలేదుగాని అంతర్గతంగా డాక్టర్‌దగ్గరనుంచి ఎప్పుడు ఫోన్ వస్తుంది - అన్న ఆలోచన అతనిని వెంటాడుతూనే వుంది. ఫోన్ మ్రోగుతే చాలు. 'డాక్టర్ ఫోన్ చేస్తున్నదా?' అని మనసు వుత్సాహంతో గంతువేసేది. రాబోయే ఆ పసిప్రాణిమీదకంటే ఆ ప్రాణి రావటంవల్ల సురేఖకి కలుగబోయే ఆనందంమీద అతని మనసు లగ్నమై వుండేది.

ఆరోజు అతను ఆఫీసుకి వెళ్ళి వెళ్ళగానె ఫోన్; చాలా బిజీగా వున్నరోజు. స్విచ్‌బోర్డునుంచి ఆపరేటర్ కనక్ట్ చేసింది - పర్సనల్ కాల్ అని. రాజగోపాల్ ఆశ్చర్యపోతూ రిసీవర్ అందుకున్నాడు.

'మిస్టర్ రాజగోపాలా?'

'యస్!'

'నేను డాక్టర్‌ని - మీరు అడిగారే, ఆ కేసు వచ్చింది. పన్నెండింటికి మా యింటికి రండి. పేపర్లన్నీ రెడీగా వుంచాము.'

రాజగోపాల్ హృదయం ఒక్కసారి వుప్పొంగిపోయింది. 'ఆడపిల్లా - మొగపిల్లవాడా?'

'ఎవరైనా ఒకటేనన్నారుకదూ?'

'ఇప్పుడూ అదే అంటున్నాను.'

అయితే వచ్చాక తెలుసుకుందురుగాని.'

'నా మిసెస్‌ని తీసుకురానా?'

'సాయింత్ర బేబీని తీసుకెళ్ళేప్పుడు యిద్దరూ వద్దురుగాని! .... మధ్యాహ్నం ఫార్మాలిటీస్ చాలా వున్నాయి. పెట్-నర్స్ .... వగైరా.'

'అలాగే వస్తాను. థ్యాంక్యూ - అయామ్ గ్రేటుఫుల్ టు యు.'

డాక్టర్ ఫోన్ పెట్టేసింది. అతను నిలవలేకుండా వున్నాడు. ఈ వార్త సురేఖకి చెప్పాలి. పసిపిల్ల అంటే వుయ్యాల కొనాలి, పాలడబ్బాలు కొనాలి. ఈ ఏర్పాట్లన్నీ ముందు చేస్తేనో! ఏ గదిలో బేబిని పడుకో బెట్టాలో! సురేఖ పసిగుడ్డును పెంచగలదా? అంతదాకా పిల్లని పెంచుకోవాలని కోర్కె-తప్ప అందుకు చెయ్యాల్సిన ఏర్పాట్లూ అటుపైన ఏర్పడే సమస్యలూ గురించి అతను ఆలోచించలేదు. పదిరోజులగుడ్డును సురేఖ పెంచగలదా? పిల్లల గురించి తనకీ ఏం తెలియదు. ఈ కొత్త బాధ్యత తలుచుకుంటే అతనికి కాస్త భయంగా వుంది.

అతను పన్నెండుగంటలకి డాక్టర్ ఇంటి కెళ్ళాడు. డాక్టర్ యిల్లు చూడటం అదే మొదటిసారి.

ఆమె ఇతనికోసం వెయిట్ చేస్తోంది.

'మీకోసం ప్రత్యేకంగా కొన్ని రూల్సు రిలాక్స్ చేశాము. ఎడాప్షను పేపర్సు వగైరా తరువాత సైన్ చెయ్యొచ్చు. పాపతోపాటు మీరు నర్సుని కూడా తీసుకెళ్ళాలి. యు ఆర్ లక్కీ. పిల్ల బొద్దుగా - తెల్లగా బాగుంది.'

రాజగోపాల్ భయంగా, పుత్సాహంగా చూస్తున్నాడు ఆమెకళ్ళవంక.

'బేబి మంచిఫామిలీనుంచే వచ్చింది. ఆ బాక్గ్రవుండ మీరు తెలుసుకోవలసిన అవసరంలేదు. నాకు తెలిసిన నర్సు చాలా మంచి నర్సు వుంది. మీరు ఎన్నాళ్ళు కావలిస్తే అన్నాళ్ళు వుంచుకోండి. మినిమమ్ ఆరు నెలలేనా నర్సుని వుంచుకోడం మంచిది. ఎందుకంటే మీ ఆవిడకు పసిపిల్లలని పెంచటం తెలియదు.'

'మీరు వచ్చి చూస్తూంటారా?'

'దేనికి?' అడిగింది డాక్టర్.

'పాపకి వంట్లో బాగాలేకపోతే – మాకు అంతా కొత్త.'

డాక్టరు ఫక్కున నవ్వింది. 'ప్రతి తల్లీ తండ్రీ మొదటిపాప పుట్టినపుడు ఇలాగే ఖంగారుపడతారు. మిస్టర్ రాజగోపాల్ – నేచర్ మనందరికంటే గొప్ప డాక్టరు. ఆరునెలలదాకా గుడ్డిదికూడా పసిపిల్లను పెంచవచ్చు – అని మనలో సామెత వుంది – మీరు విన్నారా?' అడిగింది.

అతను వినలేదు. కాని నర్వస్‌గా వుంది అతనికి 'మరి – నర్సు?' తడుముకుంటున్నాడు.

'నర్సు పాపకోసంకాదు. మీ యిద్దరికీ ధైర్యం చెప్పటానికి. నర్సుకి పిల్లల పెంపకంలో చాలా ఎక్స్‌పీరియన్సు వుంది. మీ యిద్దరూ ప్రతీ చిన్నవిషయానికీ ఖంగారుపడకుండా వుంటారని పంపుతున్నాను. 'ఫార్ములా ఫీడింగ్ అంతా ఆమె చూసుకుంటుంది.'

'అంటే నర్సు పాలిస్తుందా?' అనాలోచితంగా గభాలున నోటికొచ్చిన ప్రశ్న అడిగేశాడు రాజగోపాల్.

ఈసారి డాక్టరు పడీ పడీ నవ్వింది పెద్ద జోక్ విన్నట్లు నవ్వింది.

'మిమ్మల్ని చూస్తుంటే – మా హాస్పటల్‌కి వచ్చే 'వుడ్–బి–ఫాదర్' జ్ఞాపకం వస్తున్నాడు. మీలాంటి 'యంగ్‌మెన్' అంతా యింతే. పిల్లని

కనటం అంటే అదేదో మీరొక్కరే చేస్తున్న ఘనకార్యంలాగా తడబడి పోతూంటారు. సృష్టి ఆదినుంచీ — ఈ నిరంతర జననాలు ప్రతీక్షణం జరుగుతూనేవున్నాయి....'

'ఎన్నింటికి రమ్మన్నారు?'

'మీ ఆవిడకి వొదిలెయ్యండి. ఆవిడ మంచి టైము చూసుకు బయలుదేరుతా ననచ్చు. అన్నట్లు నర్సుకి నెలకి మూడువంద లివ్వాలి. రూమూ, భోజనం మీకు అభ్యంతరం వుండదనుకుంటా.'

'అబ్బే - అదేంలేదు. మీరు ఎలా చెబితే అలా.'

'మరో విషయం. ఈ నర్సునుంచి పాప ఎవరికి పుట్టిందో కనుక్కోవాలని ప్రయత్నించకండి. పాపని యిక్కడికి తీసుకొచ్చాక నర్సు వెస్తుంది - అంచేత నర్సుకీ మీలాగే పాప తల్లితండ్రుల గురించి తెలియదు. వుండే విశదం చేస్తున్నాను పరిస్థితి' అంది డాక్టర్.

రాజగోపాల్ లేచాడు.

ఆ సాయింత్రం నాలుగున్నరకి మంచిదని సురేఖ లగ్నం నిశ్చయించింది. నాలుగున్నరకి డాక్టరు యింటి కెళ్ళారు. అప్పటికి పసిగుడ్డుతోపాటు స్థూలకాయురాలైన నర్సు, పాపని వొళ్ళో పడుకోబెట్టుకుని ఎదురుచూస్తూ వుంది, పక్క ప్లాస్టిక్ బుట్టలో పాలబుడ్డీ వగైరాతో.

డాక్టర్, సురేఖవంక నవ్వుతూ చూస్తూ - 'మీ బిడ్డని మీరు తీసుకోండి' అంది.

సురేఖ రెండుచేతులూ చాచింది. నర్సు పాపని సురేఖ చేతుల్లో వుంచింది. సురేఖ కళ్ళు దేదీప్యమానమైన వెలుగుతో ప్రకాశిస్తున్నాయి. ఆమె ముఖం మాతృగర్వంతో వెలిగిపోతున్నది. డాక్టరుగారు రాజగోపాల్ వంక చిరునవ్వుతో చూసింది. అతని కళ్ళు చెమర్చాయి - ఆమె చూడకూడదని తల తిప్పుకున్నాడు.

# 10

ఆ రాత్రి పాప ఏడుపు ఆ యింట్లో ప్రతిమూలా ప్రతిధ్వనించింది. సురేఖా-నర్సూ పక్కగదిలో పడుకున్నారు. ఇంటికివస్తూనే సురేఖ పాపకి మంచం వగైరా ఏర్పాట్లలో పడిపోయింది. అంతచిన్నగుడ్డూ పెద్దమంచం మీద మధ్యగా పడుకునివుంటే రాజగోపాల్‌కి ఎలకపిల్లవలె తోచింది.

గదిలో వంటరిగా పడుకోడం అతనికి అలవాటు లేకపోలేదు. సురేఖ టూర్స్‌కి వెళ్ళినపుడు అతను వంటరిగా యీ గదిలో చాలాసార్లు పడుకున్నాడు. ఊళ్ళోవుంటే, ఎంతకోపంగావున్నా, కీచులాడుకున్నా, సురేఖ ఈ గదిలోనే పడుకుంటుంది. అలుగుతే డబుల్‌కాట్‌లో ఒక చివర్న తాకకుండా వుండేటట్లు దూరంగా పడుకుంటుంది. కాని ఈరోజు వూళ్లో వుండే పాపకోసం మరోబెడ్‌రూమ్‌లో పడుకుంది. ఈ పాపరాక తమలో దూరాన్ని పెంచుతుందా ? ఇంకా దగ్గరకు తెస్తుందా ? సురేఖకి పాపవల్ల మనశ్శాంతి కలుగుతుందా ? ఇదికూడా కొన్నాళ్ళకి మామూలయిపోతుందా?

పాపకంఠం చిన్నగా వినిపిస్తున్నది. ఎందుకేడుస్తోంది ? తల్లిపాల కోసమా ? తల్లి వొడి కాదని గుర్తించిందా ? వెచ్చని అన్ని దేహాలూ ఒకటికాదని తన తల్లిగుండెల్లో ప్రత్యేకమైన వెచ్చదనం, మమతా వున్నవని యీ పదిరోజుల ప్రాణికి గుర్తు తెలుసా ? పాప ఏడుపు ఆగింది. సురేఖ నర్సుతో ఏదో అంటోంది. నర్సు సురేఖకి ధైర్యం చెబుతున్నట్లు, బదులు చెప్తోంది. వారి కంఠాలు తలుపు వెనకనుంచి వినిపిస్తున్నాయిగాని - స్పష్టంగా మాటలు చెవుల్లోకి చొరటంలేదు.

పాప ఎవరిపిల్ల అయివుంటుంది ? తల్లి ఎందుకు వదిలేసింది ? మంచికుటుంబం అన్నది డాక్టరు. బహుశా విఫలప్రేమ అయివుంటుందా ? ఆ తల్లిని ఎవరేనా మోసంచేశారా ? ఆ పిల్లకి ఎన్నేళ్ళుంటాయి ? బహుశా అతనుకూడా తనలాగే అశక్తుడై గర్భవతిఅయిన ప్రియురాల్ని వదులుకున్నాడా ? అలాగే జరిగివుంటుందా ? వేరే మోసం చేశాడా ? కన్నపిల్లని వదులుకున్న ఆ తల్లి ఎంతబాధపడుతూ వుంటుందో ? తనకి తెలియని – ఆ అపరిచితురాలిపైన రాజగోపాల్‌కి సానుభూతి కలుగుతోంది. ఇవన్నీ అర్థం లేని ఆలోచనలు – అని తనని తాను అదుపులో పెట్టుకుని నిద్రలోకి వరిగాడు రాజగోపాల్.

ఆ మరునాడు సురేఖ రెండుగజాల పొడవైన లిస్టుతో బజారుకి ప్రయాణం అయింది. పాపని నర్సుదగ్గర వదలటానికి సురేఖకి ఇష్టంలేదు. అలా అని వక్కర్తీ పాపను సముదాయించే ధైర్యమూ లేదు.

'ఇవన్నీ మీరు తీసుకురండి' అంది లిస్టు అతనికి అందిస్తూ.

'అరే. బాపురే – నాకేం తెలుసు ? ఇందులో ఒక్కసామానుకూడా నేను కళ్ళతో చూడలేదు. ఏకొట్లో దొరుకుతాయో తెలియదు'

'మరీ వేషాలు వెయ్యకండి. కిడ్డీస్ కార్నర్‌లో నావ్‌లూ అవీ దొరుకుతాయి. మిగతావి స్పెన్సర్సులోనో – పాపట్ జమాల్‌లోనో దొరుకుతాయి. మీపిల్లకోసం ఆమాత్రం చెయ్యలేరా ?' అడుగుతోంది సురేఖ. ఈ ఉదయం సురేఖ ఆసనాలువేసినట్లులేదు. ఇంకా పూజకూడా చెయ్యలేదు. ఆ ఉదయం టీ నాయర్ తెచ్చిచ్చాడు రాజగోపాల్‌కి.

'నువ్వింకా స్నానం చెయ్యలేదా ?'

'ఏదీ పాప పని అవలేదు. నర్సుకి అప్పజెప్పి వెళ్ళాలి. నర్సు ఎత్తుకుంటే ఏడుస్తోంది. తెల్లవార్లూ నా వొళ్ళో పడుకుంది. 'కళ్ళ

తిప్పుకుంటూ చెబుతోంది సురేఖ. రాజగోపాల్ లిస్టు అందుకుని వివరాలు నద్పుతో 'వెరిఫై' చేసుకుని ఆఫీసుకి వెళ్ళేముందు బజారుకి బయలుదేరాడు. అతను షాపింగ్ ముగించుకుని వచ్చేప్పటికి పన్నెండయింది. ఈ సామాన్లు కొనటంలో డ్రయివరు చాలా సలహాలిచ్చాడు. అతనికి ఆరుగురుపిల్లలు.

ఆ మధ్యాహ్నం కృష్ణవేణీనుంచి మరో వుత్తరం. ఇంకో కవర్లో రెండు శుభలేఖలు.

'నా అవసరం వుంటే తప్పకుండా వస్తానని రాశారు. సీత పెళ్ళి శుభలేఖ పంపుతున్నాను. మీరువచ్చి కన్యాదానం చెయ్యాలి. ఎప్పుడూ నేను ఏమీ అడగలేదు. నిరాశపరచరని అనుకుంటూ' జాబు ముగించింది.

పెళ్ళికి ముందుగా రండి అని రాయలేదు. పెళ్ళిబాధ్యత నెత్తిన వేసుకోండి అని అర్థించలేదు. సంబంధం వెతికింది; పెళ్ళి ఏర్పాట్లు అన్నీ చేసింది. తనను వచ్చి కన్యాదానం చెయ్యమంటున్నది. ఇంత చిన్న కోరికను కాదనటం న్యాయంకాదు. పెండ్లి అయినప్పటినుంచీ ఈనాటిదాకా కృష్ణవేణి తనకి యిది కావాలి అని ఏనాడూ ఏమీ అడగలేదు. ధర్మశాస్త్ర ప్రకారం అర్ధాంగిగా శుభకార్యాలకీ - అశుభానికీ తనపక్కన కూచుంది. అది తన కర్తవ్యంగా భావించిందో, హక్కుగా భావించిందో తనకైతే తెలియదుగాని, నిశ్శబ్దంగా నీడలా ఆమె తనపక్కనే వుండేది అయా సమయాల్లో.

ఈనాడు భర్తగా, తన పిల్లకి తండ్రిగా 'రండి' అని రాస్తున్నది. తను వెళ్ళాలి. 'మోరల్'గా కృష్ణవేణిపట్ల తనకి యీ బాధ్యత వుంది - వెళ్ళాలి అని నిశ్చయించుకున్నాడు రాజగోపాల్.

కాని పాపవచ్చి రెండురోజులుకూడా కాలేదు. సురేఖ వంటరిగా వుండగలదా ? ఈ కొత్త బాధ్యత తను వొక్కతే మొయ్యగలదా ? పాపకి వంట్లో బాగాలేకపోతే ? డాక్టరు మాటలు జ్ఞాపకం వచ్చాయి.

శుభలేఖా వుత్తరం - రెండూ సురేఖచేతికిచ్చాడు. కవర్లోని రెండు శుభలేఖలనీ చేతితోపుచ్చుకు ప్రశ్నార్ధకంగా చూసింది అతనివంక.

'అక్కయ్య - నాకూ పంపారు' అంది తమాషాగా చూస్తూ.

అతను మాట్లాడలేదు.

'ఇదే ఒకవారంరోజులు ముందుగా వచ్చివుంటే నేను మీతో వచ్చేసేదాన్ని. వద్దన్నా సరే పట్టుబట్టి వచ్చేదాన్ని' అంది సురేఖ.

సురేఖ మాటలకి అతను చాలాసార్లు బదులుచెప్పడు. కొన్ని అసందర్భమైన మాటలు చెపుతూవుంటుంది సురేఖ. కొన్ని అసంగతమైన 'సిట్యుయేషన్సు' వుంటాయి. వాటిని 'ఫేస్' చెయ్యటం ఎంత కష్టమో సురేఖకి తెలియదు.

'నేను రావటం మీ కిష్టంలేదు కదూ. మీకంటే అక్కగారే నయం. సర్లేండి. ఎప్పుడు బయలుదేరుతారు? రెండురోజులు ముందుగా వెళ్ళండి.'

అతను మాట్లాడలేదు. నర్సు వచ్చాక సురేఖ తనని 'ఏమండీ' అని పిలుస్తోంది. పూర్వపు ఏకవచన ప్రయోగం పూర్తిగా వదిలేస్తుంది కాబోలు. అతను సురేఖ చెప్పినట్లు రెండురోజులు ముందుగా వెళ్ళదలచుకోలేదు. పెళ్ళి రాత్రివేళ - అని శుభలేఖలో వుంది. ఆరోజు పుదయానికి చేరుతే చాలు. హౌరామెయిల్లో పెళ్ళి, వుదయం బెజవాడలో దిగి బందరు వెళ్ళచ్చు.

బెజవాడలో వున్న తమ కంపెనీవాళ్ళు అతనికి కారు ఏర్పాట్లన్నీ చేశారు. పెళ్ళి మరునాడు రాత్రి అనగా హౌరామెయిల్లో బయలుదేరాడు రాజగోపాల్. సురేఖ స్టేషనుకి వెళ్దామా, వద్దా అని తటపటాయించి పాప నిద్రపోతుంది, భయం లేదని నర్సు ధైర్యం చెప్పాక, స్టేషను కొచ్చింది. సీతకని కొన్ని నగలపెట్టూ, చీరె పెట్టెలో గుర్తుగా సర్దింది. అది కృష్ణవేణికి అందించమని మరీ మరీ చెప్పింది. రైలు కదిలింది. దూర మౌతున్న సురేఖని చూస్తూ నుల్చున్నా డతను, తలుపుదగ్గిర. సురేఖ

ముఖంలో ఒకరకమైన తృప్తీ, సంతోషం కనిపిస్తున్నాయి. ఆమెలో విసుగూ, కోపం అసంతృప్తీ తగ్గినాయి. పాప పోషణలో సురేఖకి రోజుకున్న ఇరవై నాలుగుగంటలూ చాలటంలేదు. ఎప్పుడూ 'బిజీ'గా వుంటున్నది. ఇదీ ఒకందుకు నయమే.

తను వస్తాడా, రాడా అన్న సంశయంతో కృష్ణవేణి వూగిస లాడకూడదు. అనుకుని 'ఎరై వింగ్' అని ఒక్కముక్కలో వైరు ఘందే యిచ్చాడు రాజగోపాల్. అతను ఏ రైల్లో వస్తాడు, ఎప్పుడొస్తాడు అన్నది కృష్ణవేణికి తెలియదు. అయితే వస్తాడు పెళ్ళికి ముందు, కన్యాదానం చెయ్యటానికి వస్తాడు. ఈ వైరు ఆమెకి తృప్తినేకాదు - కొంత గర్వాన్ని కూడా కలిగించింది.

ఇంచుమించు విజయగర్వంతో వైరు తండ్రిచేతి కిచ్చింది. అప్పటిదాకా 'పీటలమీద ఎవరు కూచుంటారు?' అన్న సమస్యని ఇంట్లో ఒకటి రెండుసార్లు ప్రస్తావించారు. తల్లీతండ్రికి సీతకి కన్యధార పొయ్యాలన్న కోరిక వుందనికూడా కృష్ణవేణి గ్రహించుకుంది. కాని ఈ అధికారం వాళ్ళకిలేదు. సీతకి కన్యధార పొయ్యగల అధికారం తనకీ, తన భర్తకీ మటుకే వున్నాయి. అతను 'రాను' అంటే అన్ని అవమానాలకిమల్లే దీన్ని సహిస్తుంది. కాని రమ్మని పిలిచే హక్కు తనకి వుంది. రానని నిరాకరించే స్వేచ్ఛ అతనికుంది. ఏం చేస్తాడో చూడాలని అనుకుంది. కాని ఆమె మనసులోమటుకు రాజగోపాల్ రావాలి, భర్త రావాలి - అన్న తీవ్రమైన కాంక్ష వుంది - అతను రావటం తన విజయానికి చిహ్నం. తన సహనానికి ప్రతిఫలం అన్న నమ్మికకూడా వుంది - వైరు తండ్రి చేతికిచ్చి 'ఇప్పుడేమంటావ్?' అన్నట్లు చూసింది కృష్ణవేణి.

'చాలా ఆనందంగా వుందమ్మా. నాకు చాలా తృప్తిగా వుంది. అసలు యీ శుభకార్యం అతను దగ్గిరవుండి జరిపించాల్సింది. పెద్దవాళ్ళం మాకు యీ కాలానికి ఇంత బరువు నెత్తినపడ్డది' అన్నాడు తండ్రి.

తండ్రి వస్తాడు – తన పెళ్ళికి తండ్రి రాబోతున్నాడు అన్న వార్త సీతలో ఎటువంటి భావమూ కలిగించలేదు. ఆ పిల్ల సంతోషించనూలేదు, విచారించనూలేదు. వినీ విననట్లు వూరుకుంది. కృష్ణవేణికి, తాళి గట్టి తనని నిర్లక్ష్యం చేస్తున్న భర్త మనసు కొద్ది కొద్దిగా అన్నా అర్థం అవుతోంది. కాని కడుపున పుట్టిన సీత బాల్యంనుంచీ విడివడని చిక్కుముడిలా అనిపిస్తూ వుంది. సీతకి అందరి ఆడపిల్లల్లాగా పైకి చదువుకోవాలని, పెద్దచదువులు చదువుకోవాలనిలేదు. పి. యు. సి. అవగానే 'నేను యింక చదవను' అంది. ఆమాట విన్నపుడు కృష్ణవేణికి ఏం అనాలో, ఎలా బదులు చెప్పాలోకూడా తట్టలేదు.

'అదేమిటి? వూళ్ళో కాలేజీ వుంది, నీకు మంచి మార్కులు వచ్చాయి.'

'నాకు చదవాలనిలేదు.'

'ఎందుకని?'

'ప్రతిదానికీ కారణం చెప్పాలా ? నాకు చదువుమీద యిష్టంలేదు' అంది సీత.

సీతని చూస్తే కృష్ణవేణికి భయంగా వుంటుంది అప్పుడప్పుడు. ఒకప్పుడు చిన్నపిల్లలాగా ప్రవర్తించినా, మిగతాసమయాల్లో పెద్ద వయసు ముదిరిన దానిలాగా మాట్లాడుతుంది. అమ్మమ్మా తాతయ్యలమీద చూపిన ప్రేమ, గౌరవం తనమీద చూపించదు. అసలు ఈ పిల్లవాడిని ప్రేమించినట్లూ, అతన్ని పెళ్ళిచేసుకోవాలని వున్నట్లూ సీత తల్లితో చెప్పలేదు. ఈ వివరాలన్నీ తను తన తల్లిద్వారా తెలుసుకుంది.

'అమ్మాయ్, దానికి చదువుకోవాలనిలేదు. పెళ్ళి చేసుకుంటా నంటున్నది. పోనీ, దాని జీవితమన్నా సుఖంగా వెళ్ళిపోనియ్. అది మొగుడుతో కాపరంచేస్తూ పిల్లాపాపాతో కళకళలాడుతూ వుంటే చూసి ఆనందిద్దాం. నీకు ఆ అదృష్టం ఎలాగూలేదు' అంది తల్లి.

'నాన్నా, దానికి పద్దెనిమిదికూడా రాలేదు. ఈరోజుల్లో ఆడపిల్ల లందరూ డాక్టర్లు కావాలనీ, యింజనీర్లూ కావాలనీ అనుకుంటుంటే. దాని చదువుకు డబ్బుంది, డొనేషన్‌కట్టి అయినా సీటు తెప్పించవచ్చు.'

'నిజమేనమ్మా. కాని పాపకి యిష్టం లేనపుడు మన మెవరం? నీకు నా స్వభావం తెలుసుగా. ఎవరిష్టం వారిది. ఎదుటివారి మెడలు వంచి మన యిష్టప్రకారం చేయించడం నా నియమానికి విరుద్ధం' అన్నారాయన. తండ్రి గాంధీగారి 'అయిడియల్సు' తూచా తప్పకుండా పాటిస్తారు. అది చాలామంది బలహీనతనీ, చేతగానితనమనికూడా అనుకుంటూ వుంటారు.

కృష్ణవేణి రాయబారం ప్రారంభించింది. పెళ్ళికొడుకు రెండోవాడు. పెద్దతను 'కెనడా'లో సెటిల్ అయిపోయాడు – అక్కడి పిల్లనే పెళ్ళి చేసుకుని ! ముగ్గురు ఆడపిల్లల్లో యిద్దరికి పెళ్ళయింది ; మూడో అమ్మాయి మెడిసన్ చేస్తున్నది. ఆ పిల్ల ఇప్పుడప్పుడే చేసుకోదు. ఈ అబ్బాయి వాల్తేరులో యమ్. యస్సీ. చదివాడు. న్యూక్లియర్ ఫిజిక్స్ మెయిన్‌గా చదివాడు. తండ్రి బందరులోనే కాలేజీలో లెక్చరర్ – వీళ్ళ కుంటుంబానికి బాగా తెలిసినవాడు.

అబ్బాయి అమ్మాయికి నచ్చాడు. అమ్మాయి అబ్బాయికి నచ్చింది. వాళ్ళిద్దరూ ఒకరి కొకరు చాలాసార్లు చూసుకున్నారు. అని తండ్రిద్వారా విన్న కృష్ణవేణికి తృప్తికలగలేదు. కూతురి జీవితం తన జీవితంలాగా అవకూడదు. ఇక్కడ చరిత్ర పునశ్చరణం కాకూడదు. పెళ్ళిచూపులు అయ్యాక అతన్ని, కాబోయే అల్లుడిని ఒకసారి వచ్చివెళ్ళమని కబురు చేసింది కృష్ణవేణి. ఆరోజు సీత ఇంట్లో లేకుండా ఏర్పాటు చేసింది.

ఆ అబ్బాయి వచ్చాడు. తెలివిగలపిల్లవాడిలా వున్నాడు. కళ్ళు చురుగ్గా వున్నాయి.

'ఈ పెళ్ళి నీకు మనస్ఫూర్తిగా, యిష్టంగా వుందా? లేక మీవాళ్ళు బలవంతపెట్టి....' ఆగిపోయింది కృష్ణవేణి.

అతను నవ్వి 'మీరు యీ ప్రశ్న ఎందుకు అడుగుతున్నారో తెలుసు. అందరి జీవితాలూ ఒకేమాదిరిగా వుండవు. మీ కాలంలో బలవంతం పెళ్ళిగాని - కాలం మారింది. ఈరోజుల్లో మెడలువంచి ఎవరికీ ఎవరూ పెళ్ళి చెయ్యలేరు' అన్నాడా పిల్లవాడు.

'మా సీత కాస్త గారాబంగా పెరిగింది. మొండితనంకూడా వుంది. ఈ విషయాలన్నీ గ్రహించి నువ్వు సర్దుకుపోవాలి.'

'పెళ్ళి చేసుకున్నాక సర్దుకుపోక ఏంచేస్తాం? మాయిద్దరికీ ఒకరిమీద ఒకరికి యిష్టం. మా అమ్మావాళ్ళకికూడా సీతంటే చాలా అభిమానం. మీరు అనుకునే సమస్యలు రావు' అన్నాడు.

కృష్ణవేణి పెళ్ళికి ఒప్పుకుంది. ఒప్పుకోకపోతే ఆగుతుంది అనికాదు....తనకు తాను, పెళ్ళికొడుకుని ప్రశ్నించి, తృప్తిపడింది. తనకి జరిగిన అనుభవం, కూతురికి జరగకూడదని ఆమె చాలా జాగ్రత్తగా వుంటున్నది. పెళ్ళివారు కట్నం వద్దు అన్నారు. కాబట్టి ఇందులో డబ్బుకి ఆశబడి, తన భర్తలాగా ఈ పిల్లవాడు డబ్బుకోసం పెళ్లి చేసుకోటంలేదు. సీతకోసమే పెళ్ళి చేసుకుంటున్నాడు.

రాజగోపాల్ కారు మామగారి యింటిముందు ఆగింది. అతను ఈ యింటిని పెళ్ళిలో చూశాడు. మూడునిద్రలకికూడా అతను బందరు రాలేదు, చెల్లెళ్ళ పెళ్ళి అన్న సాకుతో! గుమ్మంలో తాటాకుల పందిరి, దానిచుట్టూ మామిడితోరణాలు, హడావుడిగా తిరిగే జనం. అతను కారు దిగాడు. ఇంట్లోకి వెళ్ళాలి - ఎలా వెళ్ళాలి? మొహమాటంగా నుల్చుని వున్నాడు. కారుదగ్గిర డ్రైవరు సూట్‌కేస్ చేతులో పట్టుకుని అతనివంక చూస్తున్నాడు ఆశ్చర్యంగా! ఈ యింట్లో మనుషు లెవరూ అతనికి తెలియదు. మామగారూ, అత్తగారూ, కృష్ణవేణి ఈ ముగ్గురే తనకి తెలుసు. మిగతా బంధువులని అతను గుర్తించలేడు. వాళ్ళకి తన మొహం గుర్తు వుండి వుండదు. తన చెల్లెళ్ళూ, తండ్రి ఎవరైనా వచ్చివుంటారా? తను ఫలానా

పెళ్ళికూతురు తండ్రిని, అని చెప్పుకు లోపలి కెళ్ళాలా? దూరాన్నుంచి సన్నాయిమేళం వినిపిస్తున్నది. బహుశా విడిదిలోంచి అయివుంటుంది, రాజగోపాల్ సంశయాకుల చిత్తంతో కారుదగ్గిర నుల్చున్నాడు.

ఇంతలోనే లోపలినుంచి గబగబ ఒకస్త్రీ వస్తోంది – వీధిలోకి. ఆమె కృష్ణవేణి. తనకోసం ఎదురు చూస్తోందా? ఏ కిటికీలోంచో వీధివైపు చూస్తూవుందా? కృష్ణవేణికి వాళ్ళొచ్చింది. తల చాలాభాగం పండిపోయింది. గబగబా అడుగులేస్తూ కారుదగ్గరకొచ్చింది. నవ్వుతూ ఆమె ఇంత ధైర్యంగా సూటిగా తనవంక ఏనాడూ చూడలేదు. నవ్వనూలేదు. రాజగోపాల్‌ని చిరపరిచితమైన స్నేహితుని ఆహ్వానిస్తున్నట్లు 'రండి – రైల్లో వస్తారో, కార్లోవస్తారో తెలియక ఎదురుచూస్తున్నాను' అంది ఎదురుపెళ్ళి.

'కారు పక్కగా వుంచు, ఎక్కడికీ వెళ్ళకు. అవసరం వుంటుంది' అని డ్రయివర్‌తో అంటూ కృష్ణవేణివెంట బయలుదేరాడు లోపలికి. అతను వచ్చినవార్త లోపలికి పాకినట్లుంది. కుతూహలంతోకూడిన తలలూ, కళ్ళూ గమనిస్తూ వున్నాయి ఈ ఇద్దరిని.

'మేడమీద మీగది ఏర్పాటుచేశాను. అక్కడ 'డిస్టర్బెన్సు' వుండదు. 'స్టీపు'గా వున్న మెట్లు ఎక్కి పైగదిలోకి తీసుకెళ్ళింది. ఒక్కటే గది. ఆ గదికి బయట మెట్లున్నాయి. లోపల పూర్వకాలపు పట్టెమంచం, పరుపు తెల్లని దుప్పటీ పరచివుంది. ఆ గదిలో ఒక గాడ్రెజ్ టేబులూ – పక్కన కుర్చీ. మరో చెక్క టేబుల్. ఆ టేబుల్‌మీద డ్రయివర్‌ని సూట్‌కేసు పెట్టమని, కృష్ణవేణి – 'నువ్వు కిందకెళ్ళి ఫలహారం తీసుకో. కాఫీ ఫలహారం రెడీగావుంది' అంది అతనితో.

కృష్ణవేణి కంఠంలో పూర్వపు పిరికితనంలేదు. ఆ కంఠంలో గంభీరత, ఆత్మబలం చోటుచేసుకున్నాయి అనుకున్నాడు రాజగోపాల్.

'ఈ గదిలోకి ఎవ్వరూ రారు. స్నానం చేస్తారా? ముందు కాఫీ తీసుకోండి.'

'అన్నీ బెజవాడలో పుగించి వచ్చాను.'

'మీ కూతురు పెళ్ళి – కాఫీకూడా తీసుకోరా ?' అడిగింది సూటిగా చూస్తూ.

'అయితే 'టీ' పంపించు. పాలు లేకుండా. బ్లాక్ టీ అలవాటు' అన్నాడతను ఆమెని 'డిస్ ప్లీజ్' చెయ్యటం యిష్టంలేక.

'అయిదునిమిషాల్లో తీసుకొస్తాను. పంచదార వెయ్యొచ్చా?'

'వద్దు – డయాబిటీస్ యిప్పు డిప్పుడే' ఆగిపోయాడు.

తానెప్పుడు కృష్ణవేణితో అధికంగా ఒక్కమాట మాట్లాడి ఎరగడు. ఇవ్వాళ ఎందుకిలా ఒకటికి రెండు మాట్లాడుతున్నాడు।

లుంగీ కట్టుకుని మంచంమీద పడుకున్నాడు. పక్కటేబుల్ మీద ఆనాటి దినపత్రిక – మేడమెట్లమీద అడుగుల చప్పుడు.

'మీరొచ్చారని తెలిసింది. చాలా ఆనందంగా వుంది. పిడిదింట్లో స్నాతకం జరుగుతోంది. అమ్మాయి గౌరవం కాపాడారు – ఇంతకిమించి–' ఆగిపోయాడు మామగారు.

రాజగోపాల్ కి ఏం చెప్పాలో తోచటంలేదు. ఇది నావిధి అని చెప్పాలా? కన్నకూతురుపట్ల తండ్రి కర్తవ్యం అని అనాలా? కాని, తను సీతకోసం రాలేదు. కృష్ణవేణిపట్ల తన బాధ్యత నెరవేర్చడంకోసం వచ్చాడు.

ఈలోగా కృష్ణవేణి స్టీలుట్రేలో టీతోపాటు కప్పుసాసరూ పెట్టుకుని వచ్చింది. ఆమె పాట్ లోని బ్లాక్ టీ కప్పులోకి వంచి, రాజగోపాల్ చేతికి అందించింది.

'నేను వెళ్తానమ్మా. అల్లుడు వచ్చాడంటే పరుగెత్తుకొచ్చాను. పెళ్ళికొడుకు కాశీ వెళ్ళబోతున్నాడు' అంటూ లేచారు మామగారు. రాజగోపాల్ లేచి నుల్చున్నాడు మర్యాదగా.

'స్నాతకం జరుగుతోంది - విడిదిలోకి వస్తారా? కింద సీత వుంది. పైకి తీసుకురమ్మన్నారా? మిమ్మల్ని బలవంతం చెయ్యను. మీకు రావాలని వుంటే రండి' అంది కృష్ణవేణి. ఆమె ఏనాడూ తనని పట్టబలవంతాన 'యిలా చెయ్యండీ - అలా చెయ్యండీ' అని అడగలేదు. 'టీ' తాగుతున్నాడు మాట్లాడకుండా.

'మామగారూ, మీ ముగ్గురు చెల్లెళ్ళూ వచ్చారు. వాళ్ళూ విడిదిలోనే వున్నారు. అక్కడ 'స్నాతకం' జరుగుతోందని అంతా వెళ్ళారు....'

'మరి నువ్వు యిక్కడున్నావేం?'

'మీరు వస్తారని ఎదురుచూస్తున్నాను. మీకు మొహమాటంగా వుంటుంది - అంతా కొత్త....'

ఈ కృష్ణవేణి తనకి భార్యగాక, ఒక స్నేహితురాలైతే ఎంత బాగుండేది. భార్యాభర్తలమన్న ఈ బలవంతపు బాంధవ్యంతో; తను మనస్ఫూర్తిగా మాట్లాడలేకుండా వున్నాడు. ఈమె తన హృదయాన్ని పుస్తకం చదివినట్లు చదవగలుగుతోంది.

'నేను రావాలా?'

'మీయిష్టం. వస్తే అందరూ సంతోషిస్తారు.'

'అంతా....విచిత్రంగా....'

'చూస్తేయేం - మీరు కూతురు పెళ్ళికి వచ్చారు. రాకపోతే విచిత్రంగాని వచ్చినపుడు ఇంక అనేందుకు ఏముంటుంది?'

'సీత ఎక్కడుందన్నావ్?'

'క్రిందగదిలో. దాన్ని నిన్న పెళ్ళికూతుర్ని చేశాము. నలుగురిలో చూస్తే మీరు గుర్తించలేరుకూడా. అంత పొడుగు ఎదిగింది.'

'జేబులోంచి తాళాలు తీసి మంచంమీద వుంచుతూ, 'ఆ పెట్లో నగలూ, చీరెలూ వున్నాయి తీసుకో.'

'ఎవరికోసం?'

'నగలసెట్, పెద్దజరీ చీరె అవి ౹కి. ఇంకో చీరె....'

'నాకా?' అడిగింది కృష్ణవేణి.

ఆమెని గాయపరచటం యిష్టంలేక 'అవును' అన్నట్లు తలవూపాడు.

కృష్ణవేణి తాళంచెవులు తీసుకుని పెట్టె తెరిచింది. లోపలనుంచి నగలపెట్టా, చీరెలపెట్టెలూ తీసింది. ముఖమల్‌చెద్‌మీద నెక్లస్, గాజులూ వగైరాతో బంగారుసెట్. పక్కనే మరో ముత్యాలదండ. 'చాలా బాగున్నాయి' చీరెపెట్టె మూతతీసి, 'చాలా మంచిరంగు. సీతకి బాగుంటుంది' అంది. ఆమె కంఠంలో సంతోషం తొణికిసలాడుతోంది.

ఆడదాని మనసు ఆడదానికే తెలుసు అన్న నిజాన్ని సురేఖ మరోసారి నిరూపించింది. కూతురు పెళ్ళికి ఒక పదివేలు తీసుకెళ్ళి ఖర్చులకి యిద్దామనుకున్నాడు. సురేఖ డబ్బు ముఖ్యంకాదు – నగలూ, చీరెలూ కొనాలని పట్టుపట్టి తనే ఎన్నికచేసింది. వీళ్ళకి నచ్చాయి.

'ముందు సీతని చూసి, దానికి మీరే యివ్వండి' అంది కృష్ణవేణి.

ఆమెవెంట మెట్లు దిగుతున్నాడు. పెళ్ళింట్లో చాలాకళ్ళు అతని వంక కుతూహలంగా చూస్తూ వున్నాయి. పెళ్ళికూతురు వున్నగదిలో చాలామంది ఆడపిల్లలు – బహుశా సీత ఫ్రెండ్సు కాబోలు – వున్నారు. ఆ పిల్లలంతా రాజగోపాల్‌ని చూడగానే ఆకాశంలోని పిట్టలలాగా గుంపుగా గదిబయటకి వచ్చేశారు.

తలవంచుకుని పదిహేడేళ్ళ సీత కూచుని వుంది. పట్టుచీరె కట్టుకుని కూచున్న యీ యువతి తన కూతురా? తానీపిల్లకి జన్మయిచ్చాడా? కృష్ణవేణి చెప్పినట్లు, పదిమంది ఆడపిల్లల్లో యీ సీతని చూస్తే తనకి పుట్టినపిల్ల అని గుర్తించలేకపొయ్యేవాడు. ఆరోగ్యంగా, యౌవ్వనంలో వున్న ఈ పిల్ల తన పిల్ల. అతని మదిలో సురేఖ రూపం కదిలింది. సురేఖ

అన్నట్లు ఈ సీత తనకీ, సురేఖకీ పుట్టివుంటే ఈ పెళ్ళిలో తానింత అంటీ ముట్టనట్లు దూరంగా వుండగలిగేవాడా? సురేఖని తాను మొదటిసారి యింత వయసులోనే చూశాడు? సురేఖ ఎలా వుందో, పసిపిల్లతో ఏం తిప్పలు పడుతోందో?

'సీతా, నాన్నగార్కి నమస్కారం చెయ్యి' కృష్ణవేణి కంఠం.

సీత లేచి తండ్రి రెండుపాదాలకీ నమస్కారం చేసింది. అతనికి ఏమని ఆశీర్వదించాలో తెలియలేదు. చేతిలో పెట్టెని సీత కిచ్చాడు. సీత తల్లిలాగా ఆ పెట్టెని వెంటనే తెరిచి చూడలేదు. పెట్టె వొళ్ళో పెట్టుకుని తిరిగి కూచునివుంది తలవంచుకునే. రాజగోపాల్‌కి కూతురి మొహం స్పష్టంగా కనిపించలేదు. సిగ్గువల్లనో, కొత్తవల్లనో సీత తల ఎత్తలేదు. తండ్రివంక సూటిగా చూడలేదు.

'మీ నాన్నగారు నీకోసం చీరెకూడా తెచ్చారు' కృష్ణవేణి సీత చేతికి అట్టపెట్టెని అందించింది. ఆ పెట్టెకూడా వొళ్ళో పెట్టుకు కూచుంది సీత.

ఈలోగా అగది గుమ్మంలో కలకలం. రాజగోపాల్ వచ్చాడన్న వార్త విని తండ్రీ, చెల్లెళ్ళూ విడిదిలోంచి గబగబా వచ్చారు. ఇంకా 'కాశీ యాత్ర'కి వ్యవధి చాలా వుందిట. తండ్రి రాజగోపాల్‌ని గట్టిగా కావిలించుకుని కళ్ళమ్మటనీళ్ళు పెట్టుకున్నాడు. చెల్లెళ్ళు అతనివంక అపేక్షతో, గర్వంతో చూస్తున్నారు. రాజగోపాల్‌కి వీళ్ళందర్నీ చూస్తే - ఎటువంటి వుద్రేకమూ కలగటంలేదు. ఏదో పరిచయంవున్న వ్యక్తులని, చాలారోజుల తరువాత కలుసుకున్న భావం కలుగుతోంది తప్ప రక్త స్పర్శలో చెప్పేటువంటి సంచలనం కలుగలేదు.

'అన్నయ్యా, అంత చిక్కిపోయావేమిట్రా. నల్లబడిపోయావు, తలమీద ఒక్కవెంట్రుకలేదు. పెద్ద చెల్లెలు అడుగుతోంది. తన జీవితం యిటువంటి అసాధారణ పరిస్థితులకి లోనవటానికి కారణమయిన వ్యక్తి అడుగుతోంది. రాజగోపాల్ నవ్వి వూరుకున్నాడు.

'పెళ్ళికొడుకు కాశీయాత్రకు వెళ్ళబోతున్నాడు' అంటూ విడిదిలోంచి కబురు. అందరూ విడిదివైపుకి పరుగులు తీశారు.

'వస్తారా?' అడిగింది కృష్ణవేణి.

'చాలాదూరమా?' అడిగాడు.

'పక్కవీధిలో – మీరు కారులో రండి.'

'ఒక్కడినీ 'ఆక్వర్డు'గా వుంటుంది నువ్వూరా' అన్నాడు రాజగోపాల్.

ఈలోగా చాలామంది పిల్లలు కారు ఎక్కేశారు బిలబిలమంటూ. రాజగోపాల్ డ్రయివరుపక్కా, కృష్ణవేణి వెనకసీట్లోనూ సర్దుకున్నారు.

పెళ్ళికొడుకు కాశీయాత్రకి బయలుదేరుతున్నాడు. అతన్ని, వరసకి బావమరిది అయిన ఓ యువకుడు పెళ్ళద్దని బతిమాలి వెనక్కి తీసుకొస్తున్నాడు.

రాజగోపాల్, కృష్ణవేణిపక్కన నుల్చుని, ఈ తంతు చూస్తున్నాడు. అతని దేహం యిక్కడుందిగాని మనసు భూతకాలంలోకి మద్రాసువైపుకి పరుగెడుతున్నది.

తననీ యిలా బ్రతిమలాడారా? గుర్తురావటంలేదు. తను వాళ్ళు తెలియని పరిస్థితిలో, మనసుని చంపుకుని ప్రాణరహితమైన బొమ్మలాగా యీ తంతులో పాల్గొన్నాడు. అటువంటి మనసులేని వైవాహకబంధంనుంచి యీ సీత పుట్టింది. దానికి ఇప్పుడు పెళ్ళి. ఈలోకంలో యిష్టంలేని పెళ్ళిళ్ళు ఎన్ని జరుగుతున్నాయో! అలా మనసుని చంపుకుని ఎందరు పిల్లల్ని కంటున్నారో – ఆ పిల్లలు యింకా ఎందర్ని కంటున్నారు? నిరంతరం సాగిపోయే ఈ మహాసృష్టిలో, ఎందరు దంపతులు మనసావాచా నిజమైన వైవాహికజీవితం గడుపుతున్నారు? అలా గడపదలచుకున్న తనలాంటి దంపతులకి సురేఖా, తనూవంటి దాంపత్యానికి సమాజపరమైన ఆమోదం

లేదు. తమని యీనాటికీ, యీక్షణంలోకూడా విచిత్రవ్యక్తులులాగానూ, విప్లవకారులుగానూ చూస్తారు. మనస్ఫూర్తిగా ఒకరి నొకరు ప్రేమించుకుని దాహికంగా ఒకరి నొకరు కోరుకునే తమ కలయిక, తమ సహజీవనం వీరి దృష్టిలో అధర్మమైన జీవనం. అవినీతికరమైన జీవితం. పరిస్థితుల ఒత్తిడివల్ల బలవంతాన ముడివేయబడి, ఒక ఏడాదికూడా సుఖంగా జీవించని కృష్ణవేణితో గడిపిన జీవితం నైతికమైనదీ, ధర్మబద్ధమైనదీను. నవ్వుకున్నాడు తనలో తను. షుమారు యిరవై ఏళ్ళకి పైగా – తనకీ సురేఖకీమధ్య పరిచయం వుంది. తామిద్దరూ ఈ యిరవై ఏళ్ళుగా ఒకరి నొకరు ప్రేమించుకుంటున్నారు; కలిసి బతుకుతున్నారు. కష్టసుఖాలు పాలు పంచుకుంటున్నారు. అయినా వీరెవరి దృష్టిలో తను సురేఖకి భర్తకాడు – కృష్ణవేణికిమటుకే భర్త. ఈ వివాహక్రతువు అన్నది అంత బలీయమైన వ్యవస్థా ? దీనిని కదిలించడానికి ఎవరికీ శక్తిలేదా ?

కాశీకి వెళ్ళి వెనక్కివచ్చిన పెళ్ళికొడుకుని తనకి చూపిస్తున్నారు. 'మీ మామగారికి నమస్కారం చెయ్యి' తెల్లపట్టుపంచలు కట్టుకున్న పెళ్ళికొడుకు రాజగోపాల్ రెండుపాదాలమీదా చేతులుంచి ఆ చేతులు కళ్ళకి అద్దుకుని నమస్కారం చేశాడు. రాజగోపాల్ క్షణకాలం తొట్రుపడ్డాడు. ఈ పిల్లవాడు తనకెందు కింత నమ్రతగా నమస్కరిస్తున్నాడు. ఆ అరిచేతుల్లో కృతజ్ఞతాభావం వుందా? సీతకి జన్మ యిచ్చినందుకు – తనకి కృతజ్ఞత చెప్పుకుంటున్నాడా? తన ప్రమేయం లేకుండా సీత ఈ లోకంలోకి వచ్చింది. తాను ఏనాడూ తండ్రిగా సీతపట్ల బాధ్యత చూపలేదు. కనీసం ప్రేమకూడా చూపలేదు.

పెండ్లి మైమదాకా ఎవరెవరో బంధువులు, కొత్తముఖాలూ అంతా తమని తాము పరిచయం చేసుకు మాట్లాడుతున్నారు. తను పెద్ద వుద్యోగస్థుడినని వీళ్ళంతా గౌరవిస్తున్నారా? పదిసార్లు ఫారెన్ వెళ్ళి వచ్చినవాడినని ఘనంగా చూస్తున్నారా? ఆ మధ్యాహ్నం పెళ్ళికొడుకుతప్ప

మిగతా అంతా భోజనానికి వచ్చారు. వియ్యంకుడిపక్కన రాజగోపాల్‌కి వడ్డించారు. రాజగోపాల్‌కి ఈ పెళ్ళికొడుకు తండ్రితో ఏం మాట్లాడాలో తెలియటంలేదు. తను ఈ సంబంధం కుదర్చలేదు. తొలిసారి పెళ్ళికొడుకునీ, ఆతని బంధువులనీ చూస్తున్నాడు. పెళ్ళికొడుకు తండ్రి రాజకీయాలు ఎత్తుకున్నాడు. 'బ్రతుకు జీవుడా' అని కబుర్లలో పడ్డాడు రాజగోపాల్.

ఆ మధ్యాహ్నం పెద్దచెల్లెలు, తన కొడుక్కి అమెరికా వెళ్ళాలని వుందనీ, అందుకు తను ఏదన్నా సహాయం చెయ్యాలనీ అడిగింది. రెండో చెల్లెలు, కూతురుకి సంబంధాలు వెతుకుతున్నామనీ, అవసరం అయితే అన్నగారు డబ్బు సాయం చెయ్యాలనీ కోరింది. రాజగోపాల్ వీళ్ళందరి కోరికలూ విన్నాడు. 'చేస్తాను' అనలేదు ; 'చెయ్యను' అనలేదు. కృష్ణవేణి వీళ్ళందరికీ ముందే చెప్పిపెట్టిందా ; లేక, తన కారూ, హోదా చూసో, బంధువులంతా చాలా మర్యాదగా ఉన్నారు. ఆఖరికి మగపెళ్ళివారిపట్లకంటె రాజగోపాల్‌పట్లనే ఎక్కువ శ్రద్ధా – గౌరవం చూపిస్తున్నారు. రాజగోపాల్‌కి మనసులో నవ్వుగా ఉంది.— పదిహేనేళ్ళక్రితం .... తనని వెలివేసినట్లు – అందలూ దూరంగా ఉంచారు. భార్యని వదిలేసి డాన్సరుతో పారిపోయాడని కథలూ గాథలుగా చెప్పుకున్నారు. తను ఎందుకూకాకుండా పోతాడని నిర్ణయించి చెప్పేశారు. ఈనాడు .... ఆ బంధువులే తనకి బ్రహ్మరథం పడుతున్నారు. తాను ఈనాడు ఎవరివల్ల యింతవాడయ్యాడో, వాళ్ళకి తెలియదా ? నెలకి పదిరోజులు ఢిల్లీకి మద్రాసుకీ మధ్యన విమానంలో తిరిగే తను – విమానం లేకపోతేతప్ప ట్రెయిన్‌లో వెళ్ళని తను – యింత పెద్దపదవిలో ఉన్నాడంటే ; ఆ వెనక ఎవరి కృషి ఉందో – వాళ్ళకి తెలుసా ? అనాడు డాన్సరు అని చులకనగా వీరిచేత పిలువబడిన సురేఖ – తన సంపదకీ, ఉన్నతికీ కారణం !.... అది చెపితే వీళ్ళ మొహాలు ఎలా

ఉంటాయి ? ఒక్కొక్కచుట్టమూ వచ్చి – అంత మర్యాదగా తనని పెద్దచేసి మాట్లాడినపుడు, 'నా విజయానికి వెనక సురేఖఉంది – ఈ గౌరవం సురేఖకి దక్కాలి – నాకుకాదు' అని అరిచి చెప్పాలని అనిపించేది.

ఆరాత్రి – 'సీత గౌరిపూజ చేస్తున్నది. వచ్చి చూస్తారా ? ' అని అడిగింది కృష్ణవేణి మేడమీదకివచ్చి. ఆమె మధ్యమధ్య పైకివచ్చి అతనికి ఏంకావాలో కనుక్కుంటున్నది. రెండు మూడుసార్లు టీ తీసుకొచ్చి ఇచ్చింది. ఆమె శ్రద్ధచూపిస్తున్నకొద్దీ – రాజగోపాల్‌కి తను చేసిన నేరం పెద్దదయి – ప్రమాణంలో పెరుగుసూవున్నట్లు అనిపించసాగింది. అతను మంచంమీంచి లేవలేదు. కృష్ణవేణి అతనికి యిష్టంలేదని గ్రహించుకుని కిందకి వెళ్ళిపోయింది.

కన్యాదానవేళ రాజగోపాల్, చాలారోజుల తరువాత, పంచె కట్టుకున్నాడు. అతనిపక్కన కృష్ణవేణికూడా కూచునివుంది. ఆమె భర్త తెచ్చిన పట్టుచీరె కట్టుకుంది. ఈ చీర సురేఖ – 'అక్కగారికి' అంటూ ప్రత్యేకం కొని తీసుకొచ్చింది. 'పేరు రాయకపోయినా రెండు శుభలేఖలు పంపింది కాబట్టి – ఆమెకి చీరె పట్టుకెళ్ళండి' అని – నీలంపట్టుమీద జరీచుక్కలచీరె ఎంచి తీసుకొచ్చింది – ఆరోజు షాపులో తనూవున్నాడు సురేఖ ఏరిఏరి కొంటుంటే ! అంచేత కృష్ణవేణి తను తెచ్చినచీరె కట్టుకోడం గమనించగలిగాడు. బుట్టలో కూచోపెట్టి తీసుకువచ్చిన పెళ్ళికూతురు – సీత ఏం చీర కట్టుకుందోనన్న కుతూహలం – అతనిలో కలిగింది. కళ్ళెత్తిచూశాడు. సీత తను పట్టుకొచ్చిన చీరె కట్టుకోలేదు – సీత మెడలో, తను తీసుకొచ్చిన నగలుకూడా లేవు. సురేఖ పంపిన నెక్లెస్ – గాజులూ సీతకి నచ్చలేదా ? అతను పెళ్ళికొడుకు రెండుపాదాలనీ చేతులతో కడుగుతున్నాడు – పక్కన వంగుని కృష్ణవేణి నీళ్ళుపోస్తున్నది. ఆమె తన

ధర్మపత్ని, సహధర్మచారిణి. తను కాళ్ళు కడుగుతుంటే, ఆమె నీళ్ళు పోస్తున్నది. కాళ్ళు కడిగి - తమ సంతానమైన యీ సీతని దానం చేస్తున్నారు.

రాజగోపాల్‌కి ఈ తంతు బూటకంగా అనిపిస్తున్నది. ప్రతిసారీ యీ కృష్ణవేణి - శుభకార్యాలప్పుడు పక్కన కూచోవడంతప్ప, యీమె జీవితానికీ తనజీవితానికీ మధ్య ఎటువంటి సంబంధమూ లేదు. షుమారు మూడు వందలమైళ్ళ దూరంలో-పదిహేనేళ్ళబట్టీ విడివిడిగా జీవిస్తున్నారు. పీటలమీద కూర్చున్నపుడుతప్ప, ఒకరి నొకరు తాకనంత దూరంగా వున్నారు. అయినా ఆమె రమ్మని రాసింది: తాను వచ్చాడు. ఎందుకు? పౌరోహితుడు అనమన్న మంత్రాలని యాంత్రికంగా తిరిగి అంటున్నాడు. ఈమె ఎవరు - తమ యిద్దరిమధ్యా కూర్చున్న యీ పిల్ల ఎవరు? వీరిపట్ల తనకి ప్రేమ, అభిమానంవంటివి కలగటంలేదు. నాటకంలో పాత్రని నిర్వహించినట్లు - ఈ పెళ్ళితంతు అయిపోయాక - తన దారిన తాను వెళ్ళిపోతాడు.

ఆ మరునాడు వుదయం రాజగోపాల్ ప్రయాణమయ్యాడు. మిగతా అందరూ అప్పుడే వెళ్ళిపోతారా అని, లాంఛనంగానూ, బాధగానూ అన్నారే తప్ప, కృష్ణవేణి ఏమీ అనలేదు.

'మీరు అన్న మాటప్రకారం వచ్చారు. నాకు చాలా సంతోషంగా వుంది' అంది, అతను వెళ్ళిపోయేముందు మేడమీద గదిలోకి వచ్చి.

రాజగోపాల్‌కి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. పెళ్ళికోసమని సురేఖ డబ్బు కవర్లోపెట్టి యిచ్చింది. అది కృష్ణవేణికి యిమ్మని చెప్పింది. ఎలా యివ్వాలో తెలియటంలేదు.

కవరు కృష్ణవేణివైపు తోస్తూ 'పెళ్ళిఖర్చుకు డబ్బు తెచ్చాను' అన్నాడు రాజగోపాల్.

'ఈ పెళ్ళి మీరు పంపిన డబ్బుతోనే చేశాను. నాన్న ఖర్చుచేస్తానన్నా వొప్పుకోలేదు. ఇంకా ఎందుకు? వొద్దు!' అంది కృష్ణవేణి.

'చాలదేమోనని.'

'చాలింది. లేకపోతే రాసేదాన్ని' అంది.

రాజగోపాల్ కవరు పెట్లోపెట్టుకుని మద్రాసుకి తిరిగి వచ్చేశాడు.

# 11

స్టేషనుకి కారు వచ్చింది. ఇంటి కొచ్చేప్పటికి సురేఖ ఎదురురాలేదు. ఒక్కసారి అతన్ని నిరుత్సాహం ఆవహించింది. ఎప్పుడు వూరు కెళ్ళినా తిరిగి వచ్చేప్పటికి సురేఖ కారు హారన్ వినగానే గేటుదగ్గిరకు పరుగెత్తుకుంటూ వస్తుంది. చిన్నపిల్లలా నవ్వుతూ కారుకి ఎదురొస్తుంది. ఇవ్వాళ సురేఖ ఎదురురాలేదు. తనకోసం ఎదురు చూడటంలేదు. బహుశా కోపం వచ్చిందా? ఉహుఁ – సురేఖకి తన విషయంలో జెలసీలేదు. లోపల నుంచి పసిపిల్ల గుక్కపట్టినట్లు ఏడుపు.

అతను లోపలి కెళ్ళాడు. సురేఖ బేబీ గదిలో వుంది. బేబీకి కడుపు వుబ్బరించిందట. రాత్రంతా నిద్రపోకుండా నర్సూ, సురేఖా టరన్స్ ప్రకారం ఎత్తుకుని లాలిస్తున్నారు.

'గోపీ' నర్సు వున్న విషయం మర్చిపోయినట్లుంది సురేఖ. ఆదుర్దాగా 'గోపీ' అని పిలుస్తూ 'బేబీకి పొట్ట వుబ్బరించింది. పోతపాలు అజీర్తి చేశాయిట. నాకేదో భయంగా వుంది' అంది బేబీని నర్సుకి అప్ప జెప్పి – అతని దగ్గర కొస్తూ.

'డాక్టరుగా రొచ్చారా?'

'నిన్న రెండుసార్లొచ్చారు. ఇవన్నీ పోతపాలప్పుడు జరిగే మార్పులు – ఏం భయంలేదంటారు. నాకేమిటో ఖంగారుగా వుంది.'

'అమ్మగారూ మీరు మరీ భయపడిపోతున్నారు. కాసేపుంటే విరేచనం అవుతుంది. మాకు యివన్నీ అలవాటే' అంది నర్సు తాపీగా.

'డాక్టరుగారు ఫరవాలేదన్నారుగా. ఆవిడ ఏం చెప్పారో జ్ఞాపకం వుందిగా! పసిపిల్లలకి మనకంటే ఎక్కువ 'రెసిస్టెన్సు' వుంటుందిట. రాత్రంతా నిద్రపోలేదా?' అడిగాడు సురేఖ వడిలిన ముఖంవైపు చూస్తూ.

'లేదండీ, అలా పాపని వొళ్ళో పెట్టుకు కూచున్నారు. కదులుతే పాపకి మెళుకువ వచ్చి ఏడుస్తుందని భయపడి కూచున్నారు. రెప్పకూడా వెయ్యలేదు' అంది నర్సు.

నర్సుకి సురేఖని చూస్తే వేళాకోళంగా వుంది. కాస్త కినుకగాకూడా వుంది. సంపన్నుల ఇళ్ళలో పసిపిల్లల పెంపకం యిలా వుండదు. మూడొంతులమంది, తల్లికి విశ్రాంతి యివ్వాలని, నర్సుని పెట్టుకుంటారు. రాత్రిళ్ళు నిద్ర చెడిపోతుందని – పసిపిల్లకి, నర్సుకి విడిగా గది కేటాయిస్తారు. తల్లిపాలయితేతప్ప పోతపాలయినపుడు గదిలోకికూడా రారు. పిల్ల ఏడిస్తే సముదాయించడం, పాలుపట్టడం వగైరా డ్యూటీలు నర్సుపైనే వుంటాయి. అల్లాంటిది ఈ అమ్మగారు – పెద్ద పదినెలలు మోసి కన్నవాళ్ళకంటే అక్కరగా ఖంగారుపడుతోంది. పిల్ల ఏడిస్తే భయం, ఏడవకపోతే భయం. పాలు తాగుతే ఎక్కువయిపోతాయేమోనని, తాగక పోతే ఆకలితో శోషవస్తుందనీ, క్షణక్షణానికి అనుమానంపడి ప్రాణం తీస్తోంది. పేరుకి నర్సుని పెట్టిందిగాని అన్నిపనులూ తనే చేస్తానంటుంది. తనని ఎదురుగుండా కూచోపెట్టి, ఆఖరికి డైపర్సుకూడా తనే మారుస్తున్నది. అలాంటప్పుడు తనెందుకిక్కడ! మళ్ళీ పాపం! ఆ పసిదానిమీద, ఎవరికో పుట్టిన ఆ అనాథప్రాణిమీద ఎంత ప్రేమ అన్న జాలి కలుగుతూవుంది.

'మీరెళ్ళి ముఖం కడుక్కోండి' నర్సు కొత్త గదమాయించినట్లుగానే అంది.

సురేఖ మొహం కడుక్కువచ్చేటప్పటికి టీపాయ్‌మీద – 'టీ' ట్రే రడీగా పెట్టాడు నాయర్. రాజగోపాల్ యిద్దరికీ – కప్పుల్లో బ్లాక్ టీ వంచి సురేఖ చేతికి కప్పు అందించాడు.

'గోపీ : పెళ్ళి బాగా జరిగిందా ? ' అడిగింది సురేఖ.

'ఆ.' అన్నాడతను.

'సీతకి చీరె నచ్చిందా ? నగలు పెట్టుకుందా ? '

'ఏమో అవన్నీ నేను చూడలేదు' అబద్ధమాడుతున్నాడు.

'నువ్వెప్పుడూ యింతే. ఆఖరికి నేనేం చీరకట్టుకున్నానోకూడా గమనించవు'

'అబద్ధం. నువ్వేరంగు చీరెకట్టుకున్నావో చెపుతాను. నీకెన్ని చీరెలున్నాయో తెలుసు. ఎందుకో తెలుసా ? నీకు చీరెలన్నీ నేనే కడతాను కాబట్టి – యీ పిల్లకి చీరె కట్టుకోవటంకూడా రాదమ్మా – '

'ఛీ – పెసవ రౌడీమాటలూ నువ్వూను. పెద్దవాళ్ళమైపోతున్నాము – నేను పిల్లతల్లిని తెలుసా ? '

'అయితే _ నేనేం కానా ? '

'కాకపోటమేం ? నువ్వు ఒక ఆడపిల్లకి తండ్రివి. మర్యాదగా వుంటం నేర్చుకో. ఇప్పటినుంచే డబ్బు జాగ్రత్త నేర్చుకోవాలి.'

'దేనికమ్మా – '

'బేబీ పెద్దదపుతే – చదువుచెప్పించాలి – పెళ్ళి చెయ్యాలి. ఇన్నాళ్ళుబట్టీలాగా వచ్చిందంతా – ఖాళీచేస్తే వొప్పుకోను. ఇకనుంచీ కొత్త 'సేవ్' చెయ్యటం అలవాటు చేసుకోవాలి' అంది సురేఖ పెద్ద ఆరిందాలాగా.

రాజగోపాల్ నవ్వుకున్నాడు.

'ఏయ్ – దేనికి నవ్వుతున్నావు ? ' అడిగింది సురేఖ కోపంగా.

'నేను చిన్నప్పుడు – ఒక బీదబ్రాహ్మడి కథ చదివాను – అది జ్ఞాపకం వచ్చి – '

'నీ కెప్పుడూ – కథలు చెప్పి నన్ను వేళాకోళం చెయ్యటంతప్ప వేరుపని లేదు. ఏమిటా కథ ? '

'నేను చెప్పను.'

'చెప్పాలి – చెప్పకపోతే వూరుకోను.'

'ఏం చేస్తావ్ ? '

'గిచ్చి, రక్కి, జుట్టుపట్టుకు పీకుతాను.'

'నా బుర్రమీద వెంట్రుకలన్నీ ఎప్పుడో పీకేశావ్ – వుత్త బాల్డ్ హెడ్ మటుకే మిగిలింది.'

'అయితే చెవులు కత్తిరించేస్తాను – చెప్పు.'

'చెపుతా విను. నీలాంటి పెర్రిబ్రాహ్మడు –'

'నేను బ్రాహ్మణదాన్ని కాను.'

'నన్ను చేసుకున్నావుగా – అందుకని నువ్వు బ్రాహ్మలమ్మాయివి అయిపోయావు. ఒకబ్రాహ్మడు తద్దినం బ్రాహ్మణార్థానికి వెళ్ళి పొట్టనిండా తినేసి – భుక్తాయాసంతో ఒక అరుగుమీద పడుకుని నిద్రపోతున్నాడుట.'

'నీకుమల్లే గుర్రుపెట్టి.'

'అయితే కథ చెప్పను.'

'ప్లీజ్'

'తద్దినానికి నువ్వులు తలమీద వేస్తారు. అక్షింతలు కాదు.'

'ఎందుకని?'

'కథ వింటావా, వినవా?'

'ఊఁ, చెప్పు.'

'నిద్రపోయి లేచి బుర్ర గోక్కుంటే గోటిలోకి ఓ నువ్వుగింజ వచ్చిందట. ఆ నువ్వుగింజని తీసుకెళ్ళి పాతేస్తే .... అదో పెద్ద మొక్క అవుతుంది. ఆ మొక్కకి చాలా నువ్వులొస్తాయి. వాటిని మళ్ళీ నాటి నువ్వుచేలు వేసుకుంటాను. ఆ నువ్వు లమ్మి, బాగా డబ్బుగలవాడిని అవుతాను. ఆ డబ్బుతో యిల్లు కట్టుకుంటాను. నా యిల్లూ, డబ్బూ చూసి చాలామంది పిల్ల నివ్వటానికి వస్తారు. మంచి బుద్ధిమంతురాలయిన పిల్లని ఏరి పెళ్ళిచేసుకుంటాను .... పెళ్ళి అయాక - మాకో అబ్బాయి పుడతాడు - మా ఆవిడ కాస్త పిల్లవాడిని ఎత్తుకోమని యివ్వబోతుంది. 'ఛీ, నేను మొగాణ్ణి పిల్ల నెత్తుకుంటానా' - అని చేత్తో మా ఆవిడని విసిరికొడతాను. అని పగటికలలో ఆఖరిభాగంగా చెయ్యి విసిరేస్తాడు పెర్రిబ్రాహ్మడు. పక్కనే ఆ అరుగుమీదనే ఒక కుమ్మరి కుండలబుట్ట పెట్టుకుని కూచుని వున్నాడు. బ్రాహ్మడి చెయ్యి విసురుగా కుండలమీదకి వెళ్ళి పడింది. కుండలన్నీ పగిలిపోయాయి. కుమ్మరివాడు బ్రాహ్మడి పిలక పుచ్చుకున్నాడు — నా కుండలన్నీ పగలగొట్టావ్, డబ్బు లిమ్మని ! బ్రాహ్మడు చేసేదిలేక బొడ్లోవున్న సంభావన డబ్బులు యిచ్చేసి ఏడుచుకుంటూ వెళ్ళిపోయాడు.'

'ఛీ - పిచ్చికథా నువ్వూను. నీకు అన్నిట్లోనూ ఏడుపే కనిపిస్తుంది. అందరి కలలూ ఏడుపుతోనే ముగుస్తాయంటావు. నువ్వు వుత్త 'పెసిమిస్టు'.

'ఛీ - ఛీ అందుకుకాదు. నీ కూతురికి నెలరోజులయినా వయసులేదు' అప్పుడే పెళ్ళి అంటుంటే-'

'ఏం అనకూడదా. నా ఫ్రెండు కడుపుతో వుండగానే కాన్వెంటులో సీటు రిజర్వు చేసుకుంది తెలుసా ? నేనుకూడా బేబికి యిప్పుడే అడ్మిషన్ రికార్డు రిజిష్టర్ చెయ్యాలనుకుంటున్నాను.'

'శుభం....చెయ్యి.'

'నీ పిచ్చికథతో అసలు విషయం అడగలేదు....పెళ్లికొడుకు ఎలా వున్నాడు?'

'మనిషిలా వున్నాడు.'

సంతోషించాలే నీ తెలివికి. ఇద్దరూ యీడూ జోడుగా వున్నారా? ఉద్యోగం చేస్తాడా? రిసెర్చా ? '

'అడగలేదు. రిసెర్చ్ చేస్తాడనుకుంటా.'

'అక్కగారు ఎలా వున్నారు?'

'బాగానేవుంది.'

'మామగారూవాళ్ళూ వచ్చారా?'

'ఆహా. అంతా వచ్చారు. చెల్లెళ్ళూ, మొగుళ్ళూ, పిల్లలూ - గాంగ్ అంతా వచ్చారు.'

'గోపీ, వాళ్ళ నెవళ్ళనీ మనింటికి రమ్మని పిలవలేదా?'

'లేదు.'

'నీకు వాళ్ళు రావాలని వుండదా?'

'ఉండదు.'

'మీ నాన్నగారుకూడా?'

'ఉహూం, వుండదు. నిజం చెప్పమన్నావా? మా నాన్నకంటే - రాజారావుగారు అంటే కృష్ణవేణి పేరెంట్స్ చాలా సంస్కారంగలవాళ్ళు. నాకు ఏమాత్రమన్నా అభిమానం వుంటే, వాళ్ళమీద వుందిగాని, మావాళ్ళ మీద లేదు.'

'ఎందుకని?'

'ఒకవయసులో, నేను సంతోషంగా, ఫ్రీగా వుండాల్సిన వయసులో నన్ను మూడేళ్ళపాటు పంజరంలోపెట్టి బంధించారు. నా రెక్కలు విరిచి కూచోబెట్టారు.'

'బయట బడ్డావుగా'

'నువ్వే అదుకోకపోతే - నువ్వు కష్టబడి నన్ను చదివించకపోతే, ఇంకా ఆ బురదలోనే పడి కొట్టుకునేవాడిని' అన్నాడు రాజగోపాల్. అతని కంఠం గంభీరంగా వుంది.

'అక్కగారు చీరె కట్టుకున్నారా ? '

'నేను గమనించలేదు' మళ్ళీ అబద్ధం ఆడుతున్నాడు. తెలిసీ, ఆడుతున్నాడు. కృష్ణవేణి చీరెని గమనించిన తను, సీత చీరె కట్టుకుందో లేదో చూసివుండడా అన్న అనుమానం సురేఖకి రావచ్చు.

'ఆమె నిన్ను బాగా చూసుకున్నారా ? '

'ఒకవిధంగా ! నీ తరువాత, నాపట్ల అతిశ్రద్ధ చూపించే వ్యక్తి ఆమె ఒక్కర్తే. నేను స్వేచ్ఛ కావాలి అని గింజుకున్నపుడు, తను అడ్డు రాలేదు. స్వేచ్ఛ యిచ్చింది. నా జీవితంలో ఇద్దరికంటే ఇద్దరికే కృతజ్ఞత చూపించాల్సిన వ్యక్తులున్నారు. నువ్వూ నేనూ - వేరుకాదు. అంచేత నీకు కృతజ్ఞత చూపించాల్సిన ప్రసక్తిరాదు. రెండోవ్యక్తి కృష్ణవేణి. ఆమె పట్ల నే నెప్పుడూ ఋణపడే వుంటాను' అన్నాడు రాజగోపాల్.

సురేఖ మాట్లాడలేదు. దిళ్ళనానుకుని మంచంమీద కూచున్న సురేఖ అలానే కళ్ళు మూసుకుని నిద్రలోకి జారిపోవడం గమనించి చప్పుడు చెయ్యకుండా బెడ్‌రూమ్ తలుపుమూసి హాల్లో కొచ్చాడు రాజగోపాల్. పక్కగదిలోంచి పాప ఏడుపుకూడా వినిపించటంలేదు. నర్సరీలోకి తొంగి చూశాడు. పాప వుయ్యాలలో నిద్రపోతున్నది. నర్సు పాప డైపర్సుకాబోలు చుట్టచుట్టి - ప్లాస్టిక్ కాన్‌లో వేస్తోంది. పాపకి విరేచనం అయింది కాబోలు అనుకున్నాడు రాజగోపాల్. అతను ఆఫీసుకి వెళ్ళేదాకా సురేఖ నిద్ర పోతూనేవుంది. ఆమెని లేపవద్దని నాయర్‌కి చెప్పి ఆఫీసుకి కదిలాడు రాజగోపాల్.

ఈమధ్య సురేఖ నృత్యనికేతనానికికూడా రెగ్యులర్‌గా వెళ్ళటంలేదు. డాన్సు ప్రోగ్రామ్సు సరేసరి, పూర్తిగా మానేసింది. ప్రదర్శనలకు రానని చెప్పేసింది. గురువుగారుకూడా ఆమె నెత్తిన నికేతనం నిర్వహణ బాధ్యత వుంచారు. ఆయన ఎంతకీ - పొరుగూర్లకి, పొరుగుదేశాలకి, తమ ట్రూప్‌ని ప్రదర్శనలకి తీసుకెళ్ళే కార్యక్రమంలో మునిగితేలుతున్నారు. నికేతనం నడపటం, పిల్లలూ, ఎడ్మిషన్సూ, జీతాలూ - డబ్బూ వగైరా యీ బాధ లన్నీ సురేఖ పడుతోంది గత అయిదేళ్ళుగా! ఇప్పు పాప వచ్చాక సురేఖకి ఆ బాధ్యతకూడా బరువుగానే వుంది. పాపకి వంట్లో బాగాలేకపోతే నికేతనానికి వెళ్ళలేకుండావుంది. క్రమంగా యీ బాధ్యతనుంచి కూడా తప్పుకోవాలని ప్రయత్నిస్తున్నది. ఆమె కేవలం యింటికీ, పాప పెంపకా నికి పరిమితమవటం రాజగోపాల్‌కి యిష్టంలేదు. అంచేత పట్టుబలవంతాన - ఆఫీసుకి వెళ్తూ - సురేఖని కార్లో ఎక్కించుకు నికేతనంలో దించి, ఆఫీసు కెళ్ళి కారు వెనక్కి పంపించేవాడు. ఒకరకంగా పాపరాకతో వారి జీవితంలో ప్రశాంతత చోటు చేసుకుంది.

పాపకి చిన్న చిన్న సుస్తీలూ - ఆ సుస్తీచేసిన రెండురోజులూ సురేఖ విపరీతంగా వుద్రేకపడి ఖంగారుపడిపోవటం యివన్నీ అలవాటు అయిపోతున్నాయి రాజగోపాల్‌కి. అన్నిటికన్నా - సురేఖ నిరుత్సాహంగా లేదు - ఆమెలోని ఆరాటం తగ్గింది. ఇది రాజగోపాల్‌కి చాలా తృప్తి నిస్తున్నది. అయితే పాపకి ఏమాత్రం నలతగావున్నా, ఆఖరికి కొస్త ఎక్కువసేపు పాప ఏడ్చినాసరే - సురేఖ ఖంగారుపడిపోతుండేది. అసలే బి.పి ఎక్కువ వున్నమనిషి - ఇటువంటి వుద్రేకాలు పనికిరావు అని డాక్టర్ పదేపదే హెచ్చరించేది. కాని, ఇవి సురేఖ చెవులకి ఎక్కేవి కావు.

ఒకసారి నర్సు రెండురోజులు శలవుపెట్టింది – తల్లిని చూడటానికి వెళ్ళింది. ఆ రెండురోజులూ పిల్లని సముదాయించలేక సురేఖ తల్లకిందు లయింది. ఈ రెండు రాత్రిళ్ళూ వుయ్యాలలో పాపని పడుకోబెట్టి వూపుతూనే వుంది. మధ్య మధ్య రాజగోపాల్‌కూడా వూపాడు. సురేఖ రెండు అరిచేతులూ కాయలుకాచి ఎర్రగా అయిపోయాయి. అలా క్షణంకూడా ఆపకండా వూపింది, ఆ రెండురాత్రిళ్ళు. ఒక్క_క్షణం వూపటం ఆపితే 'కీ' మని ఏడ్చేది పాప. ఆ రెండు రాత్రిళ్ళూ రాజగోపాల్‌కికూడా నిద్రలేదు. ఈ పసిపిల్లకి ఏం కావాలి ? ఆకలా ? కడుపునెప్పా ? ఎందుకింత గీరపెట్టి ఏడుస్తోంది? దానికి ఏం కావాలో తెలుసుకోలేని నిస్సహాయస్థితిలో ఆ వున్న కాస్త జుట్టూ పీక్కోవాలన్నంత 'ఫ్రస్ట్రేషన్' కలిగేది రాజగోపాల్‌కి.

మూడోరోజున నర్సు వచ్చాక, తమ పాట్లు చెప్పుకున్నారు భార్యాభర్తలు.

'చిన్నపిల్లలకి నెల వెళ్ళినప్పటినుంచీ తెలుస్తుంది – ఎవరిని భయ పెట్టాలో, కూడదో అన్న విషయం. వాళ్ళు మీకంటే తెలివైనవాళ్ళు' అంది నర్సు చాలాసాధారణంగా.

'అదికాదు – బేబీ దేనికో ఏడ్చింది.'

'దేనికీకాదు – ఏడుస్తే సముదాయించేవాళ్ళు వున్నారని ! వుయ్యాల రెండుఊపులు ఊపి వూరుకోవాలి. ఏడ్చి ఎవరూ రాకపోతే, నోరుమూసుకు నిద్రపోతుంది.'

'అలా వదలటానికి మనసు వొప్పదే?'

'వొప్పకపోతే తెల్లవార్లూ వుయ్యాల వూపుతూ కూచోవాలి. పసిపిల్లలకయినా కొంత భయం వుండాలి' అంది నర్సు, పిల్లల పెంపకం లోని తొలిపాఠాలు సురేఖకి బోధిస్తూ.

'ఆరునెలల దానికి భయం ఏం తెలుస్తుంది?'

'భయం అంటే – తను ఏడుస్తే వుయ్యాల వూపుతారు – అన్న విషయం తెలుసు. ఒక్కసారి వూరుకుంటే, రెండు రాగాలు తీసి నిద్రపోతుంది. అసలు రేపటినుంచి రాత్రిళ్ళు మీరు యీ గదిలో పడుకోకండి. అయ్యగారి గదిలో పడుకోండి.'

'నువ్వు వొక్కదానివీ?'

'ఇప్పటికి యిరవై మంది పిల్లల్ని పెంచాను. అది నావృత్తి' అంది నర్సు.

సురేఖ రాజగోపాల్ గదిలో పడుకున్నా – రాత్రిళ్ళు పాప 'కియ్' మంటే చాలు – పరుగెత్తుకు వెళ్తూండేది కొంపలు మునిగిపోతున్నట్టు.

'ఏయ్ – సురో నర్సు చూసుకుంటుంది, నువ్వు పడుకో. గభాలున లేస్తే బెడ్ అంతా కదిలి నాకు నిద్ర మెళకువ వచ్చేస్తుంది' అన్నాడు అప్పటికి మూడోసారి లేచిన సురేఖని అదిలిస్తూ.

'నీకు అసలు హృదయంలేదు, ఆ పసిదానిమీద ప్రేమలేదు. నువ్వు తండ్రివా అని? పసిపిల్ల ఏడుస్తుంటే యిక్కడ పడి మొద్దునిద్రపోతావా?' సాధిస్తోంది సురేఖ.

'అదికాదు సురో, నర్సు వుంది. ఆవిడ నిద్రపోగొడ్తుంది. నీకెందు క్లేశము?'

'పిల్లల్ని పెంచటం శ్రమా? అసలు నువ్వు మనిషివా? నీకు ప్రేమ లేదు. నాకోసం ఈ పిల్లని తెచ్చావు. అవునా? ఆ నోరులేని పసిది ఎలా పోయినా నీకు అక్కర్లేదు.'

'దానికి నోరులేదా? గీపెట్టి ఏడ్చి కావలసినవి సాధించుకుంటుంది. ఈ ఇంట్లో నోరులేని జీవిని నే నొక్కడినే' అని అనుకున్నాడు రాజగోపాల్. ఈమాటలు పైకి అనే ధైర్యంలేదు. అది సురేఖపట్లగల ప్రేమో, అభిమానమో, కృతజ్ఞతో అతను 'ఎనలైజ్' చేసుకోలేకుండా వున్నాడు.

చాలామంది దృష్టిలో తను సురేఖా విధేయుడు. భార్య అడుగులకి మడుగులువత్తే 'హెన్‌పెకెడ్ హస్బెండ్ ! కాని యిలా సురేఖని సంతోషంగా వుంచటంలో తనకి ఆనందం వుంది. సురేఖ ఆనందంగా వుంటేతప్ప తన జీవితానికి అర్థంలేదు. అతను నిశ్శబ్దంగా వుండిపోయాడు.

'గోపీ !'

'ఊఁ.'

'నామాటలకి కోపం వచ్చిందా?'

'లేదు.'

'నాస్వభావం నీకు తెలుసుకదా. నాకు హద్దులు గీసుకు ప్రేమించటం చేతకాదు. ఒకసారి మనసు యిస్తే, దాన్ని వెనక్కి తీసుకోలేను. నువ్వూ, పాపా ఈ యిద్దరే నాకు పరమార్థం. మీ యిద్దరినీ సగం సగం ప్రేమించ లేను. నా రక్తంలో ప్రతిచుక్కా నీకోసం, ఈ పాపకోసం ఖర్చుపెట్టా లనిపిస్తుంది. ఏంచేస్తే - మీరిద్దరూ సుఖంగా వుంటారు - ఎలా మీకు సంతోషంగా వుంటుంది - ఇవితప్ప మరో ఆలోచనలురావు. ఇలా ఆలోచించడం తప్పు అంటావా ? ఇది నాలోని లోపం అంటావా?' అడుగుతోంది సురేఖ.

అతను జవాబు చెప్పలేకపోయాడు. రెండుచేతులతో లమెని పసిపాపని హత్తుకున్నట్లు గుండెలకి హత్తుకున్నాడు. తనని తాను పరిపూర్ణంగా అర్పించుకోగల మహత్తరమైన ఈ గుణమే సురేఖలోని గొప్ప ఆకర్షణ. అది లేనపుడు సురేఖ, మామూలు అందరి స్త్రీలవంటి సగటుస్త్రీ. మామూలు స్త్రీకాదు తనకి కావలసింది ; పరిపూర్ణమైన విశ్వాసంతో తనని తాను అర్పించుకోగల మహోన్నతమైన ఈ అపూర్వ లక్షణం తనకి కావాలి. ఈ సురేఖ తనని విసిగించవచ్చు, వేధించవచ్చు, క్షణక్షణానికి వుద్రేకపడి ఖంగారు పెట్టవచ్చు, కోపంతో నోటి కొచ్చినట్లు

తిట్టవచ్చు. ని మరుక్షణంలో వెన్నవలె కరిగిపోయే ఈ అమృతహృదయుని తనకి కావాలి ఈ సురేఖ తనమనిషి. తన ప్రాణంలో ప్రాణం, వూపిరిలో వూపిరి.

'వొదులు - పాప పడుకుందో లేదో చూసివస్తాను' చేతులు వదిలించుకొని లేస్తోంది.

పాప ఏడవటంలేదు. నిద్రపోతున్నది. ఆ విషయం రాజగోపాల్‌కి తెలుసు. కాని, సురేఖ తన కళ్ళతో స్వయంగా చూస్తేగాని నమ్మదు.

పాపకి ఏం పేరు పెట్టాలి - అన్నది పెద్ద సమస్యగా తయారయింది. సురేఖ పత్రికల్లో పడే పేర్లు చూసింది. రెండు అక్షరాలూ, మూడుఅక్షరాలూ గల అందమైన పేర్లు లిస్టు తయారుచేసింది. రాజగోపాల్‌ని అడిగింది. నికేతనంలోని స్టూడెంట్సునీ, మిగతా డాన్సర్సునీ అడిగింది .... చివరికి రెండు అక్షరాలపేరు రాజగోపాల్ నిర్ణయించాడు. 'రేఖ' అని పేరు పెట్టాలన్నాడు. సురేఖలోని చివరి రెండు అక్షరాలు పాపకి పెట్టి తీరాలన్న వాదాన్ని అతను వదలలేదు. ఆఖరికి రేఖ అన్నపేరు నిర్ణయమైంది. బేబి మొదటి పుట్టినరోజుపండుగనాడు సురేఖ గురువుగార్ని పిలిపించి, ఆయనచేత బియ్యంలో ఆపేరు రాయించింది.

ఈ ఏర్పాటుని రాజగోపాల్ తమాషాగా చూస్తూ నుల్చున్నాడు. సురేఖ గురువుగారితో ఎంత దెబ్బలాడినా ఆయనపై పూజ్యభావం, గౌరవం వున్నాయి. తమ పెళ్ళి ఆయన చేతులమీదుగా జరిగింది. పాప పేరు ఆయనే పెట్టాలని పట్టుబట్టింది. మధ్యాహ్నం గురువుగారికి కొత్తబట్టలు పెట్టింది. రేఖ పేరు రాయించింది. సాయింత్రం పుట్టినరోజుపండుగ అని చాలామందిని పిలిచింది. అతని ఆఫీసువాళ్ళకి పార్టీ, నికేతనంలోవాళ్ళకి పేరంటం. ఇలా రెండు పద్ధతులలోనూ జరిపించింది. ఆరోజు సురేఖ హడావుడిగా తిరుగు తుంటే - అతిధులకి తమ పాపని 'రేఖ' అని పరిచయం చేస్తుంటే -

రాజగోపాల్‌కి కించిత్ గర్వం కలిగింది. పాప బొద్దుగా, తెల్లగా వుంది. ఈ పిల్లని పెంచుకున్నారు అని తెలియనివాళ్ళు పాప నిజంగానే సురేఖకి పుట్టిన పిల్లయేమోనని అనుకునేట్లుంది. ఆ పాప నెత్తుకుని అందంగా మాతృ గర్వంతో యిటూ అటూ తిరిగి అతిధులని ఆహ్వానిస్తున్నది సురేఖ. ఈ పాప రాకతో ఆమెలోని నైరాశ్యం, వంటరితనం మాయమయ్యాయి. ముప్పైఏడేళ్ళ సురేఖ పాతికేళ్ళ యవ్వనవతిలాగా వుంది. ఆమె కట్టుకున్న పట్టుచీరె – ముదురురంగులోవుండి ఆమె దేహలావణ్యాన్ని యినుమడింప జేస్తున్నది. చెవులకున్న రవ్వలదుద్దులు చెక్కిళ్ళలో ప్రతిఫలిస్తున్నాయి.

ఏ దేవతలు కరుణించి నాకీ లావణ్యమూర్తిని ప్రసాదించారో – అన్న ఆలోచన అతనికి ఆ సాయంత్రం చాలాసార్లు వచ్చింది. తనకి అన్నీ వున్నాయి – యింక ఏమీ అక్కరలేదు. తన జీవితం పరిపూర్ణమైన స్థితికి వచ్చింది అనుకున్నాడు రాజగోపాల్.

పాపకి మూడేళ్ళు వచ్చాయి. మమ్మీ–డాడీ అంటూ వారిద్దరిమధ్యనూ తిరుగుతూ ఆ యింటిలోనివారినంతా తన చిటికెనవేలుచుట్టూ తిప్పుకుంటూ వుంది రేఖ. రాజగోపాల్‌కి రేఖతో ఆడుకోటం – రేఖకి గుర్రంలాగా వుపయోగపడటం నిత్యకృత్యం అయిపోయింది. తండ్రీకూతుళ్ళు ఆడు కుంటుంటే సురేఖ తృప్తిగాచూస్తూ కూచునివుండేది. ఆఏడు బేబీని కె.జి క్లాసులోచేర్చింది సురేఖ. రోజూ కార్లోతీసుకెళ్ళిదించటం – మళ్ళీ మధ్యాహ్నం తీసుకురావటం – యిది సురేఖ నిత్యకృత్యం అయింది. పాప స్కూల్లో ఏం చదువుకుంటుందో – అతనికయితే తెలియదుగాని యింటి నిండా బొమ్మలపుస్తకాలు, ప్లాస్టిక్‌గ్లాసులు, ఆటసామాన్లు ఎక్కడ బడితే అక్కడ కనిపిస్తూవుండేవి. చిన్నపిల్ల యింట్లోవున్న వునికి – ఆ మూల మూలలా ప్రతిధ్వనిస్తోంది. నవ్వుల్లో, పరుగెత్తే చిన్నారిఅడుగుల్లో, నర్సరీరైమ్సుని అప్పగించే ఆ చిన్నకంఠంలో, పరసగా పేర్చబడిన 'షూజ్'

జతల్లో, అక్కడా అక్కడా వేళ్ళాడే రిబ్బన్లతో - పసిపిల్ల పెరుగుతున్న గుర్తులు కనిపిస్తున్నాయి.

ఆరోజు బుధవారం. ఉదయంనుంచీ సురేఖకి తల తిరుగుతున్నట్లుగా వుంది. అంటే బి.పి కొస్త రైజ్ అయిందని అర్థం. పాపని నాయర్ చేతికిచ్చి కాన్వెంటుకి కారులో పంపింది. సురేఖ డ్రయివర్‌ని నమ్మదు. వాడు కారు డ్రయివ్‌చేస్తూ ఫ్రెంటుసీట్లో కూచున్న రేఖని - సరిగా గమనించడని సురేఖ భయం. రేఖ ఫ్రెంట్ డోర్ గ్లాసు కిందకిలాగి - చెయ్యి బయటకి పెడ్తుందేమో, అలా పెడ్తున్నప్పుడు వెనకనించి సిటీబస్సు వచ్చి ఆ చేతిని మోదేస్తుందేమోనని భయం. అందుకని వెనకసీట్లో కూచుని పాపని మధ్యని కూచోపెట్టుకుంటుంది. ఎటు చేతులుజాపినా అవి గ్లాసుల్లోపలే వుండేట్టు జాగ్రత్తపడుతుంది. ఆరోజు సురేఖ నికేతనానికి వెళ్ళలేదు. పదిసార్లు జాగ్రత్తలు చెప్పి పాపని కాన్వెంటుకి పంపి గదిలోకివచ్చి పడుకుంది. పొద్దుటనుంచీ తల తిరుగుతున్నా ఈ విషయం రాజగోపాల్‌కి చెప్పలేదు. అతను ఫ్లయిట్‌లో బెంగుళూరు వెళ్లాడు. పైకి చెబితే ప్రయాణం ఆపుకుంటాడని చెప్పకుండా వూరుకుంది. ఆ మధ్యాహ్నం పాపని తీసుకు రావటానికికూడా నాయర్నే పంపింది కాన్వెంటుకి. నాయర్ కారు దిగి పాప క్లాసువైపు నడిచాడు. ఆ క్లాసువదలి పావుగంటకిపైగా అయిందిట. పిల్లలంతా వెళ్ళిపోయారు. నాయర్ మరోసారి వెతికాడు. టీచరు - హెడ్ మిస్ట్రెస్ - స్టాపు అంతా వెతకటం మొదలుపెట్టారు. స్కూలు ఆవరణలో ప్రతిమూలా వెతికారు. నాయర్‌కీ, డ్రయివరికీ గుండెదడ ఆరంభమయింది. వాళ్ళకి యింటికెళ్ళే ధైర్యంలేదు. గంటాగంటన్నర గడిచింది. పాప కనిపించలేదు. హెడ్‌మిస్ట్రెస్‌ని ఎక్కించుకుని యింటికొచ్చారు - నాయరూ డ్రయివరూను. అప్పటికి పాప రాలేదని సురేఖ ఆదుర్దాపడుతోంది. హెడ్‌మిస్ట్రెస్‌కి లోపల ఆశగా వుంది - పాప ఒకవేళ యింటికిగాని వెళ్ళిందా అని ! ఆపిల్ల ఇంట్లోలేదు.

హెడ్ మిస్ట్రెస్‌ని చూడగానే సురేఖ నిలువెల్లా గజగజా వణికింది. తుఫానులో అల్లల్లాడే కొబ్బరిచెట్టులాగా యిటూఅటూ వూగిపోతూ -

'ఏది - మా పాప ఏది ? ' అంటూ ప్రశ్నించింది.

హెడ్‌మిస్ట్రెస్ చెప్పింది - ఆమె విన్నదోలేదో ఎవరికీ తెలియదు. సురేఖ అక్కడే హాల్లోనే విరుచుకు పడిపోయింది.

డాక్టర్ రావటం, ఖంగారుపడి నర్సింగ్‌హోమ్‌లో జేర్పటం, నిముషాలమీద జరిగిపోయింది. ఆ సాయంత్రం ఫ్లయిట్‌లో రాజగోపాల్ బెంగుళూర్‌నుంచి యింటి కొచ్చేప్పటికి ఇల్లు చీకటిగా వుంది. నాయర్, పనిమనిషీ బిక్కుబిక్కుమంటూ కూచున్నారు. అతను సరాసరి నర్సింగ్ హోమ్‌కి వెళ్ళాడు అదేకారులో. అతను వెళ్ళేప్పటికి సురేఖని ఇంటెన్సివ్ - కేర్‌వార్డులో వుంచారు. ఎవరూ లోపలికి రాకూడదు - 'మాసివ్ హార్టు ఎటాక్' వచ్చింది అన్నారు.

రాజగోపాల్ కుప్పలా కూలిపోయాడు. అతని నెత్తిన పిడుగు పడింది. దేహంలోని శక్తిసంతా ఎవరో లాగేసుకున్నట్లుగా వుంది. నిల్చోలేక అక్కడే విజిటర్స్‌రూమ్‌లో కూలబడ్డాడు రాజగోపాల్.

ఒకరోజు, రెండురోజులు, మూడురోజులు గడిచాయి. సురేఖకి తెలివిరాలేదు. కాని మూడురోజులు అలా వుందికాబట్టి ఆమె రికవర్ అయే ఆశ వుంది. 'ఇంటికి వెళ్ళండి - ఇంటి కెళ్ళిరండి. అంటూ పట్టుబలవంతాన యింటికి పంపారు అతన్ని. గురువుగారు బలవంతాన అతన్ని రెక్కపట్టుకుని కార్లో కూచోపెట్టి యింటికి చేర్చారు. అతని కళ్ళకి ఏమీ కనిపించడంలేదు. లోకమంతా చీకటిగా వుంది. అతను నిద్రపోవటానికి ఇంజక్షను యిచ్చాడు డాక్టరు. మరునాడు రాజగోపాల్ కళ్ళు తెరిచేవేళకి చుట్టూ చిరపరిచితమైన వాతావరణం. తన మంచం .... తన గది .... పక్కనవున్న సురేఖవైపుగా అతనిచెయ్యి వెళ్ళింది, అలవాటు ప్రకారం.

అక్కడ సురేఖలేదు, ఆభాగం ఖాళీగా వుంది. తలమీద ఎవరో సుత్తితో కొట్టినట్లు లేచికూచున్నాడు.

'తన సురేఖ నర్సింగ్‌హోమ్‌లో వుంది. తన ప్రాణం అక్కడుంది' లేవబోయిన రాజగోపాల్‌కి కాళ్ళ కేదో మెత్తగా తగిలింది. కాళ్ళు పక్కకి లాక్కున్నాడు. కాళ్ళవైపు ముడుచుకుని పాప పడుకునుంది.

'ఎలా వచ్చింది? పాపని ఎవరు తీసుకొచ్చారు?'

టీ కప్పుతో నాయర్ – భయభయంగా వచ్చాడు.

'పాపమ్మగారు – బీచిలో దారితప్పిపోయి ఏడుస్తుంటే, యూనిఫారమ్ గుర్తుపట్టి ఎవరో సైకిల్‌మీద కాన్వెంటులో దించారుట.'

రాజగోపాల్ కళ్ళు ఎత్తలేదు. టీ గుటకపడటంలేదు. గొంతు, కర్రముక్కలా, బిగదీసుకుపోతున్నది. 'ఆ రాత్రే పాపమ్మగార్ని స్కూలు వాళ్ళు దించి వెళ్ళారండి.'

టీ మింగలేకుండా వున్నాడు – గొంతులో దూది కుక్కినట్లుగా వుంది. ఒక్కచుక్క 'టీ' వెళ్ళటంలేదు, మింగుడుపడటంలేదు.

'ఇక్కడినించి తీసుకెళ్ళిపొండి' అన్నాడు గొంతు పెగుల్చుకుని. అతని కంఠం అతనికే కొత్తగా వుంది. తన కంఠం యింత కీచుగా వుంటుందా? తానింకా బతికే వున్నాడా – రాజగోపాల్ మణికట్టుమీద గిచ్చుకు చూసుకున్నాడు. నెప్పిపుట్టింది. తనకి స్పర్శజ్ఞానం చావలేదు. తానింకా బతికేవున్నాడు.

అతను ముఖం కేడుక్కోలేదు – బట్టలు మార్చుకోలేదు – వెంటనే లేచినవాడు లేచినట్లు నర్సింగ్‌హోమ్‌కి పరుగెత్తాడు. అతను వెళ్ళేప్పటికి డాక్టర్లు ఆదుర్దాగా యిటూ అటూ పరుగెడుతున్నారు. రాత్రి మళ్ళీ ఎటాక్ వచ్చిందట. వాళ్ళకీ ఆశల్లేవు. మానవ ప్రయత్న లోపం లేకుండా – అన్ని

విధాల ప్రయత్నిస్తున్నారు. సురేఖకి తెలివిరాలేదు. ఆ సాయంత్రం నాలుగు న్నరకి రెస్పిరేషన్ పూర్తిగా ఆగిపోయింది. 'గాస్‌మాస్క్' అవసరంకూడా లేకపోయింది.

ఆ తరువాత కార్యక్రమం ఎలా జరిగింది? ఏర్పాట్లు ఎవరు చేశారు అన్నది అతనికి ఏమీ జ్ఞాపకంలేదు. ఒకరకమైన 'కోమా'లో అతనూ వుండిపోయాడు. అలా అచేతనంగా, మరబొమ్మలాగా ఎవరు ఏం చెపితే అది చేశారు. ఇంటినిండా జనం. నికేతనంలోని ఆడవాళ్ళు, సురేఖతో కలిసి డాన్సు చేసిన అనేకమైన చిరపరిచిత ముఖాలు. వీటన్నిటిమధ్యలో గురువుగారి కరకరకంఠం, దండలు, వూరేగింపులు, పెళ్ళివారి గుంపులా తమ యింటి అవరణలోంచి, పూలహారాలతో సురేఖ దేహం పెళ్ళిపోయింది. అతనికి దుఃఖించే శక్తికూడాలేదు. మొద్దుబారిపోయి కూచున్నాడు. మొద్దుబారిన ఆ దేహంలోకి డాక్టరు సూదిగుచ్చాడు. రాజగోపాల్ అలా పరిగిపోయాడు.

# 12

'నాన్నా – నేను ఈ రైలుకే బయలుదేరుతున్నాను. ఏ రైలున్నా సరే ఎక్కించండి' చేతిలో వైర్‌పుచ్చుకుని ఖంగారుగా తండ్రి దగ్గర కొచ్చింది కృష్ణవేణి.

'ఏం జరిగిందమ్మా ఎక్కడికి ?' అడిగాడు రాజారావుగారు. ఆయన యీ మధ్యన తిరుగుళ్లు పూర్తిగా తగ్గించేశారు. ఇంచుమించు వృద్ధాప్యం వచ్చినట్లుగా యిల్లుకదలటం లేదు.

'మద్రాసు వెళ్లాలి – ఆయనకి వంట్లో బాగాలేదు' తండ్రి చేతికి వైర్ అందిస్తూ అంది.

'రాజగోపాల్ – డేంజరస్‌లీ ఇల్ – రావు.'

అని వుంది ఆ వైర్‌లో.

'ఎవరీ రావు – ఎందుకిచ్చాడు ? నీకెలా తెలుసు ? '

'ఆయన పి.ఎ – నెలనెలా ఇతనే యమ్. ఓ చేస్తూంటాడు'

'నీ కెందుకిచ్చాడు ? ఇంట్లో ఎవరూ లేరా ? '

'అదే _ నేను అనుకున్నాను – కాని ఈరోజు పేపర్లో చూశాను ....'

'ఏం చూశావ్ ? '

'ఆ సురేఖ పోయిందిట. గుండె ఆగి మొన్న మధ్యాహ్నం పోయిందట _ నేను వెళ్ళాలి. మీరొచ్చి రైలిక్కించండి. మీకు పనుంటే నేను ఒక్కర్తెదాన్ని వెళతాను.'

'అతను – నిన్ను రానిస్తాడా ? '

'నీకు తెలియదు నాన్నా – నా అవసరం చాలావుంది. ఆయన ఒక్కరే వున్నాడు. కృష్ణవేణి కంఠం తీవ్రంగావుంది. కూతురు ఇంత వుద్రేకపడటం ఆయన ఎన్నడూ చూడలేదు.

'మీ అమ్మ – ఒక్కర్తే .... '

'అందుకే నేను, వెళ్తాసంటున్నది. నేను యిల్లు వెతుక్కొని వెళ్ళగలను – '

'పోనీ _ మీ మామగారు'

'వాళ్ళెవరికోసం నేను ఆగను. నువ్వు రానక్కర్లేదు. నేను వెళ్ళ గలను' కృష్ణవేణి గబగబా లోపలికి వెళ్ళింది. అయిదు నిముషాల్లో చిన్న సూట్‌కేసుతో బయటకొచ్చి, చెప్పులువేసుకుని వీధిగడపదగ్గర నుల్చుంది. రాజారావుగార్కి కాళ్ళూ చేతులూ ఆడలేదు. తను రాకపోతే బస్ తీసుకుని బెజవాడ వెళ్ళిపోతుంది. మద్రాసులో ఒక్కర్తే ఏం తిప్పలు పడుతుందోనని భయంగా వుంది.

ఆయన ఆదరాబాదరా బయలుదేరారు. బెజవాడబస్ రెడీగా వుంది. కృష్ణవేణికి కూచునేందుకు సీటుదొరకలేదు. నిల్చునేవుంది. ఆయనకిమటుకు తెలిసినఅతను లేచి సీటు యిచ్చాడు. బెజవాడస్టేషనుకి వచ్చేటప్పటికి మద్రాసు వెళ్ళేరైలుకి అరగంట టైముంది. రిజర్వేషను దొరకలేదు. స్లీపర్ టికట్లు లేవన్నారు. జనరల్‌కంపార్టుమెంటులో – తోసుకుని ఎక్కారు. బాపట్లదాకా నిల్చునేవున్నారు. బాపట్లలో రాజారావుగార్కి కూచునే స్థలం దొరికింది. కృష్ణవేణి ఇంచుమించు చిట్రగుంటదాకా నుల్చుని, ఆ తరువాత ఎవరిపెట్టెమీదవో స్థలం దొరికితే తండ్రి కాళ్ళదగ్గర కూచుంది.

ఆమె మనసు శూన్యంగావుంది. అందులో కోపంలేదు. అవమానం లేదు. చాలా నిర్వికారంగా వుంది. అతనికి సీరియస్‌గావుంది. అతనికి ప్రాణసమానమనుకున్న వ్యక్తి మరణించింది. ఆ మరణం అతనిని ఎంత కృంగదీస్తుందో – అతను ఏమైపోతాడు ? ఏమైపోతే తనకేం ? కాని, అలా వూరుకోలేకుండా వుంది. భర్తగా తనకి సుఖాన్నివ్వలేదు; సంతోషాన్ని యివ్వలేదు. కాని, ఏనాడూ తనని అవమానించలేదు. గౌరవంగా చూశాడు. తాను 'అవసరంవుంది – రండి' అని పిలిచినపుడు వచ్చాడు. ఈనాడు అతను అపాయకరమైన పరిస్థితిలో పడివున్నప్పుడు వెళ్ళడం తన ధర్మం కాదా ? వెళ్తోంది. తండ్రికి వచ్చిన సందేహం కృష్ణవేణికి రాలేదు తనను రావద్దు అనే ధైర్యం అతనికిలేదు. వెళ్తుంది – సేవ చేస్తుంది. తిరిగి మనిషిని చేస్తుంది; ఆ తరువాత, వెనక్కి వచ్చేస్తుందా ? రాగలదా ? కృష్ణవేణి తన మనసు లోతుల్లోకి తరచి తరచి చూస్తున్నది —— గుప్తంగా దాచుకున్న – తనమనసుకికూడా దొరకకుండా దాచుకున్న – రహస్యాన్ని బయటకిలాగి చూస్తున్నది—— తను వెనక్కి రాలేదు. అతనంటే అంత రాంతరాల్లో ప్రేమవుంది. ఎందుకు కలిగింది? తనని కాదు అని తిరస్కరించి వెళ్ళిపోయిన యీ వ్యక్తిమీద మమకారమా ? అది మమకారమే. కాదని తనను తాను మభ్యపెట్టుకోలేదు. తనని ఒక మనిషిగా చూసిన అతనిపై

తనకి అంతరాంతరాల్లో ప్రేమవుంది. అతను పరిస్థితులను ద్వేషించాడుగాని తనని ద్వేషించలేదు. తనపట్ల సానుభూతి కనబరచాడు. ఈ పరిస్థితుల్లో 'పావు' అయిన తనపై సానుభూతి చూపించాడు – మనసు చంపుకుని భర్తగా తన కర్తవ్యం నెరవేర్చాడు.

ఆనాడే, ఇరవై ఏళ్ళక్రితమే – తను అతనిని ఎందుకు విసిరికొట్టలేదు ? తనదేహంమీద పడిన ఆ చేతిని తోసిపారేసే శక్తి తనకెందుకు రాలేదు ? భర్త అన్న భయంచేతనా ? దేనివల్ల ? భయంకాదు. అతనిమీద మక్కువ – ఆనాడు అది మక్కువని తెలుసుకోలేకపోయింది. కాని, ఈరోజు అర్థం అవుతున్నది. ఇరవై ఏళ్ళనుంచీ దూరంగా వుండే అతన్ని ప్రేమిస్తున్నది. తనకి హక్కు వుండికూడా దూరంగా వుంటున్నది. ఎందువల్ల – అతనికి బాధకలిగితే తనకీ బాధకలుగుతుంది. అతను సంతోషంగా వుంటంలో, తనకి మానసిక శక్తి – నైతిక విజయం : అందుచేతనే తను కోర్టుకి వెళ్ళనన్నది ; వివాదాలు పడనన్నది. దూరంగా వుండే అతనిపై హక్కుని సంపాయించింది.

రాజారావుగారికి కూతురు మనస్తత్వం విచిత్రంగా వుంది. ఇరవై యేళ్ళుగా తన ముఖం చూడని భర్తకి వంట్లో బాగుండలేదంటే – గుడ్డి దానిలా పరుగెడుతోంది. నలభై యేళ్ళుగా తనయింట పెరిగింది. ఏరెండు మూడేళ్ళుతప్ప – భర్తృగృహం ఎరగదు. ఈ నలభై ఏళ్ళూ – తమయింట్లో వుంది. పెళ్ళి అయికూడా భర్తచే పరిత్యక్తఅయి, తమ యింటో వుంది. తను తండ్రి. తమకి యింకెవ్వరూ లేరు – నిజమే ! అయినా ఈ నలభై ఏళ్ళూ గడిపిన తమ యిల్లు, తమ ప్రేమ, వీటికి విలువలేదా ? అతను పిలవనంపకుండానే – కనీసం 'నువ్వు రా' అని పిలవకుండానే ఎవరో పి.ఎ వైరిచ్చాడని పరుగుపెడుతోంది. తన కూతురుకి ఆత్మాభిమానం లేదా ? ఆ పిల్ల ఎవరో చచ్చిపోయింది – ఆ స్థానంలో తను స్థిరపడిపోదామన్న ఆతృతతో పరుగెడుతోందా ? లేక, అతను పెద్ద వుద్యోగస్తుడు .... ....

రాజారావుగారు తనని తాను నిందించుకుంటున్నాడు - కన్నకూతురు గురించి ఇల్లా చులకనగా ఆలోచించడమా ? ఆయనకి వొళ్ళంతా పట్టుకున్నట్లు వుంది. కాళ్ళు తిమ్మిర్లెక్కుతున్నాయి. కనీసం కాళ్ళు జాపుకునేందుకు కూడా స్థలంలేదు. ఇటువంటి రద్దీలో యీ వయసులో ప్రయాణం చెయ్యటం కష్టంగానే వుంది.

ఇంకా చీకటి చీకటిగా వుంది. పూర్తిగా తెల్లవారలేదు. ఇద్దరూ సెంట్రల్‌లో దిగారు. రాజారావుగారికి మద్రాసు సిటీ కొత్తకాదు. కాని, అడయార్‌లో అల్లుడియిల్లు ఏమూలవుందో. ఆటో రిక్షా ఎక్కి ఎడ్రసు చెప్పారు. వాడు అడయారుచుట్టూ మూడు ప్రదక్షిణలుచేసి గంట తరువాత రాజగోపాల్ యింటిముందు ఆపాడు. కృష్ణవేణి వెనక్కి తిరిగికూడా చూడకుండా గబగబ గేటుతీసుకు లోపలికి నడిచింది. ఇంటిముందు రెండు కార్లు. ముందుతలుపు తెరిచే వుంది. లోపల ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు మొగవాళ్ళు సోఫాలోకూచుని వున్నారు. వీరంతా ఎవరు ? ఆమె బంధువులా.

'నేను బందరునుంచి వచ్చాను. రాజగోపాల్‌గారి .... ' ఆగిపోయింది.

సోఫాలోంచి ఒకయువకుడు లేచాడు. 'అయామ్ గ్లాడ్ - వస్తారో, రారో అనుకుంటున్నాను. రండి - ఆగదిలో ఉన్నారు. మూడురోజులుగా కన్ను మూయలేదు. మందులు పనిచేయటంలేదు.'

పక్కనవున్న ఆజానుబాహువులాంటి యువకుడు - ఆయన గొంతు బొంగురుగాఉంది - 'ఆదుర్దా ఏమీలేదు. షాక్‌వల్ల అలావున్నారు. మీరు దగ్గరవుండి శ్రద్ధగా చూసుకుంటే .... ఇంట్లో స్వంతవాళ్ళు ఎవరూలేరు.... మేమంతా పైవాళ్ళం....' అంటున్నాడు.

కృష్ణవేణికి ఒక్కమాటా చెవిలోకి వెళ్ళటంలేదు. ఆ యువకునివెంట గబగబ అడుగులు వేసుకుంటూ బెడ్‌రూమ్‌వైపు వెళ్ళింది. విశాలంగావున్న

డబుల్‌కాట్‌మీద - రాజగోపాల్ పడుకునివున్నాడు. వెల్లకితలా పడుకుని పైకప్పువంక చూస్తున్నాడు. - కనురెప్పలు తెరుచుకునువున్నాయి - తలుపు తీసిన అలికిడికి అతను తల తిప్పలేదు. మంచంమీద కాళ్ళవైపు కృష్ణవేణి చతికిలబడింది. అయినా అతను కదలలేదు. దృష్టి ఆమెవైపుకి మరల్చలేదు. అతనిలో స్పర్శజ్ఞానంకూడా నశించిందా? అయిదు నిముషాలు అలా నిశ్శబ్దంగా కూచుని, పాదంమీద చెయ్యివేసింది కృష్ణవేణి. కొద్దిగా కదలిక! ఆ పాదం కంపించిందా? లేక, ఆ కంపన తన చేతిలోఉందా? ఆమె తెలుసుకోలేకుండా ఉంది.

పది నిముషాల్లో ఆ యువకుడు, డాక్టరుతోపాటు లోపలికి వచ్చాడు. డాక్టరుగారు పరీక్షచేసి గ్లూకోజ్ ఇంజక్షను యిచ్చారు.

ఫిజికల్‌గా ఏమీ జబ్బులేదు. ఈ దెబ్బకు మెదడు మొద్దుబారినట్లయింది. మెంటల్ షాక్. మీరు ఓపిగ్గా పక్కనకూచుని ఏవో ఒక విషయం మాట్లాడుతూ ఉండండి. వారి కళ్ళలో మీమాటలకి 'రియాక్షను' వస్తే - నాకు ఫోన్‌చేయండి. వినుక్కున్నా మంచిదే! ఏవోవిధంగా ఆ కళ్ళలో కదలిక రావాలి. ఇటువంటి కేసులకి - నర్సులు లాభంలేదు - దగ్గరవారు....'

కృష్ణవేణి తల ఊపింది. ఎవరో లోపలనుంచి కాఫీ ట్రే పట్టుకొచ్చారు.

'ఒద్దు' అంది కృష్ణవేణి.

'అలా కాదు - మేము మూడ్రోజులనుంచీ చూస్తున్నాము. ఆయన వెంటనే మాట్లాడరు - ఏప్రమాదమూ లేదు. మీరు ముందు కాఫీ తాగండి. మీకూ ఓపిక కావాలి.' అన్నాడాయువకుడు.

'మొహం కడుక్కోలేదు - '

'బాత్‌రూమ్ ఈపక్క నుంది. ఆ తలుపు తీసుకు వెళ్ళండి.'

కృష్ణవేణి అక్కడవున్న పేస్టుతో పళ్ళుతోముకువచ్చి కాఫీతాగింది. మళ్ళీ మంచంమీద కూలబడి అతని కాళ్ళు రెండూ రాస్తున్నది. తనచేతుల స్పర్శ అతనికి తెలుస్తోందో లేదోగాని – తనలోని జీవశక్తినంతా ఆచేతుల్లో యిమిడ్చి రాస్తున్నది.

ముందుగదిలో రాజారావుగారు కూచునివున్నారు. ఈ యిల్లు, యీ పరిసరాలు చూస్తుంటే, అల్లుడు ఎంత ప్రయోజకుడయ్యాడో మరోసారి బోధపడుతోంది. డ్రాయింగ్‌రూమ్‌లోని అలంకరణ – ఆధునికంగావున్న సామాను, ఒక్కసారి వెళ్ళిపోయిన ఆ స్త్రీమీద జాలివేసింది అయనకు. పాపం వీటన్నిటినీ యింత పొందికగా అమర్చుకుని – వీటిమధ్యనుంచి ఎలా వెళ్ళిపోయింది – జీవితం బుద్బుదప్రాయం. కాని, వున్నన్నాళ్ళూ 'నావి – నావి' పట్టుకు దేవుళ్ళాడుతారు.

'నేను సురేఖ గురువుగారిని. సురేఖకి ఎనిమిదేళ్ళప్పటినుంచి డాన్సు నేర్పాను. నాపిల్లలమీదకంటే 'ఆ అమ్మాయిమీద ఎక్కువ అభిమానం.' కళ్ళు తుడుచుకుంటున్నాడు.

ఆయన్ని ఎలా వోదార్చాలి? పాపం సురేఖని నిజంగానే ప్రేమించి వుంటాడు.

'నా కూతురులా చూసుకున్నాను. ఈ చేతుల్తో వీళ్ళిద్దరికీ పెళ్ళి చేశాను. యీ చేతుల్తోనే ప్రాణంలేని ఆ కట్టెకి పూలహారం వేశాను' ఆయన కళ్ళనుంచి ధారగా నీళ్ళు కారుతున్నాయి.

ఊరుకోండి – మనచేతుల్లో ఏమీలేదు.'

'మీకు ఆ అమ్మాయిమీద కోపం వుండి వుండవచ్చు. బ్రతికుండగా చూసివుంటే, మీకు కోపం కలిగి వుండేది. అటువంటి కళాకారిణిమీద ఎవరికీ కోపంరాదు. ఆరాధనా భావం కలుగుతుంది.'

'లేదు, మాకెవ్వరికీ కోపంలేదు. ఆఖరికి మా అమ్మాయికికూడా; మాకు యింతే ప్రాప్తమనుకున్నాము. ఏంజబ్బు చేసింది?'

'మీరు పేపర్లో చదవలేదా?'

'లేదు. వైరు అందీ అందగానే ఖంగారుగా బయలుదేరాం.'

'మాకు ఏం చెయ్యాలో తోచలేదు. ఇంట్లో స్వంతవాళ్ళు ఎవరూ లేరు. రాజగోపాల్ మన లోకంలో లేడు. ఇంట్లో పనివాళ్ళు, చేతికి అందింది పట్టుకుపోయినా ఎవరం కనుక్కోలేము. మూడురోజులుగా, ఆ పి.ఎ. నేనూ యిట్లా ఇల్లుకనిపెట్టుకునున్నాము.'

'అతని తండ్రి ? '

'వాళ్ళ ఎడ్రసు మాకు తెలియదు. వీళ్ళిద్దరూ పాలూ నీళ్ళలాగా కలిసిపోయారు. ఇటువైపూ, అటువైపూ బంధువులెవరూ వచ్చేవారుకాదు.'

'ఆ అమ్మాయివైపు ? '

'ఎవరూలేరు – తల్లికూడా ఇల్లాగే గుండెఆగిపోయింది. ఆరోజు – సురేఖని వోదార్చి, కాపాడటానికి రాజగోపాల్ వచ్చారు. జీవితం విచిత్ర మయింది. ఇరవై ఏళ్ళక్రితం సురేఖ తల్లి చచ్చిపోయి, పిచ్చిదానిలాగా పడివుంటే, నేను వోదారుస్తూ కూచున్నాను. ఏం చెయ్యాలి, ఏం చెయ్యాలి అని మథనపడుతుంటే మీ అల్లుడు పరుగెత్తు కొచ్చాడు. ఈనాడు మళ్ళీ అదే స్థితి. వీళ్ళిద్దరూ నాకు బంధువులుకారు. కులస్థులు కారు. కానీ, ఏనాటి బాంధవ్యమో ఇలా ఈ యింటికి మృత్యుదేవత వచ్చినపుడల్లా నేను బ్రతికున్నవాళ్ళని సముదాయించాల్సి వస్తోంది' అన్నారాయన. ఈ విషయం రాజారావుగారికి చెపుతున్నట్లులేదు. తనలో తాను అనుకుంటున్నట్లుగావుంది.

'అమ్మాయికి ఏంజబ్బు చేసింది?'

'జబ్బేంలేదు – సురేఖ చాలా 'ఎమోషనల్'గా వుంటుంది. బి. పి. కూడా ఎక్కువే. డాక్టరు చాలాసార్లు వార్నింగ్ యిచ్చారు – వుద్రేక పడకూడదు, ఎక్సయిట్ అవకూడదు – అని.'

'ఏం జరిగింది?'

'వీళ్ళకి పిల్లలు కలుగలేదు' ఆగారు ఆయన.

'ఫరవాలేదు చెప్పండి'

'సురేఖకి పిల్లలంటే వ్యామోహం. ఆఖరికి ఒక ఆడపిల్లని పెంచుకున్నారు. ఆరోజు ఆ చిన్నపిల్ల మూడున్నరేళ్ళ పాప తప్పిపోయింది. స్కూల్లో లేదు. స్కూలు కెళ్ళిన డ్రయివర్ పాప కనిపించటంలేదని వెనక్కొచ్చాడు. ఆ వార్త విని సురేఖ విరుచుకుపడిపోయింది. ఆ పిల్లమీద పంచప్రాణాలు పెట్టుకుంది.'

'మాఅల్లుడు ఇంట్లోలేరా?'

'ఆ వుదయం బెంగుళూర్ వెళ్ళారు. సురేఖని మేమంతా నర్సింగ్ హోమ్ చేర్పించాము. ఆయన సాయింత్రం వచ్చారు.'

'గుర్తుపట్టిందా?'

'ఉహూఁ. మూడురోజులు వంటిమీద స్పృహలేదు. అందులోనే మళ్ళీ 'ఎటాక్' వచ్చి కన్నుమూసింది.'

రాజారావుగారికి కళ్ళు చమర్చాయి. తనకి తెలియని ఆ సురేఖ మాతృహృదయం తలుచుకుంటే - ఆయనకి బాధగా వుంది. ఎక్కడినించో ఒక పాపని తెచ్చుకు, దానిమీద పంచప్రాణాలూ పెట్టుకుంటున్నపుడు ఆ పాప కనిపించకపోతే, ఆ తల్లి ప్రాణం ఎంత గిలగిల్లాడిపోయిందో ? ఇన్నాళ్ళ నుంచీ తను దురదృష్టవంతుడు అనుకునేవాడు. కన్నకూతురు, భర్తచేత తిరస్కరింపబడి, తన కళ్ళెదుట మోడులా జీవిస్తోందని బాధపడేవాడు. కాని, ఈ సురేఖ బాధముందు తన కష్టం ఏపాటి? భర్త వదిలేశాడన్న కష్టంతప్ప, కన్నకూతురు కళ్ళఎదుట వుంది, ముద్దుల మనుమరాళ్ళు తమ గృహాన్ని నవ్వుల్తో ముంచెత్తింది. పాపం ! సురేఖ దురదృష్టవంతురాలు. మాతృత్వం కోసం అలమటించిపోయింది. ఆ మాతృత్వపు తీపిని పూర్తిగా అనుభవించకుండానే వెళ్ళిపోయింది.

ఒక పసిపిల్ల, ఒక అనాథశిశువు కోసం తన ప్రాణాలు యిచ్చిందా? సురేఖని బ్రతికి వుండగా ఒక్కసారికూడా చూడలేదు. అనేక సభల్లో ఆమె నాట్యం చేస్తున్నది, అని తెలిసికూడా, కావాలనే చూడకుండా వూరుకున్నాడు. ఇప్పు డనిపిస్తోంది – ఒక్కసారయినా ఆమె నృత్యాన్ని చూసి వుండాల్సిందని. పాపం, ఒక్కసారికూడా ఆ అమ్మాయిని చూడలేక పోయాను – ఆయన పై వుత్తరీయంతో కళ్ళు తుడుచుకుంటున్నారు.

'ఆ పాప ఏమయింది? పోలీసు కంప్లయింట్ యిచ్చారా?'

'దారి తప్పిపోయి బీచివద్గిర ఏడుస్తూ వుంటే, స్కూల్ యూనిఫారమ్ చూసి – ఎవరో తీసుకొచ్చి స్కూల్లో వదిలిపెట్టారు.'

'పిల్లని చూపించకపోయారా?'

'డాక్టర్లు వద్దన్నారు. గుండె చాలా బలహీనంగా వుంది _ ఒకవేళ తెలివివచ్చినా, ఆ సంతోషానికికూడా తట్టుకోలేదన్నారు.'

'ఆపిల్ల ఏది-'

'లోపల పనివాళ్ళు చూస్తున్నారనుకుంటా' అన్నారు గురువుగారు.

'లోపలికెళ్ళి చూడనా?' అడిగారు రాజారావుగారు.

'వెళ్ళండి. నేను ఇంటి కెళ్ళి మూడురోజులయింది. మీరొచ్చారు – నేను కాస్త విశ్రాంతి తీసుకుంటాను' లేస్తున్నాడు గురువుగారు.

'ఇక్కడ అంతా _ కొత్త' ఆగిపోయారు రాజారావుగారు.

'ఫరవాలేదు. మీకంటే ముఖ్యులు ఎవరున్నారు? పనివాళ్ళని కాస్త జాగ్రత్తగా కనిపెట్టండి. ఇంట్లో నగలూ, డబ్బూ చాలా వున్నాయి.'

రాజారావుగార్కి ఏం చెప్పాలో తట్టటంలేదు.

'అతని తండ్రికీ, మా వియ్యంకుడికి టెలిగ్రామ్ యిప్పించండి.'

'అలాగే యిద్దాం. ఎడ్రసు మాకు తెలియదు. మీరు వచ్చారుగదా అన్నీ చూసుకోండి. నిజానికి ఈ మూడురోజులూ యీ యింట్లో ఎలా

గడపగలిగానో నాకే బోధపడకుండా వుంది. ఇక్కడ నాకెవరున్నారు? మా సురేఖలేదు. దేవీ విగ్రహంలేని ఈ దేవాలయంతో నాకేం పనివుంది? ఈ దెబ్బ మీ అల్లుడికికాదు. నాకు తగిలింది. నా నికేతనం వ్యవహారాలన్నీ మా సురేఖకి వొప్పచెప్పేసి – నిశ్చింతగా ప్రోగ్రామ్స్‌కి తిరుగుతూండేవాడిని. నా రెండుకాళ్ళూ 'విరిగిపోయాయి' రాజారావుగారిని కావిలించుకుని గట్టిగా – ఆడదానిలా వెక్కి వెక్కి ఏడుస్తున్నారు గురువుగారు.

ఆయన్ని వోదార్చటం ఎలాగో తెలియక పసివాడి వీపు రాసినట్లు, అంత పెద్దమనిషి వీపు తన చేతుల్తో రాసి – సముదాయిస్తున్నారు రాజారావుగారు.

'ఆపిల్ల ఎక్కడ?' అడిగారు రాజారావుగారు.

'లోపల వుండి వుంటుంది. ఈ నాలుగురోజులనుంచీ – దాని మొహం చూసిన నాథుడులేడు.'

'పిలవనంపండి'

'తెల్లగా, బొద్దుగా వున్న మూడేళ్ళపిల్ల – లోపలినుంచి వచ్చింది. జుట్టు ఎవరూ దువ్వినట్లు లేదు, ముఖం వుబ్బివుంది. స్కూలు యూనిఫారమ్ మాసివుంది. దూరంగా భయంగా నుల్చుంది.

'పాపా, నీపేరు' రెండుచేతులూ చాచి అడిగారు రాజారావుగారు.

'రేఖ' భయంగా జవాబు చెపుతోంది.

'నేను తాతయ్యనమ్మా – రా – యిలారా' రేఖ భయంగా అడుగు ముందుకు వేసింది. ఆ చేతులు రెండూ తనని ఆహ్వానిస్తున్నట్లు జాచి వున్నాయి. క్షణంపాటు అవి అమ్మ చేతుల్లా అనిపించాయి.'

'మమ్మీ' అంటూ పెద్దపెట్టున ఏడుస్తూ, ఆ రెండు చేతులమధ్యకీ వచ్చింది. ఈ ప్రపంచమే శిథిలమైపోయినట్లు – గుండెలు అవిసేటట్లు ఏడ్చింది – ఈ కొత్త తాత గుండెల్లో మొహందాచుకుని. ఆ వుదయం మళ్ళీ యింకో ప్రాణిని వోదార్చారు రాజరావుగారు.

రాత్రి నిద్రలేదు. డెబ్భైపైబడుతున్న తనకి దేహదారుఢ్యం లేదు. వొళ్ళంతా తేలిపోతున్నది. పాపని వొళ్ళో కూచోపెట్టుకుని – అలా సోఫాలో వాలి కూర్చున్నారు రాజారావుగారు. ఈలోగా కాఫీ తెచ్చిచ్చారు ఎవరో. ఆయన మొహంకూడా కడుక్కోకుండా కాఫీ తాగారు. అప్పటికి గాని ప్రాణం కుదుటపడలేదు.

కృష్ణవేణి భర్త పక్కనుంచి కదలటంలేదు. డాక్టరుగారు చెప్పినట్లు ఏవో వొక విషయాలు మాట్లాడుతోంది. తమ పెళ్ళి, సీతబాల్యం, సీతపెళ్ళి ఇలా అన్నిటిగురించీ మాట్లాడుతోంది. సురేఖని ఎప్పుడూ చూడలేదు; డాన్సూ చూడలేదు. కాని స్త్రీ సహజమైన కుతూహలంతో సురేఖ నృత్యం గురించి ఎవరేనా విమర్శరాస్తే – అవి పొగడ్తలయినా – తిట్లయినా శ్రద్ధగా చదివేది. అవన్నీ మిళితంచేసి మాట్లాడుతోంది. అతను వింటున్నాడా – ఆ కళ్ళలో ఏదైనా కదలికవుందా అని మధ్యమధ్య ఆపిచూసేది. ఒక్కొక్కసారి ఆ కళ్ళలో కదలిక వున్నట్లు – మరోసారి అవి శూన్యంగా వున్నట్లూ అనిపించేది. ఇల్లా మూడురోజులు, పగలూ రాత్రీ మాటాడింది. ఆ మూడోరోజు రాత్రి – రాజగోపాల్ కనురెప్పలు మూతబడినాయి. కృష్ణవేణి వొళ్ళు తేలిపోతున్నది. అలా తూలుతూనే నాయర్‌ని పిలిచి డాక్టర్‌కి ఫోన్ చేయమంది. డాక్టరు వచ్చి చూసి యింక ఫరవాలేదన్నాడు. కృష్ణవేణి అల్లానే – ఆ గదిలో నేలమీద పడుకుని వొళ్ళెరక్కుండా నిద్రపోయింది.

మనుషుల మాటలు కొత్తకంఠాలు కళ్ళునులుపుకుని పరిసరాలు పరికించింది. తను కొత్తప్రదేశంలో వుంది – జరిగిన సంఘటనలు ఒక్కసారి జ్ఞాపకంవచ్చాయి. ఖంగారుగా లేచి మంచందగ్గరకెళ్ళింది. రాజగోపాల్ నిద్రపోతున్నాడు – గుండెలు కదులుతున్నాయి.

నెమ్మదిగా గదిబయటకొచ్చింది. హాల్లో మామగారు, ఇద్దరు ఆడబడుచులు, కూతురు, అల్లుడు అంతా బిలబిల్లాడుతూ వున్నారు. అప్పుడే వచ్చినట్లున్నారు. సామాన్లు యింకా హాల్లోనే వున్నాయి.

'ఎలా వున్నాడు ? ' మామగారు, ఆడబడుచులు ఏకకంఠంతో అడిగారు.

'ఆరురోజులకి రాత్రి కళ్ళుమూశారు. నిద్రపోతున్నారు. డాక్టరు ఎంత నిద్రపోతే అంతమంచిది అన్నారు'

'మేము వెళ్ళి చూడమా ? '

'చూడండి – మాట్లాడించకండి. 'డిస్టర్బ్' చెయ్యకండి' అంది కృష్ణవేణి.

మూడురోజులయి యీ యింటికి వచ్చినా – కృష్ణవేణి ఆ పడకగది దాటి బయటకి రాలేదు. 'ఎటాచ్‌డ్ బాత్‌రూమ్‌లో మొహం కడుక్కునేది. వేళకి కాఫీయో – భోజనమో ఎవరు తెచ్చేవారోకూడా గమనించకుండా తిని అలా పక్కన కూచున్నది. ఈ వుదయం హాలుని ఇంటిని చూస్తున్నది.

ఇల్లంతా ఆధునికంగా, దర్జాగావుంది. కళాత్మకంగా యింటిని అలంకరించిన – ఆ సురేఖ ఎలా వుంటుంది ? ఆ అమ్మాయిని ఒక్కసారన్నా చూడగలిగితే – రెండో బెడ్‌రూమ్‌లో నిలువెత్తుఫోటో – ఆ ఫోటోలో నృత్యంచేసే భంగిమలోవుంది. ఆ ఫోటో ముందుకెళ్ళి నుల్చుంది కృష్ణవేణి. ఆ ఫోటోలోని వ్యక్తిని చూస్తుంటే ఆమెకి అసూయ కలగ లేదు, కోపమూ రాలేదు, జాలి కలిగింది. ఆ పక్కన టేబుల్‌మీద ఎటువంటి అలంకారమూ లేని మామూలు గృహిణిలా సురేఖ. రాజగోపాల్ సురేఖా యిద్దరూ పక్కపక్కన వున్న కలర్‌ఫోటో. ఆ స్టాండుని చేతిలోకి తీసుకుని పరీక్షగా చూస్తూ నుల్చుంది. ఫోటోలోని ఆ స్త్రీ కళ్ళు నవ్వుతున్నాయి. ఆ కళ్ళలో అహంకారంలేదు. మామూలుగా నిర్మలంగావున్నాయి. ఈ స్త్రీ

తనకంటే అందమైనది _ కళాకారిణి. ఆ కళ్ళలో చైతన్యం వుంది. ఇన్ని వున్న స్త్రీని తన భర్త ప్రేమించాడు. ఇరవై ఏళ్ళు కలిసి జీవించారు. ఈ భావం కృష్ణవేణిలో ఎటువంటి అసూయా రేకెత్తించలేదు. ఈ ఫోటో చూడటంవల్ల సురేఖలోని ఆకర్షణ ఆమెకి అవగతమవజొచ్చింది. తన భర్త పెళ్ళయిన కొత్తలో ఎందుకంత బాధపడ్డాడోకూడా అర్థం అవజొచ్చింది.

ఇల్లంతా తిరిగింది కృష్ణవేణి. ఎవరూ అడ్డుపెట్టలేదు. పనివాళ్ళు దూరంగా నిల్చుని చూస్తున్నారు. ఈ యింటి బాధ్యతను అప్పజెప్పేవ్యక్తి లేదు. ఆ వ్యక్తే వుంటే తను రావలసిన అవసరం కలిగేదికాదు. ఈ బాధ్యతను తనకి తానుగా తీసుకోవాలి.

'అమ్మగార్ని యింటికి తీసుకొచ్చారా ?' అడిగింది పనిమనిషిని.

'తీసుకొచ్చారమ్మా. అయ్యగారు వొళ్ళుతెలియక పడివుండికూడా _ ఇంటికి తీసుకురావాలని ఏడ్చారమ్మా – పట్టుకోలేకపోయినాం. పెళ్ళిలాగా జరిగిపోయింది. ఎంతమంది జనం ; ఎన్ని పువ్వులు. పసుపూ కుంకుమా పోగులుపోశారు.'

'వాళ్ళవాళ్ళు ఎవరూ రాలేదా ?'

'స్వంతవాళ్ళు లేరటమ్మా. ఆ డాన్సుస్కూల్లోంచి అందరూ వచ్చేశారు. ఎంత పుణ్యం చేసుకోకపోతే అంత సుఖంగా పెళ్ళిపోతుంది. పసుప్పు కుంకుమల్తో పెళ్ళిపోయింది. ఆ జనం, పూరేగింపు చూసి _ 'చావు' అనుకోలేదు – పూలరథంలా పెళ్ళిపోయింది. పుణ్యాత్మురాలు. పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యం, తల్లీ !!

'పాప ఎక్కడుంది?'

'అదిగో – ఆమూల. తల్లి చావుకి యీ పిల్లే కారణం. పిల్ల తప్పిపోయిందని – ఆ తల్లి విరుచుకుపడిపోయింది.'

కృష్ణవేణి పాపని దగ్గిరకు రమ్మని పిలిచింది - పాప భయంగా - దూరంగా జరిగింది. పనివాళ్ళూ, వచ్చినవాళ్ళూ యీ పిల్లని నిందిస్తున్నారు కాబోలు.

'ఒదినా, అన్నయ్య అలా కదలకుండా నిద్రపోవచ్చా? నీరసం....'

కృష్ణవేణి ఆదుర్దాగా కదిలింది గదివైపుగా. అతను యింకా నిద్ర పోతూనే వున్నాడు.

రోజులు, వారాలు గడిచాయి. కృష్ణవేణి మద్రాసు వచ్చి అప్పుడే నెలరోజు లయింది. రాజగోపాల్ కళ్ళు తెరిచి చూస్తున్నాడు. అతని కళ్ళు చుట్టూవారిని గుర్తిస్తున్నాయి. కాని, నోరు తెరిచి ఎవరితో మాట్లాడడు. ఇది కావాలి అని అడగడు. డాక్టరు చెప్పిన ప్రకారం - పైసు పైసుకీ ఆహారం యిస్తోంది. అతని పక్కదగ్గరనుంచి క్షణంకూడా కదలటంలేదు. ఆ గదిలో నీడలా వుంటూ, నిశ్శబ్దంగా తనకి సేవలు చేస్తూ తిరుగుతున్న కృష్ణవేణివైపు అప్పుడప్పుడు అతని దృష్టి సారిస్తూ వుండేవాడు. ఆమె కదిలికలని అతని కళ్ళు వెన్నంటి పరిశీలిస్తూండేవి. ఒక్కొక్కసారి కళ్ళు చెమరుస్తూ వుండేవి.

ఒక వుదయం నీరసంగా నూతిలోంచి వచ్చినట్లు - 'నీకు శ్రమ కలిగించటానికి యింకా బ్రతికి వున్నాను' అన్నాడు అతను అతి నెమ్మదిగా.

కృష్ణవేణి కుడిచేత్తో అతని నోరు మూసింది. నిశ్శబ్దంగా అతని తలను గుండెలకి హత్తుకుంది. అంతవరకూ ఆనకట్ట కట్టబడిన అతని కన్నీళ్ళు గట్లు తెంచుకున్నాయి. ఆ గుండెల్లో తలదాచుకుని పసిపిల్లవాడిలా ఏడ్చాడు. అతను నిబ్బరంగా దుఃఖిస్తున్నాడు - అతని బుజాలు ఆమె గుండెలకింద ఎగిరి ఎగిరి పడుతున్నాయి.

'ఊరుకోండి - మన చేతుల్లో ఏమీలేదు. అదృష్టవంతురాలు. మీచేతుల్లో వెళ్ళిపోయింది....' అతన్ని సముదాయించింది. తన శ్రద్ధ, తన సేవ వృధాకాలేదు. ఈ కన్నీళ్ళు అతన్ని మళ్ళీ మనిషిని చేస్తాయి.

రాజగోపాల్ కొద్ది కొద్దిగా కోలుకుంటున్నాడు – అతను యింట్లో ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. నడిచి నడిచి అలిసిపోయిన పాంథునివలె కృష్ణవేణి నిశ్శబ్దతలో అతను సేవదీర్చుకుంటున్నాడు. అతను ఏమీ అడిగే అవసరం లేకుండానే – మందులు, భోజనం వగైరా అన్ని సమకూర్చేది. మంచంపక్కన వాలుకుర్చీ, అపక్క టేబుల్‌మీద పత్రికలూ, పుస్తకాలూ వుంచేది. ఆఫీసునుంచి ఎవ రొచ్చినా – అతను మాట్లాడటానికి ఇష్ట పడేవాడుకాదు, ఆఖరికి గురువుగార్ని కలుసుకోడానికికూడా విముఖత చూపేవాడు. ఈ యింట్లో తండ్రీ, చెల్లెళ్ళు, కూతురు, మామగారు, పనివాళ్ళు – తను మూడేళ్ళు పెంచిన పాప – వీళ్ళెవరూ లేనట్లు – వారి ఉనికిని గుర్తించనట్లు గదిలో కూచునేవాడు – గదిబయటకు వచ్చేవాడుకాదు. ఒక్క కృష్ణవేణితో రోజుకి ఒకటి అరా మాటలు మాట్లాడేవాడు. కృష్ణవేణి అతను ఏదన్నా అడిగితే బదులు చెప్పేది – మళ్ళీ నిశ్శబ్దంగా అయిపోయేది.

'అమ్మా – నేను వెళ్ళొస్తాను. మీ అమ్మ ఒక్కర్తే వుంది' అన్నాడు రాజారావుగారు బందరుకి ప్రయాణం అవుతూ.

'తాతయ్యా నేనూ వచ్చేస్తాను. నన్ను విశాఖపట్నంలో దించి, బందరు వెళ్ళు' అంది సీత. సీత కడుపుతో వుంది. ఆ పిల్లకి పురుడు బందరులో పొయ్యాలో, మద్రాసులో పొయ్యాలో నిశ్చయించుకోలేకుండా వున్నారు.

'నాన్నా – నేను యీ పరిస్థితిలో ఆయన్ని వదిలి రాలేను, రాను. సీతకి యిక్కడే పురుడు పోద్దాం. నువ్వూ, అమ్మా రండి' అంది కృష్ణవేణి.

ఆమె ఏ విషయంలోనూ ఎవరి సలహా అడగటంలేదు. ఇల్లు చూసుకోడంలో, పనివాళ్ళ విషయంలో ఎటువంటి మార్పూ జరపలేదు. సురేఖ పెట్టిన పనివాళ్ళే వున్నారు. ఆ యింట్లో అందరికీ స్వతంత్రం

వుంది – ఎవరికీ ఎటువంటి హక్కూలేదు. ఈ విచిత్ర పరిస్థితి – రాజగోపాల్ తండ్రికి, చెల్లెళ్ళకి నచ్చలేదు. వాళ్ళు అతను కొత్త దారిలో పడ్డాక వెళ్ళిపోయారు.

సీత వాల్తేర్ వెళ్ళిపోయింది. రాజారావుగారు బందరు వచ్చేశారు. ఆయనకి ఇంట్లో కాలం గడవడంలేదు. ఆర్ఫనేజ్‌లో ఆయన అవసరమూ అంతగాలేదు. ఇల్లు శూన్యంగా వుండేది. ఆయనా భార్యా ఒంటరిగా అలా కూచుని – సాయింత్రంనుంచి ఉదయానికి, ఉదయంనుంచి సాయింత్రానికి ఎదురు చూసేవారు. నలభై ఏళ్ళుగా యీ యింట్లో కృష్ణవేణీ, ఆ తరువాత సీత తిరుగాడారు. ఈనాడు కృష్ణవేణి – యీ పెద్దవయసులో వదిలి, భర్త దగ్గిర కెళ్ళిపోయింది. ఇంతేనా? అన్ని బంధాలకంటే ఈ వైవాహిక బంధమే అంత పటిష్టమైనదా? ఆనాటి కణ్వమహర్షికంటే, జనక మహారాజు కంటే తాను గొప్పవాడా? కాని ఆయన మనసు సమాధాన పడలేకుండా వుంది. నలభై ఏళ్ళు పెంచిన కృష్ణవేణీ – యిరవై ఏళ్లు పెంచిన సీత యిద్దరికీ రెక్కలొచ్చాయి – తమ జంటల వెనుక ఎగురుకుంటూ వెళ్ళిపోయారు. ఈ గూడు శూన్యంగా వుంది – ఖాళీగా వుంది. మరీ దీపాలు పెట్టేవేళకి ఆ దంపతు లిద్దరూ గుబులు గుబులుగా ఒకరి మొహం ఒకరు చూసుకుంటూ కూచునేవారు.

సీతకి ఏడునెలలు వచ్చాయి. పురిటికి సీతను తీసుకుని మద్రాసు రమ్మని ఉత్తరం రాసింది కృష్ణవేణీ. రాజగోపాల్ నెమ్మది నెమ్మదిగా ఆఫీసుకు వెళ్తున్నాడు – అయినా అతన్ని వంటరిగా వదిలి రాను, రాలేను – అని రాసింది.

తామిద్దరూ పెద్దవాళ్లు. సీతను తీసుకొచ్చి పురుడుపోసే బాధ్యత తాము నిర్వహించలేమని రాజారావుగారు భార్యనీ, సీతనీ తీసుకుని మద్రాసు వచ్చారు. ఇల్లు ఒక దరిన్నపడింది. రాజగోపాల్ ఆఫీసుకి వెళ్తున్నాడు,

వస్తున్నాడు. ఒక్క కృష్ణవేణితప్ప అతనితో మాట్లాడటానికి ఎవరికీ దమ్ములుండేవికావు. అన్నిటికంటే సీతకి మద్రాసు రావటం యిష్టంలేదు. తండ్రి వెనక తల్లి యిలా చుట్టి చుట్టి తిరగటం, సీతకి విసుగ్గా వుండేది ; కోపంగాకూడా వుండేది. ఇన్నేళ్లు వచ్చాక తల్లి, మళ్ళీ తండ్రి దగ్గిరకు రావటం, అతనికి సేవ చెయ్యడం చికాగ్గా వుంది. మనసులోకి యీ కోపాన్ని పైకి చెప్పలేకపోయేది. ఈ యింట్లో అయిష్టంగా – భారంగా తిరిగే సీతని చూస్తే కృష్ణవేణికి భయంగా వుండేది.

సీత వచ్చేదాకా – ఆ యింట్లో రేఖ ఒకవిధంగా 'ఎడ్జెస్టు' అయిపోతున్నది. తల్లి యికరాదు – తనని అంత ప్రేమించిన తల్లి యిక రాదు. తండ్రి తనని దగ్గిరకు పిలవడు – ఇంటో కొత్తవాళ్లు – కొత్తగా వచ్చిన యీ కొత్తమ్మ వేళకి భోజనం పెడుతుందిగాని, పూర్వంలాగా తనకి ముద్దులూ – గారాబాలు జరగవన్నవి ఆ చిన్ని బుర్రకు కొ_స్త కొస్త బోధపడుతోంది.

అడిగిందల్లా వాళ్లోకి వచ్చేరోజులు పోయాయి. తనకి బతిమాలి తినిపించేవ్యక్తులు లేరు. యివన్నీ ఎవరూ చెప్పకుండానే రేఖకు అర్థం అవుతున్నాయి. ఈ యింట్లో తనపైన ప్రేమ ఆపేక్ష కురిపించేవ్యక్తులు లేకపోయినా – తనని విదిలించేవారు, విసిరికొట్టి పొమ్మనేవారు లేరు. రేఖ వేళకింత తిని పనివాళ్ళతో కబుర్లు చెబుతూనో, తోటలో తిరుగుతూనో కాలం గడిపేది.

సీతకి యీ రేఖనిచూస్తే – ఎందుకో గిట్టేదికాదు. ఎవరికోపుట్టిన యీ పిల్ల యీ యింటో ఇంతటిభోగం అనుభవించటం నచ్చేది కాదు. తనకి సహజంగా చెందవలసిన యీ యింట్లోని హక్కు – మూర్ధేళ్ళపాటు ఈ దిక్కూ దివాణంలేని పిల్ల అనుభవించింది. ఒకప్పుడు అది ఆడుకున్న ఆటబొమ్మలు – గ్లాసుకేసులోవున్న దానికోసం కొన్న బొమ్మలు చూస్తున్న

పుడు సీత హృదయం భగ్గున మండేది. తను లక్కపిడతలు, తాటాకు బొమ్మలుతప్ప ఎరగదు. తన చిన్నప్పుడు ఇంతింత ప్లాస్టిక్ బొమ్మలు, 'కీ' యిస్తే తిరిగేకార్లు తనకు ఎవరూ కొనివ్వలేదు. దీనికి ఇంత భోగమా ?

సీత కళ్ళలోని జెలసీని, కోపాన్ని తన నాలుగేళ్ళజ్ఞానంతో కనిపెట్టి నట్లు, రేఖ దూరదూరంగా వుండేది. ఆ యింట్లో ఒక్కరాజారావుగారు - తాత అని పిలువమన్న ఆ కొత్తవ్యక్తితప్ప యింకెవరూ ఆ పాపని దగ్గరకు పిలిచేవారు కాదు. పిలిచినా వెళ్ళటానికి భయపడేది.

తండ్రి దూరంనుంచి కనపడినా, చూడనట్లు వెళ్ళిపోయేవాడు. తల్లితోపాటు యీ తండ్రి తనకిలేడు - తింటానికి తిండి, వుంటానికి యిల్లూ వున్నాయికొబట్టి రేఖ ఎదుగుతోంది. పిల్లలకి సహజంగావుండే 'రెసిస్టెన్సు' వల్ల - ఎదుగుతూ వుంది.

సీతకి పురుడు వచ్చింది. మొగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడి ప్రవేశంతో యింట్లో కొత్త కదలిక. రాజగోపాల్ ఆఫీసుకి వెళ్తూ ఒకోసారి తొట్టెలోపడుకుని ఏడ్చే ఆ పసివాడిపంక క్షణం ఆగిచూస్తాడు. మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినట్లు వెళ్ళిపోతాడు. ఈ పసివాని ఏడుపు, అతనిని ఎక్కడికో జ్ఞాపకాల అడుగుపొరలోకి తీసుకువెళుతోంది. ఆ జ్ఞాపకాలని బలవంతాన అణచివేస్తున్నట్లు - దూరానికి నెట్టుతున్నట్లు గబగబ పారిపోతూ వున్నాడు.

సీతని నర్సింగ్‌హోమ్‌లో చేర్చిన పదిరోజుల్లో - రోజూ రేఖ తాతయ్యతోపాటు, కారులో వెళ్తుండేది. కారు దిగేది కాదు. అందులోనే కూచుని తాతగారితో వెనక్కి వచ్చేది. ఈ పసిదాన్ని చూస్తే రాజారావు గార్కి జాలిగా వుండేది. ప్రేమకీ, అభిమానానికీ కరువు వాచినట్లు ఆయన కాళ్ళకి చుట్టుకుపోయేది. అయితే, సీత చూస్తుండగా - రేఖని దగ్గిరకు పిలవడానికి రాజారావుగారికి భయంగా వుండేది.

'ఈ దిక్కుమాలిన పిల్ల. నీకు మనుమరాలన్నమాట. ఎవరికి పుట్టిందో' సీత మాటలు వింటుంటే - రాజారావుగార్కి అప్పుడప్పుడు మతి పోతున్నట్లుగా వుంటుంది. తను గాంధీజీ అడుగుజాడలో నడిచాడు. అహింస, సర్వసమానత్వం మొదలైన గాంధీసూత్రాలు తన రక్తంలో జీర్ణించుకుపోయాయి. తన కూతురు కృష్ణవేణిలో కూడా సహనం, ఆత్మ విశ్వాసం, సానుభూతివంటి గుణాలు వున్నాయి. కాని ఈ సీతలో విశాల దృక్పథం మచ్చుకైనా కనపడదు. ప్రతివిషయంలో సంకుచితంగా ఆలోచించడం, పట్టుదల, పెంకితనం యివి అనాటికానాడు పెరుగుతున్నాయి తప్ప - తగ్గటంలేదు. ఈ గుణాలు ఎలా వచ్చాయి ? ఎక్కడినుంచి వచ్చాయి.

సీత పెళ్ళిలో తండ్రితెచ్చిన నగలు పెట్టుకోనని, చీరె కట్టుకోనని చేసిన గొడవ ఆయన మర్చిపోలేదు. ఈ విషయం బయటకి పొక్కకుండా తాము జాగ్రత్తపడ్డారు. తండ్రి సంపద తనకి వద్దు అని యింత పట్టుదలగా వుండే సీత, ఈనాడు యిక్కడికి ఎలా వచ్చింది ? తండ్రికార్లో ఎలా తిరుగుతోంది ?

పుట్టినప్పటినుంచీ కార్లో తిరిగిన రేఖ - యీనాడు తనని కార్లో రావద్దని - సీత విదిలించికొడుతుంటే దెబ్బతిన్నట్లు చూసేది.

'పోనీ రానివ్వవమ్మా - పాపం, చంటిపిల్ల.' అనేవారు రాజారావు గారు అనునయిస్తూ.

'అదెక్కితే నేను రాను. టాక్సీ కట్టించుకుని డాక్టరు దగ్గర కెడతాను. నాకేం గతిలేదనుకున్నావా - మా ఆయన నాకు చాలా యిచ్చి పంపారు' అంది సీత.

'అది కాదు....'

'ఇదిగో తాతయ్యా – మీకు యిష్టంఅయితే – దాన్ని నెత్తిన ఎక్కించుకోండి. అంతేగాని నా పిల్లవాడితో సమంగా కూచోటానికి వీల్లేదు' అంది సీత.

రాజారావుగారు నిస్సహాయంగా కూతురువంక చూశారు. కృష్ణవేణి – తను ఏమీ చెయ్యలేనన్నట్లు – తల వంచుకుంది. ఆ యింట్లో సీత పట్టుదల అందరికీ తెలుసు. తొలికానుపు. కోపంవస్తే నెల్లాళ్ళలోపునే అత్తవారింటికి వెళ్ళిపోతుందనికూడా వారికి తెలుసు. ఆ అమ్మాయిలో అంతటి పట్టుదల వుంది.

రేఖ తాతగారివంక ఆశగా చూస్తున్నది. శుభ్రమైన బట్టలుకట్టుకుని బాబ్ దువ్వుకుని రడీగా వుంది. ఇన్నాళ్లూ అమ్మ బతికివున్న రోజుల్లో స్వతంత్రంగా కారెక్కి గంతులేసేది. ఈరోజు ఆ ధైర్యం లేదు. ఎవరన్నా తీసుకెళితే – ఎక్కమంటే – కారు ఎక్కుతోంది. ఈ తాత తనని తీసుకెడ్తాడని ఆశగా చూస్తోంది.

'ఇంకోసారి పెద్దాం. అక్కకి వంటో బాగాలేదు' అన్నారు రాజారావుగారు.

'ఎవరు ? దానికి నేను అక్కనా ? తాతయ్యా – వరసలు బాగానే కలుపుతున్నావ్ – దానికి నేను ఏమీకాను – ఎవరికిపుట్టిందో, పాడు. నాకు చెల్లెలేమిటి?' సీత బాబుని గుండెలకి హత్తుకుంటూ, అంది.

ఆయన మాట్లాడలేదు. ఈమధ్య రాజారావుగార్కి అల్లుడిమీదకూడా కోపం వస్తున్నది. సురేఖ పోయింది – నిజమే. పోయినవాళ్ళు రారు. తింటున్నాడు – తిరుగుతున్నాడు. అన్నీ మామూలు గాడిలో పడినపుడు – ఈ నోరులేని పసిదాని విషయంలో ఎందు కింత వుదాసీనంగా వుంటున్నాడు? దాని కేంతెలుసు ? తను కనిపించలేవన్న ఆదుర్దాలో తల్లి గుండె చెదిరి పోయిందని ! అభం శుభం ఎరగని ఆ పసిదాన్ని ఇలా దూరంగా వుంచటం

ఏం న్యాయం? దానికి ఎవ రున్నారు? ఎక్కడికి పోతుంది? కావాలని తెచ్చుకున్న – ఈ జీవిని యిలా నిర్దాక్షిణ్యంగా – గాలికి వదలటం న్యాయమా ?

రాజారావుగారు – అల్లుడి స్వభావం గురించి ఆలోచిస్తున్నారు. ఇరవై ఏళ్ళక్రితం – యితను యిలాగే తన కూతురిని నిర్దాక్షిణ్యంగా వదిలి వెళ్ళిపోయాడు ? ఆరోజు ఒక్క సెకనుకూడా – కన్నబిడ్డను గూర్చిగాని, కట్టుకున్న పెళ్ళాన్నిగూర్చిగాని యోచించలేదు. అలా యోచించినవాడై తే – సురేఖదగ్గిరకు పారిపోయి వచ్చేవాడుకాదు. పరిస్థితులనుంచి పారిపోవటం – అతని స్వభావలక్షణమా ! అలా అయితే – అవతలవాళ్ళ గతేమిటి?

రోజు రోజుకీ ఈ యింట్లో రేఖ గతి – నికృష్టమైపోతున్నది. సీత నోటికి దడిసి – రాజారావుగారు దాన్ని పిలవలేకపోయేవారు. సీత తన పసివాడి పోషణలో సతమతమైపోతున్నది. కృష్ణవేణికి భర్తసేవ – అతని ఆరోగ్యంతప్ప మరో ధ్యాసలేదు.

ఒకరోజు రాత్రి – సన్నగా ఒకమూలనుంచి ఏడుపు వినిపిస్తున్నది. ఆ సాయింత్రం రాజారావుగారు యింట్లోలేరు. ఇంటి కొచ్చి – భోంచేసి వెంటనే పడుకున్నారు. మళ్ళీ ఏడుపు – ఎక్కిళ్ళతో ఏడుపు.

ఆయన లేచి కూచున్నాడు. పక్కమంచంమీద పడుకున్న రుక్మిణమ్మగారు నెమ్మదిగా అంటున్నది—'నేను చూడలేకుండా వున్నానండి. పాపం, ఆ చిన్నదాన్ని కొట్టింది.'

'దేనికి?'

'పిల్లవాడు చాపమీద పడుకుని ఉంటే పక్కన పెళ్ళి కూచుని బొమ్మల్తో ఆడిస్తోంది.'

'ఊఁ'

'హ డెందుకో ఏడ్చాడు. ఆ ఏడుపు విని, యిది యేదో చేసిందని, సీత బరబర యీడ్చుకెళ్ళి రెండు వేసింది.'

'అమ్మాయి ఏం అనలేదా ?'

'దానికి కూతుర్ని చూస్తే భయం'

ఆయన లేవబోయారు.

'ఈ కాసేపు సముదాయించినంతమాత్రాన - ఆ పసిదాని కష్టం తీరదు. దానికేదన్నా వుపాయం చూడండి' అందామె.

'ఏం చెయ్యమన్నావు ? ఆ పిల్లకి ఎవరూ లేరు. ఇప్పుడు ఎక్కడికి పోతుంది. అల్లుడికేమో యీ పిల్లవిషయం పట్టదు'

'మీరు చెప్పండి'

'ఏమని చెప్పమన్నావు - 'నీ కూతురికి దీన్నిచూస్తే గిట్టదు. నీ పెళ్ళానికి నీ కూతురంటే భయం - ఎవరికీ చెందని యీ పసిదాన్ని గొంతు నలిపిపారెయ్య'మని చెప్పనా ?'

'అదికాదు. మనం తీసుకెళ్ళిపోదాం. మనకీ ఎవ్వరూలేరు. కృష్ణవేణి సంసారం కుదుటపడింది. సీతకి మొగుడూ - పిల్లవాడూ వున్నారు. మనకి ఎవరూ లేరు. దీన్ని పెంచుకుందాం.'

'ఈ వయసులోనా ?'

'ఈ వయసులోనే - పిల్లలు కావాలి. అది అనాధ - ఎవరికీ అక్కరలేదు. మనమా ముసలాళ్ళం - మనకో పిల్లకావాలి'

'అల్లుడు వొప్పుకుంటాడా ?'

'అతనిదేం లేదు. అమ్మాయి ఏం చెపుతే అది వింటాడు' అంది రుక్మిణమ్మగారు.

రాజారావుగారు సన్నగా ఎక్కిళ్ళు వస్తున్నవైపుకి నడిచారు. రేఖ మంచంమీద వుండలా చుట్టుకు - కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది.

'పాపా - రా - నా దగ్గిరపడుకుందుగాని -' ఎత్తుకుని తీసుకొచ్చి పడుకోపెట్టుకున్నారు.

'తాతయ్యా, రోజూ నేను నీ దగ్గరే పడుకుంటాను. ఒక్కర్తెనీ పడుకుంటే భయంగావుంది' అంది రేఖ ఆయన్ని కప్పలా కరుచుకుంటూ.

'అలాగే తల్లి. ఈ కంఠంలో వూపిరివున్నంతవరకూ నీ స్థానం యీ గుండెలమీదనే' అంటూ దాన్ని దగ్గిరకు లాక్కున్నారు. తాతయ్య మాటలు దానికి అర్థం అవలేదు. కాని అక్కడ వెచ్చగా - తన తల్లివడి లాగా సుఖంగా వుంది. రేఖ తాతని కరుచుకుని నిద్రలోకి జారుకుంది.

రాజారావుగారు - రేఖని చదివించి పెద్దదాన్ని చెయ్యాలని - ప్లానులు వేస్తూ నిద్రలోకి జారుకున్నారు.

ఆ రోజున ....

రాజారావుగారు సామాను సర్దుకుంటున్నారు. సీత మరో పది రోజులు యిక్కడేవుండి ఆ తరువాత భర్తదగ్గర కెళతానంది. ఆయనకి - యీ రేఖని తీసుకుని యీ పరిసరాలనుంచి దూరంగా వెళ్ళిపోవాలని వుంది.

'అమ్మా - పాపని మాతో తీసుకెళ్ళిపోతాను' అన్నారాయన కృష్ణవేణితో.

కృష్ణవేణి నిస్సహాయంగా చూస్తున్నది.

రేఖమీద కృష్ణవేణికి ద్వేషంలేదు. అలా అని ప్రేమలేదు. ఇటు సీతకి ఏమీ చెప్పలేదు. కూతురుమీద భర్తతో ఏమని చెబుతుంది? రాజగోపాల్‌కి చెప్పకుండా తను ఏపనీ చెయ్యలేదు - తను అస్వతంత్రురాలు.

ఆ సాయంత్రం ....

రాజగోపాల్ కారుదిగి ఇంట్లోకి రాబోతుంటే - క్రోటన్స్ మొక్కల పక్కన చిన్నమూట పుచ్చుకు రేఖ నిలబడివుంది - కారు దిగుతున్న రాజగోపాల్‌కి కనిపించేటట్లుగా నిల్చుని ....

'డాడీ' అంది భయంగా చూస్తూ నెమ్మదిగా.

# ఏమిటీ జీవితాలు

రాజగోపాల్ దీర్ఘసుషుప్తిలోంచి మేలుకొన్నవాడిలా – ఆ పిలుపు ఏనో లోకాలనుంచి వింటున్నవాడిలాగా – అడుగు ముందుకు పడక నిల్చుండిపోయాడు.

రేఖ భయంగా – కళ్ళెత్తి చూస్తున్నది.

ఆ కళ్ళలో భీతి.

'డాడీ – ' మళ్ళీ పిలిచింది.

రాజగోపాల్ యీసారి శ్రద్ధగా వినటానికి ప్రయత్నిస్తున్నట్లు తలఎత్తి చూశాడు – చేతిలో చిన్న బట్టలమూట.

'నేను తాతయ్యతో వెళ్ళిపోతాను, డాడీ! నన్ను పంపించెయ్యండి' వస్తూన్న ఏడుపుని బలవంతాన ఆపుకుంటూ, అడుగుతోంది రేఖ.

'ఎక్కడికి బేబీ .... ' అతని కంఠంలో చికాకు లేదు, కోపమూ లేదు – ఆ కంఠం చిరపరిచితంగా వుంది.

'రేఖని మాతో తీసుకెళ్ళిపోతాము'

'దేనికి – ' మామగారివంకచూస్తూ అడిగాడు రాజగోపాల్.

'ఇక్కడ .... ఇక్కడ .... ' అయన వివరంగా చెప్పలేకుండా వున్నారు.

'బేబీకి అమ్మలేదు. కాని – నేను వున్నాను – ఇన్నిరోజులూ న బాధగురించే ఆలోచించాను. కాని, ఆ చిన్నదాని వేదన గుర్తించలేక పోయాను .... శిలనైపోయాను .... బేబీ, నువ్వు ఎక్కడికీ వెళ్ళద్దు .... నాకు కోపంలేదు .... యిలా రామ్మా .... ' రాజగోపాల్ రెండుచేతులూ జాచాడు. రేఖ బాణంలా దూసుకుంటూ ఆ రెండూ చేతుల్లోనూ యిమిడి పోయింది.

'వెక్కివెక్కి ఏడుస్తున్న – ఆ చిన్నికంఠంతో సురేఖ నాట్యరవళి వినిపించింది రాజగోపాల్‌కి.

రాజారావుగారు నిట్టూర్పు విడిచారు – కృష్ణవేణిలాగానే, రేఖకి కూడా రాజగోపాల్ కావాలి. వాళ్ళు సంతోషంగా వుండటమే తనకి కావాలి.

మూడురోజుల తర్వాత ....

సీత ఎన్నటికి ఈ యింటికి రానని, తల్లిదగ్గర శపథం చేసి రైలు ఎక్కింది.

ఆమె వెళ్ళిపోతుంటే కృష్ణవేణికి అంతబాధ అనిపించలేదు. ఎందుకంటే తన చెయ్యిపుచ్చుకు ఈ రేఖ నిలబడివుంది.

అంతక్రితంరోజు రాజగోపాల్ రేఖ భవిష్యత్‌గురించి తన అభిప్రాయం అడిగాడు. పెళ్ళయిన ఇరవై ఒక్కఏళ్ళకి భర్త తనతో మన్నాళ్ళకి సాయిలా పాయిలా మాట్లాడాడు.

తన కడుపున పుట్టిన సీత తీసుకురాలేని సన్నిహితత్వాన్ని ఎవరికో పుట్టిన రేఖ తామిద్దరిమధ్యా తీసుకురాగలిగింది.

'రేఖ — సురేఖ !

ఎంత విచిత్రమీ బ్రతుకుబాట ! !



# మా ఇతర నవలలు



| | |
|---|---|
| ఒడ్డుకు చేరిన ఒంటరి కెరటం | అచ్యుతవల్లి |
| ఇదెక్కడి న్యాయం | ,, |
| పూలు ముళ్ళు | ,, |
| సీత కలలు | ,, |
| తెగిన గాలిపటం | గుల్షన్ నందా |
| నీలికమలం | ,, |
| ఆర్య చాణక్యుడు | వేదుల సూర్యనారాయ |
| జీవనరాగం | ఇ. రామచంద్రం |
| సమిధ | ఇ. కుసుమకుమారి |
| రూపం శాపం | శ్రీధర |
| గాలివాన | శ్యామలారాణి |
| మిధ్యాబింబాలు | డి. వి. ఎస్. ఆర్. వ |
| అసతోమా | ,, |
| వెలుగుబాట | ,, |
| సన్మానం | గోవిందరాజు ~ |
| తాతయ్య గరల్ ఫ్రెండ్ | సుధాదేవి |
| జీవిత గమ్యం | యర్రగుంట వరలక్ష్మీదే |
| కాంచనగంగ | సుధాగౌతమ్ |
| దీపం వెలిగింది | తుర్లపాటి రాజేశ్వరి |
| శశికళ | ,, |
| వంశీరవం | ,, |

★